S. V. UNIVERSITY ORIENTAL SERIES—NO. 6

సాధారణ సంపాదకులు : డాక్టర్ ఎస్. శంకరనారాయణన్

# శ్రీ భగవద్గీత

(తొలి తెలుగు వచనభావానువాదం)

తాళ్లపాక పెద తిరుమలాచార్యులు

ప్రస్తావన :
ప్రొఫెసర్ కొత్త సచ్చిదానందమూర్తి,
ఉపకులపతి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

పరిష్కర్త :
ఆచార్య జి. యన్. రెడ్డి

సహాయకులు :
కె. జె. కృష్ణమూర్తి
ఎ. వి. శ్రీనివాసాచార్యులు



శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్య పరిశోధనాలయం,
తిరుపతి.

# PREFACE

This is my previlege to introduce to the world of scholars this first publication (Sri Venkateswara University Oriental Series No. 6) of the earliest known Telugu commentary on the world famous *Srimad Bhagavad Gita*. This commentary is the work of the well known Telugu Vaggeyakara (composer of songs) Peda Tirumalacharya (1475-1554 A.D.) who was a worthy son of the more reputed composer Annamacharya (1424—1503 A.D.) of Tallapakam, a village in the Cuddapah District, Andhra Pradesh. Both the son and the father were great devotees of God Sri Venkateswara, the Lord of the Seven Hills in the Chitoor District, and their songs, running to several thousands, are simply the outbursts of their sincere deep devotion to the Lord.

The commentary under publication is written in a simple colloquial Telugu that was in common use in the days to which the work belongs. Further, the author was a staunch follower of the Visistadvaita system as expounded by Sri Ramanujacharya and hence in his commentary he has closely followed that great philosopher's well known Sanskrit commentary on the *Bhagavad Gita*·

The present edition has been brought out by collating eight manuscripts of the work that are available in the Manuscript collections in the Sri Venkateswara University Oriental Research Institute, the Tamilnadu Government Oriental Manuscript Library, Madras, and the Sarasvati Mahal Library, Thanjavur· My thanks are due to the authorities of the last mentioned two MSS libraries for their kind co-operation and help they rendered us in consulting the manuscripts of their respective libraries. I offer my sincere thanks to Dr. G. N. Reddy, Professor and Head of the Department of Telugu, Sri Venkateswara University, for complying with our request to undertake the work of editing this book. He has been assisted, in this task, by Sri K. J. Krishnamoorthy, Lecturer in Telugu, and Sri A. V. Srinivasacharyulu, Research Assistant in Telugu, both belonging to the staff of our Sri Venkateswara University Oriental Research Institute. I

heartly congratulate these scholars for their success in bringing out this scholarly edition.

Our Oriental Research Institute and the present edition owe a lot to the dynamic personality of our esteemed Vice-Chancellor, Prof. K. Satchidananda Murty. It is he who has undertaken the task of reorganising the Oriental Research Institute, in the line of recommendations of a committee of experts, specially constituted for the purpose. He has sanctioned the necessary funds for bringing out this book. Above all, he has enriched this edition by adding his scholarly Introduction. I am indeed very much beholden to him for all these kind acts.

I thank Sri D. Hanumantha Rao of Kranti Press, Madras, for printing this book in an attractive manner within a short period.

5th March,<br>1978<br>TIRUPATI.

S. SANKARANARAYANAN,<br>General Editor,<br>Director,<br>Sri Venkateswara University<br>Oriental Institute,<br>TIRUPATI.

# ప్ర స్తా వ న

ప్రొఫెసర్ కె. సచ్చిదానందమూర్తి

ఉపకులపతి

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం

## 1

శ్రీ విష్ణుభక్తిప్రచారం, ఆంధ్రసారస్వతసేవ అపారంగా చేశారు శ్రీ తాళ్లపాక అన్నమాచార్యులు, ఆయన సంతతిన్నీ. క్రీ. శ. 12-13 శతాబ్దాలనాటి వీరశైవ కవులవలెనే వీరున్ను ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉండే భాషలో రచనలు చేసి, తెలుగుకు చాలా స్ఫూర్తినిచ్చి, దాన్ని ఎంతగానో వృద్ధి చేశారు. ఒకే కుటుంబానికి చెందినవారు ఇంతటి మహాకార్యం నిర్వహించటం, ఇంత దీర్ఘ కాలం (150 ఏండ్లు) సారస్వతకృషి చేయటం, వీరి సమిష్టినిర్వాహానికంటే గురుతరమైనది ఇంతవరకు ఇంకెవరూ సాధించలేకపోవటం విశేషాలు.

క్రీ. శ. 10 వ శతాబ్దంలో నేటి కర్నూలుజిల్లాలోని నందవరం అనే పట్టణాన్ని నందుడనే రాజు పాలిస్తుండేవాడు. ఆయన కాశీయాత్రకు వెళ్లినప్పుడు అక్కడ కొందరు వైదీకబ్రాహ్మణులు చాముండేశ్వరి(చౌడేశ్వరి) ఉపాసకులు ఆయనకు పరిచయం అయ్యారు. తర్వాత వారణాసిలో క్షామంరాగా ఆ బ్రాహ్మణకుటుంబాలు ఆంధ్రదేశానికి వలస వచ్చి, ఈ రాజాశ్రయంలో నందవరంలో స్థిరపడి నందవరీక బ్రాహ్మణులుగా పేర్కొనబడ్డారు. వారిలో చాలామంది తర్వాత నియోగులయ్యారు. కాలక్రమాన నేటి కర్నూలు, కడపజిల్లాల్లో వారి కుటుంబాలు వ్యాపించినయి. కడప జిల్లా, రాజంపేటతాలూకా, తాళ్లపాకగ్రామంలో "తాళ్లపాక" ఇంటిపేరుగా నివసిస్తున్న ఒక కుటుంబంలో అన్నమయ్య క్రీ. శ. 1424*లో జన్మించారు. ఈయన

---

* శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి, డా. వేటూరి ఆనందమూర్తి ప్రకారం, అన్నమయ్య క్రీ. శ. 1408 లో జన్మించారని శ్రీ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, శ్రీ చాగంటి శేషయ్య, శ్రీ గౌరిపెద్ది రామసుబ్బ శర్మ భావించారు.

తిరుమలయాత్ర చేసి అక్కడనే శ్రీవైష్ణవం స్వీకరించారు. భగవదాజ్ఞానుసారం ఇది జరిగిందని చెప్పుతారు. అప్పటినుంచి ఈయన అన్నమాచార్యులుగా పేరొందారు. క్రీ. శ. 1440 లో ఈయనకు శ్రీవెంకటేశ్వరస్వామి సాక్షాత్కారం కల్గింది. అహోబిలమఠస్థాపకులు, యతిశ్రేష్ఠులు, మహాయశస్సంపన్నులు, "ఆముక్తమాల్యద"లో నుతింపబడినవారు అయిన శఠకోపముని వద్ద వేదాంతాదిశాస్త్రాలు అధ్యయనం చేశారు. వీరిది వడగలై ప్రస్థానానికి చెందిన విశిష్టాద్వైతం. ఈయన కిద్దరు భార్యలు, ఇద్దరు కుమారులు, ఇద్దరు కూతుళ్లున్ను. టంగుటూరు పాలకుడుగాను, చంద్రగిరి అధీశుడుగాను ఉండి క్రీ. శ. 1486 లో విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించిన సాళువ నరసింహరాయలకు అన్నమయ్య "హితుడు, గురుడు, బంధువు" కాగల్గాడు. అందుచేత ఈయనకు గౌరవం ఐశ్వర్యం ప్రాభవం కలిగినయి. అయినప్పటికి అన్నమయ్య ఎన్నడు రాజుమీద కవిత్వంగాని, ఆయనకు అంకితంగా ఒక పద్యంగాని, కీర్తనగాని చెప్పకపోవటం, ఈయన ఏకాంతభక్తికి తార్కాణం. ఈయన 32 వేల సంకీర్తనలు, 12 శతకాలు, ఇంకా నాలుగు ఇతర రచనలు చేశారు. తిరుమలలో సంకీర్తనభండారం స్థాపించారు. ఈయన మొదటిభార్య, కొడుకులు, మనమళ్లు, అల్లుళ్లు, దౌహిత్రులు కూడా పండితులుగా, కవులుగా, కీర్తిగాంచినవారు. అన్నివిధాల సార్థకజన్ముడు మహాపురుషుడు అయిన అన్నమాచార్యులు క్రీ. శ. 1503 లో పరమపదించారు.

అన్నమాచార్యులు ఆది ఆంధ్రపదకవి, తెలుగులో తొలి వాగ్గేయకారులు. ఈయన జయదేవునిచే ప్రభావితుడై, కర్ణాటకగేయరచయిత శ్రీపాదరాయస్వామి ఒక విధంగా తనకు మార్గదర్శకుడు కాగా, "పావనములు, హరిభక్తివిభావనములు, సర్వమంత్రపరమ రహస్యోద్భావనములు, గాయక నికరావనములు, వరకవిత్వ వాణీవీణానాదంబులు, కృతసుజనాహ్లాదంబులు, యతిలోకాగమవీథులు, వేంకటశైలవల్లభరతిక్రీడారహస్యంబులు,"* అయిన పదాలు నిర్మించారు. పురందరదాసు ఈయనను గురుతుల్యునిగా భావించారు; క్షేత్రయ్యపై ఈయన ప్రభావం బాగా పడింది. తర్వాతి కర్ణాటకసంగీతజ్ఞులుకూడ ఈయనకు ఋణపడినవారే. ఇప్పుడీయన సంకీర్తనలు రాగిరేకులమీద వ్రాసినవి 14358 లభిస్తున్నయి; సగానికిపైగా పోయినయి. ఇంతటి విస్తృతసాహిత్యాన్ని సృజించినవారు కొద్దిమందే ఉంటారు.

గోపికలు దుర్ధరగేహశృంఖలాలు తప్పించుకొని, మదర్థోజ్ఝిత లోకవేదస్వులైన మహాభాగులని శ్రీకృష్ణుడే ప్రశంపించారనీ, మునులకుకూడా దుర్లభమైన భక్తి

* చిన తిరుమలయ్య "సంకీర్తన లక్షణం."

గోపికలచే ప్రవ_ర్తితమైంది అనీ, తమ హరికథోద్గీతంచేత భువనత్రయాన్ని పవిత్రం చేసిన నందవ్రజస్త్రీల పాదరేణువులకు మాటిమాటికి నమస్కరిస్తాననీ, శ్రీకృష్ణుని స్నేహితుడు, మహాభక్తుడు, ఉద్ధవుడు చెప్పారనీ, శ్రీమద్భాగవతంలో ఉంది. భక్తి సూత్రకర్త మహర్షి నారదుడు భక్తి పరమప్రేమరూపమనీ, భగవదర్పిత అఖిల ఆచారత, తద్విస్మరణంలో పరమవ్యాకులత, భక్తికి లక్షణాలనీ చెప్పి, అట్టి భక్తికి పరమోత్తమ ఉదాహరణంగా వ్రజగోపికలభక్తి అన్నారు. అట్టి భక్తి పరమప్రేమ రూపమైనా, అందులో భగవంతుని మాహాత్మ్యజ్ఞానవిస్మృతి ఉండదు. శృంగారంచే ఓతప్రోతమైన ఇట్టి దివ్యభక్తిని మొట్టమొదటిసారిగా అన్నమాచార్యులు తెలుగులో రచింపబడిన సంకీర్తనల ద్వారా ద్రవిడాంధ్రదేశాలలో ప్రచారంచేసి వ్రజగోపికాభక్తి సంప్రదాయాన్ని జనసామాన్యానికి తెలిసేట్టు చేశారు. పరమాత్ముడు, నిఖిలాత్ముడైన గోవిందునిలో రూఢభావం ఏర్పడినప్పుడు వ్యభిచారదుష్టులు కూడా పవిత్రులవుతారు; సాధారణశీలంగలవారి కామంకూడా పరిణామం చెంది భక్తిగా మారుతుంది. అలాటి రూఢభావం కల్గటానికి రాధామాధవుల, శ్రీవెంకటేశ్వరుల రతిక్రీడారహస్యావగాహన ఒక మార్గం. అన్నమాచార్యుల కీర్తనలు నాయికాభావం—గోపీభావం చెందిన మహాభావుకుడు వ్రాసినవి. నమ్మాళ్వారుల గోదాదేవియొక్క, కొందరు సూఫీల, సెయింట్ థెరిసాఇత్యాది క్రైస్తవ రహస్యవాదుల రచనల వలెనే అన్నమాచార్యుల సంకీర్తనల లోతులు తత్త్వవిదులకే బాగా అవగతం అవుతయి. ఈయన కుమారుడన్నట్టుగా ఈ సంకీర్తనలు—

"నెట్టన వేదాంతములై నిత్యములై పొడసూపీ
పుట్టుతోనె గురువులై బోధించీని
గట్టి వరాలిచ్చే శ్రీవెంకటనాథుని మెప్పించీ
నట్టి తాళ్లపాక అన్నమయ్య పదములు"

## 2

అన్నమాచార్యుల రెండవభార్య అక్కలమ్మ. వారికిపుట్టిన కుమారుడు పెద తిరుమలయ్య, లేక పెద తిరుమలాచార్యులు. ఈయన క్రీ.శ. 1475 లో జన్మించారు.*

---

* శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు కనిపెట్టిన ఆధారంపై. శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు క్రీ. శ. 1473 అనీ, డా. వేటూరి ఆనందమూర్తి క్రీ. శ. 1458-60 మధ్య అనీ అన్నారు.

ఈయన అన్న నరసింహకవి. అన్నమయ్య మొదటి భార్య తిమ్మక్క కుమారుడు, బహుశా "కవికర్ణరసాయనాన్ని" రచించినవారు. వీరి కుటుంబానికి ఆశ్రయమైన సాళువ నరసింహరాయల అనంతరం (క్రీ. శ. 1491 నుండి) వీరికి రాజకీయవాతావరణం ప్రతికూలమైంది. సాళువ నరసింహరాయల కుమారుల్ని బందీలనుగా ఉంచి నామమాత్రపాలకులనుగా చెప్తూ, వారిసేనాని తుళువ నరసనాయకుడు, ఈయన కుమారుడు వీర నరసింహరాయలు, కొంతకాలం పరిపాలనచేసినందువలన, వీరనరసింహరాయలు క్రీ. శ. 1505 లో విజయనగరసింహాసనం స్వాయత్తంచేసుకున్నందువలన, అన్నమాచార్యులు, ఆయన కుమారులున్ను సాళువ నరసింహరాయల కుమారుల పక్షీయులైనందువలన అన్నమాచార్యుల కుటుంబానికి ఈ అవస్థ కలిగింది. అరులెవరో (వీళ్లు తుళువ నరసనాయకుడో, వీర నరసింహరాయలో కావచ్చును) ఈయనపైకత్తి విసిరారనీ, ఆ ఖడ్గధార ఈయనకు దండగాను కస్తూరివాటుగాను అయిందనీ ఒక కీర్తనలో ఈయనే చెప్పాడు. ఆ పరిస్థితుల్లో పెద తిరుమలాచార్యులు స్వస్థలంవీడి తిరుమలలో నివసించాల్సి వచ్చింది. వీర నరసింహరాయల తర్వాత క్రీ. శ. 1509 నుంచి 1529 వరకు కృష్ణదేవరాయలు విజయనగరసమ్రాట్టు. ఆయన ఆస్థానానికి పెద తిరుమలాచార్యులు వెళ్లినట్టు, సత్కారం పొందటానికి ప్రయత్నించినట్టు, ఆచార్యులు పతివ్రతాధర్మాన్ని గురించి చెప్పిన పద్యాన్ని తెనాలి రామలింగకవి అవహేళన చేసినట్టు, అయినా కృష్ణదేవరాయలు ఈయనకు యథోచితసత్కారం చేసి పంపినట్టు రవ్వంత ఆధారం ఉంది.* మొత్తంమీద ఆకాలంలో పెద తిరుమలాచార్యులకు రాజాశ్రయం లేనట్టే.† కాని సాళువ తిమ్మరుసుమంత్రికి ఆచార్యులపై ప్రేమాదరాలు ఉండేవి. కాబట్టే తన చివరిరోజుల్లో తిమ్మరుసుమంత్రి తిరుమలలో పెద తిరుమలాచార్యుల అండన జీవించాడు. కృష్ణదేవరాయల తర్వాత విజయనగరచక్రవర్తి అయిన అచ్యుతదేవరాయలు (క్రీ. శ. 1529-1542) పెద తిరుమలాచార్యులకు స్నేహితుడు, శిష్యప్రాయుడు. ఆ తర్వాత వచ్చిన రాజులందరు కూడా పెద తిరుమలాచార్యులకు

---

* శ్రీ గురుజాడ రామమూర్తిపంతులు "కవిజీవితములు." పుట 236 ఆధారంగా డా. వేటూరి ఆనందమూర్తి "తాళ్లపాకకవుల కృతులు- వివిధసాహితీ ప్రక్రియలు" 1974, పుట 350-1 అధోజ్ఞాపిక.

† కృష్ణదేవరాయలు తాళ్లపాకవారి ఒకటి రెండు అగ్రహారాలను, వారేర్పరచిన కైంకర్యాలకు చెందిన ప్రసాదభాగాలను కొన్నిటిని, వారికి దక్కకుండా చేశాడు; అందుచే వీరిపట్ల ఆయన ప్రతికూలుడు.

ఆయన కుటుంబానికి అన్నివిధాల అండగా ఉన్నారనే తెలుస్తోంది. ఫెర్నావో నూనిజ్ వ్రాతల్లో అచ్యుతదేవరాయలు దుర్మార్గుడు, క్రూరుడు, పిరికివాడు, విశ్వాస ఘాతుకుడుగా చిత్రింపబడ్డాడు; కానీ రాజనాథడిండిముని "అచ్యుతరాయాభ్యుదయం"లో అచ్యుతదేవరాయలు సమస్తగుణశోభితుడుగానే వర్ణింపబడ్డాడు. ఆ విదేశీయ అశ్వ వ్యాపారిమాటలుగానీ, ఈ ఆస్థానకవి ప్రశంసలుగానీ పూర్తిగా సత్యాలు కాజాలవు. అచ్యుతదేవరాయలను ఇతర అనేక మధ్యకాలీయపాలకులతో పోల్చితే పెద్దగా తీసి పోడు. ఇతరవిషయాలెట్లుంటేనేమి, అచ్యుతదేవరాయలూ, తర్వాతవచ్చిన నామ మాత్రచక్రవర్తి సదాశివరాయలూ (క్రీ. శ. 1542-76) వాస్తవంగా అధికారం చెలా యించిన ఆరవీడు రామరాజూ (క్రీ. శ. 1542-65), పెద తిరుమలాచార్యుల కుటుంబా నికి అనుకూలురు. ముఖ్యంగా అచ్యుతదేవరాయలు వీరికి ఆశ్రితకల్పవృక్షం.

కొన్ని కైఫియ్యత్‌ల ద్వారా ఒక గాథ, కొన్ని వివరాలు తెలుస్తున్నయి :— అచ్యుతదేవరాయలు పెద తిరుమలాచార్యులకు మొదటగా ఇప్పటి కడపజిల్లాలోని మాచునూరుగ్రామం ఇచ్చాడు. ఆచార్యులు ఆ గ్రామంలో ఉంటూ ఉండేవారు. ఒక సారి కొందరు దొంగలు తిరుమల ఆలయంలోని ఉత్సవవిగ్రహాన్ని సంపుటంతో సహా అపహరించి తీసుకుపోతుండగా, కొంతదూరం వెళ్లినాక వాళ్లకు ప్రపంచం కనపడకుండాపోయి చీకటి కమ్మింది. వాళ్ళు అప్పటికి మాచునూరు ప్రాంతానికి ఒచ్చారు. వాళ్లవ్యాకులతకు శ్రీ వెంకటేశ్వరస్వామికి కరుణకలిగి. తనను సమీప గ్రామంలో ఉన్న పెద తిరుమలాచార్యుల కప్పగించితే వాళ్ల కళ్లు చక్కబడతవని ఆనతిచ్చారు. ఆచార్యులు ఎక్కడ ఉండేది విచారించి తెలుసుకుని, మాచునూరు వచ్చి, ఆయనకు దొంగలు విగ్రహాన్ని అప్పగించి, తమ వృత్తాంతం విన్నవించి, స్వస్థులై వెళ్లిపోయారు. ఆచార్యులు విగ్రహాన్ని సంప్రోక్షణచేసి ఇంట్లో ఉంచి పూజచేస్తూ, దాన్ని తిరిగి తిరుమలకు పంపవలెనని, తిరుమలలో స్వామిసన్నిధిలో ఉండే ముఖ్యస్తు లకు దానిని తిరుమలకు వేంచేపు చేసుకోమని వర్తమానం పంపారు. వారు విగ్ర హాన్ని తీసుకువెళ్లటానికి మాచునూరుకు పల్లకి తీసుకెళ్లాలని నిశ్చయించిన రోజు ముందురాత్రి వారికి స్వప్నంలో వెంకటేశ్వరస్వామి సాక్షాత్కరించి తాను తిరుమలా చార్యుల వద్దనే వేంచేసి ఉండాలని అభిలషిస్తున్నానని, ఆ విగ్రహం తిరుమలకు తేనక్కరలేదని ఆనతిచ్చారు. వారీవిషయం ఆచార్యుల కెరుక పరచారు. ఈ విషయం అచ్యుతదేవరాయలకు కూడా తెలియజేయబడింది. అప్పుడాయన మాచునూరు వచ్చి స్వామికి అర్చన, దీపారాధన చక్కగా జరగాలని చాలాగ్రామాలు, జాగీర్లు ఆచార్యులకు దానం చేశాడు. ఇవి తాళ్లపాకవారి అగ్రహారాలుగా శిలాశాసనాలు, భోగపట్టాలు

డజువుచేస్తున్నాయి. మాచునూరు కాకుండా తిరుమలాచార్యులకు అచ్యుతదేవరాయలు క్రిందిగ్రామాలను అగ్రహారాలుగా ఇచ్చాడు. ములికినాటి సీమలోని తుమ్మలూరు, గిద్దలూరు సీమలోని పొడదుర్తి, దువ్వూరు సీమలోని కామనూరు, అవిదెన అగ్రహారానికిచెందిన వేటపల్లె మజుకూరు, రాజువారి సీమలోని టంగుటూరు వగైరా గ్రామాలు. ఇవన్నీ రాయల సంస్థానం అంతరించేవరకు తాళ్లపాకవారి అనుభవంలో ఉండేవి. పెమ్మసాని తిమ్మానాయని ప్రభుత్వంలో కూడా కొన్ని దినాలు వారికే ఇవన్నీ చెల్లినయి. తర్వాత మట్లవారు సిద్ధవటం-చెన్నూరుసీమ ఏలుతుండగా వీటిలో కొన్ని గ్రామాలు జప్తు చేశారు; మరికొన్నిటిని మహమ్మదీయపాలకులు జప్తు చేశారు; కొన్ని పాలెగాండ్ల, దొంగల ఉపద్రవాలవలన పాడుబడి పోయినయి.*

పెద తిరుమలాచార్యుల మహిమను చెప్పే రెండు సంకీర్తనలు - బహుశా ఆయన పెద్ద కుమారుడు వ్రాసినవి - ఉన్నాయి. వాటిలో "గుములుగూడి యలుగుల, తిరుగబారి చుట్టుకొన్న కురువదోవ నతడు, కమలనయనువి దలచిన మాత్రాన కకపికలై పారెను" అనీ, "దేవుడొక కన్ను దయచేసి తనవద్దికి నంపిన నతడు, పావను డితడు తా నొక్క కన్నిచ్చె పరుషలు చూడగా" అనిన్నీ చెప్పబడింది.† ఈయనపై విసిరేయబడిన కత్తి పుష్పదామమైందని ఈయన నాల్గవకుమారుడు; అది ఈయన వెన్నుసోకినంతనే తునకలైందని పెద్ద కుమారుడున్ను ప్రశంసించారు.

తాళ్లపాకవారు తాము "కాపులము మేము" (వ్యవసాయం వృత్తిగా గలవారం) అని చెప్పుకున్నారు. వారు "పోడు నరకి, చేను దున్ని, మంచివానపదనున విత్తి, కలుపు దవ్వి, వెలుగు వెట్టి, యెరువులు వేసి, పంటలు పండించి" అనుభవించేవారు. తాను జేయుచున్న కృషిగోరక్షవాణిజ్యాదులు భగవల్లీలకుపయోగంబుగావున అవి ఆయన పూజలే అని తిరుమలాచార్యులు భావించారు. అందుకనే ఈయన ఒక వ్యావసాయిక అలంకారాన్నిచెప్పాడు:— పరాత్పరుడు క్షేత్రజ్ఞుడు, జీవులాతని కమతీలు.§ తిరుమలాచార్యులు స్వంతఖర్చుతో అరణ్యాలునరికించి గ్రామాలను

* మెకెంజీ సంగ్రహం లోని నెం. R. 1225 మాచునూరు కైఫియ్యత్ కు శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు చేసిన నకలు; ఇతర కైఫియ్యత్‌లకు ఆయన చేసిన నకళ్లు, పెద తిరుమలాచార్యుల జీవితచరిత్ర ఇంకా వివరంగాకల సామగ్రి శ్రీ శ్రీనివాసాచార్యులు తనవద్ద ఉందన్నారు, కాని నేను దాన్ని చూడ లేదు.

† శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి "అన్నమాచార్య చరిత్రము" పుట 65.

§ వెంకటేశ్వరవచనం.

బస్తీలుగా చేశారనీ, చెరువులు తవ్వించారనీ, కాలువలు పునరుద్ధరించారనీ, వనాలు వేశారనీ కైఫియ్యత్‌లు చెప్పుతున్నాయి. ఈయనొక పెద్ద భూస్వామి లేక పెదకాపు, అగ్రహారీకుడు, "కులక్", వ్యవసాయానికి ఎంతో తోడ్పడినవారు.

అంతేకాకుండా పెద తిరుమలాచార్యులు మహాదాతకూడా. ఈయన, వీరి సంతానం, కనీసం 27 గ్రామాలు శ్రీ వెంకటేశ్వరస్వామికి సమర్పించినట్టు శాసనాలున్నాయి. తనకు లభించిన అగ్రహారాలన్నీ చాలావరకు వచ్చినవి వచ్చినట్టుగా ఈయన భగవదర్పణంచేశారా అని తోస్తుంది. ఒకటి రెండు గ్రామాలు కొనికూడా స్వామికి సమర్పించారు. పైగా తనసొమ్ముతో ఎన్నో కైంకర్యాలు ఈయన ఏర్పాటు చేశారు. అందులో కొన్ని: (1) రెండుమంటపాలు కట్టించి వాటిలో బ్రహ్మోత్సవ సమయంలో "ఉంజల్ సేవ," నైవేద్యం జరిగేట్టు చేశారు. (2) పూర్వపుకోనేరును నవశిలాకలితంగాను, తత్తటాంకణగోపురద్వారాలను, భూవరాహస్వామి చుట్టుమాలె ప్రాకారాన్ని కట్టించారు. కోనేటిలోని నీరాళిమండపోద్ధరణ, చుట్టు ప్రదక్షిణమండప నిర్మాణం చేయించారు. (3) పుష్కరిణిగట్టున రాతి దీపస్తంభం కట్టించి ప్రతి గురువారం దానిపై దీపం వెలిగించే ఏర్పాటు, ముక్కోటిద్వాదశినాడు పుష్కరిణి గట్టున 32 దీపాలు వెలిగించే ఏర్పాటు చేశారు. (4) కార్తికమాస వనభోజనానంతరం ఉత్సవమూర్తి ఆలయానికి తిరిగి వస్తూ ఆగి పూజానైవేద్యాలు స్వీకరించటానికి 12 మంటపాలు కట్టించారు. (5) మన్నసముద్రం గ్రామంవద్ద ఒకటి, ఆళ్వారుతీర్థంవద్ద ఒకటి (రెండు) మంటపాలు కట్టించారు. (6) ఆళ్వారుతీర్థం వద్ద విగ్రహప్రతిష్ఠ చేశారు. తెలుగు సుప్రభాతం గానం చేసే ఏర్పాటు చేశారు. (8) వైవాహికోత్సవం, ఉట్లకొట్టువేడుక, వనభోజనోత్సవం - ఈయన, ఈయనకొడుకులు ప్రారంభించారు. (9) బ్రహ్మోత్సవం మరింతవైభవోపేతంగా చేయించారు. (10) క్రీ. శ. 1531 లో విజయనగరంలోని విఠల ఆలయానికి దానం చేశారు. (11) క్రీ. శ. 1536 లో విజయనగరప్రధానమంత్రులుగాను, దండనాథులుగాను ఉన్నవారి నుండి వారు లోగడ ఏర్పరచిన కైంకర్యాలతాలూకు ప్రసాదభాగాలను 11,703 పణాలకు పెద తిరుమలాచార్యులు శాశ్వతంగా తన వంశానికి చెందేట్టు కొనుక్కున్నారు. (12) క్రీ. శ. 1553 లో చిన్న కంచిలో కొన్ని ఉత్సవాలు ఏర్పాటు చేశారు.

తిరుమల తిరుపతులలోను, ఇతరచోట్ల ఉన్న శాసనాల ద్వారా ఇవన్నీ తెలుస్తున్నాయి.* ఇవన్నీ చేయటానికి, పైగా సంకీర్తనభండారవ్యవస్థను ఏర్పాటు చేయటానికి పెద తిరుమలాచార్యులు ఎంతటి భాగ్యవంతులో, మనం ఊహించవచ్చు. ఇంతటి సంపన్నులు, ఇంతటి దాతలు తెలుగు కవి పండిత లోకంలో మరెవరూ, ఎన్నడూ లేరేమో!

(13) కడపజిల్లా రాజంపేట తాలూకా కోడూరికి పడమట 11 మైళ్ళలోవున్న గుండాలకోనలో ఇంతవరకు వెలుగుమొగం చూడని కొత్తశాసనం ఒకటి పెద తిరుమలాచార్యులది దొరికింది. ఈ శాసనం క్రీ.శ. 1535 నాటిది. పెద తిరుమలయ్య గుండాలకోనలో హనుమంతుని ప్రతిష్ఠించినట్లు శాసనంలోవుంది. పక్క చిన్న శాసన భాగాల్లో ఈయనతో వెళ్ళే పరివారంపేర్లూ వున్నాయి. (ఈ క్రింది శాసన ప్రతిబింబాలు చూడండి)†



1



2

3

---

* అన్నమయ్యవి, పెద తిరుమలయ్యవి వారి సంతానానివి దాదాపు 25 శాసనాలు తిరుపతిలో దొరికినయి. వీటిలో పెద తిరుమలాచార్యుల మొదటి శాసనం క్రీ. శ. 1517 నాటిది. తాళ్ళపాకవారి ఆఖరి శాసనం క్రీ. శ. 1558 నాటిది. వేరే కూడా ఉన్నాయి.

† వ్యయప్రయాసల కోర్చి ఈ శాసనం శ్రీ మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యం గారు (తెలుగు పండితులు) సేకరించింది. నావ శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు సంపాదించి ఇచ్చింది.

పెద తిరుమలాచార్యులు చేసిన కార్యాల్లోకెల్ల ఆశ్చర్యకరమైంది, ఇంకెవరూ ఎన్నడూ చేయంది, బహుశా చేయలేంది తనతండ్రియొక్క, తనయొక్క అనేకవేల సంకీర్తనలను, తన లఘుకృతులను, పెద్ద పెద్ద రాగిరేకులపై చెక్కించి భద్ర పరచటం. ఈయన కుమారుడు చిన తిరుమలాచార్యుల సంకీర్తనలుకూడా ఇలానే రాగిరేకులపైకి ఎక్కించారు. అన్నమరాజు తిమ్మయ ఇత్యాదులు రేకులపై వీటిని ఎక్కించారు. ఎంతోమంది ఎన్నోఏండ్లు ఎంతో ప్రయాసపడి ఈ కార్యక్రమం పూర్తిచేసి ఉండాలి. ఎన్నోలక్షలు దీనికి ఖర్చై ఉండాలి. అన్నమాచార్యులే ఒక సంకీర్తనభండారం స్థాపించినట్టు కన్పడుతుంది; అయితే అది బహుశా తాళపత్రాదుల పైన వ్రాయబడిన సంకీర్తనలభండారం అయి ఉంటుంది. రాగిరేకులపై వ్రాయబడ్డ సంకీర్తనల భండారాన్ని ప్రారంభించింది, దాన్ని వ్యవస్థీకరించింది పెద తిరుమలా చార్యులు. క్రీ. శ. 1530 నాటికిది జరిగింది. తిరుమలలో వెంకటేశ్వరస్వామి ఆలయంలో విమానప్రదక్షిణప్రాకారమంటపాన్ని ఆనుకుని, ఉత్తరంవైపున రామానుజుల గుడిప్రక్కన ఈ సంకీర్తనభండారం స్థాపించి, అందులో సంకీర్తనలు చెక్కబడిన రాగిరేకులు భద్రపరచటం ప్రారంభించారు. వీటికి దీపాలు, నైవేద్యం సమర్పించటం, జీతం, ప్రసాదాలు ఇచ్చి వీటిని పాడేవారిని ఏర్పరచటం, వీటిగానం వినేవారికి పన్నీరుబుడ్లు, చందనతాంబూలాదులు ఇవ్వటం - ఇదంతా సమకూర్చారు. నిత్యం తిరుమంజనసమయంలోను, శుక్రవారంనాడు పునుగుకాపు సమయంలోను. బ్రహ్మోత్సవ రథోత్సవాల్లోను, ఈ సంకీర్తనలు ఆలపించే పద్ధతి ప్రవర్తింప జేశారు. గ్రీష్మోత్సవంలో వీటికై "సంకీర్తన అరుళప్పాడు"* ఏర్పరచారు. తిరుపతిలో గోవిందరాజస్వామి ఆలయంలో కూడ ఈ సంకీర్తనల గానానికి ఏర్పాటు చేశారు. ఈ అపూర్వవ్యవస్థద్వారా పెద తిరుమలాచార్యులు భక్తికి, సాహిత్యానికి, సంగీతానికి కూడా ఒకేపరి అసాధారణమైన శాశ్వతమైన సేవ చేశారు.

పెద తిరుమలాచార్యుల అయిదుగురుకుమారులు కవిపండితులు, సత్పురుషులున్ను. ఈయనతండ్రి, ఈయన, ఈయనకుమారుడు చిన తిరుమలాచార్యులు ఆంధ్ర పదకవిత్రయం. అన్నమాచార్యులు తన అవసానకాలంలో పెద తిరుమలాచార్యులను శ్రీవెంకటేశ్వరస్వామికి అంకితంగా రోజుకో కీర్తన చెప్ప మని ఆదేశించారనీ, ఆ ప్రకారం ఈయన శా. శ. 1424 దుందుభి సంవత్సర ఫాల్గుణ బహుళద్వాదశి నుంచి

---

* అరుళప్పాడు = అనుగ్రహింప జేయుట. దయ నర్థించిపాడే పాటలతో కూడిన ఉత్సవం.

సంకీర్తనలు స్వామికి విన్నవించారనీ రాగిరేకులలో ఉంది. ఈయన అధ్యాత్మ సంకీర్తనలున్న రాగిరేకులు 77, శృంగారసంకీర్తనలున్నవి, 89, లఘుకృతులున్నవి 40 ప్రస్తుతంలభ్యమౌతున్నవి. ఈయనవి 463 అధ్యాత్మ సంకీర్తనలు 1974 లోను, 544 శృంగారసంకీర్తనలు 1976 లోను తిరుమల తిరుపతి దేవస్థానం ప్రకటించింది.* ఇవన్నీ అన్నమయ్య సంప్రదాయాన్నే అనుసరిస్తూ, భాషలో భావంలో అన్నమయ్య పదాలస్థాయిలో ఉన్నాయి. "పన్నుగ బెద తిరుమలయ్య పదమున కెఱగున్" అనే తెనాలి రామకృష్ణకవి ప్రశంసను బట్టి ఈయన పదకవిత్వం ఉత్తమశ్రేణికి చెందిందిగా ఆకాలాననే ప్రసిద్ధి వహించిందని తెలుస్తుంది. ఈయనకూడా నరాంకితంగా కీర్తనలు గానీ పద్యాలుగానీ చెప్పలేదు; కానీ అచ్యుతదేవరాయల ప్రీతికరంగా తిరువెంగళ నాథునికి శృంగారసంకీర్తనలు విన్నవించారని కొన్ని ఆధారాలమూలంగా అర్థం చేసుకోవచ్చును. ఈయన సంకీర్తనలే గాకుండా, వచనమాలికాగీతాలు, దండకం, మంజరీద్విపద, శతకాలు, ఉదాహరణం, రగడ, లక్షణగ్రంథం, ద్విపద, వ్యాఖ్య, అనువాదం—— ఇన్ని సాహిత్యప్రక్రియలు చేశారు. ఈయనకు వేదమార్గప్రతిష్ఠాపనాచార్య, శరణాగతవజ్రపంజరేత్యాది బిరుదులున్నయి. భగవంతుడు ఈయనకు త్రిపురుషపర్యంతంగాప్రత్యక్షం, సప్తపురుషపర్యంతంగా మోక్షం ఇస్తానని వరం ఇచ్చారు.†

పెద తిరుమలాచార్యులు తన జీవితచరమదశలో సన్న్యాసియై వెంకటయోగి అనే నామం స్వీకరించారని కొందరి అభిప్రాయం.§ కాని శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు దీనికి ఆధారం లేదని వాదించారు. ఈయన క్రీ. శ. 1554 వరకు జీవించినట్టు శాసనాలవలన తెలుస్తుంది. మరణసంవత్సరం అనిశ్చితం. ఈయన అష్టైశ్వర్యాలతో తులతూగుతూ, చతుర్విధపురుషార్థాలను సమానంగా సేవించి, భగవదనుగ్రహం, మహారాజపోషణ, లోకాదరం ఈ మూడూ అనుభవించిన పూర్ణపురుషుడు, మహాకవి, పండితుడున్ను.

---

* పరిష్కర్త—డా. పి. టి. జగన్నాథరావు.

† "శకుంతలాపరిణయము:- పీఠిక" ఆధారంగా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి, "అన్నమాచార్య చరిత్ర పీఠిక," పుట. 89.

§ శ్రీ వఝల చిన సీతారామ శాస్త్రి, డా. వేటూరి ఆనందమూర్తి తాళ్లపాకవారి వివిధసాహితీప్రక్రియలు, పుట. 358.

# 3

పెద తిరుమలాచార్యుల రచనల్లో ఒకటి, ఇప్పటివరకు ముద్రింపబడనిది, ఇప్పుడీరూపంగా ప్రకటింపబడుతున్నది, ఈయన భగవద్గీత ఆంధ్రీకరణం. ఇది "ఆంధ్రవేదాంత" మని "భగవద్గీతా టీక" అని, "భగవద్గీతా వచన" మని పేర్కొన బడింది. ఈయన నాల్గవకుమారుడు చిన్నన్న తన "అష్టమహిషీకల్యాణం" లో పెద తిరుమలయ్య "వేదాంతవిద్యాప్రవీణుడై యాంధ్రవేదాంతమొనరించె" నని వ్రాశాడు. దీని తాళపత్రప్రతుల్లో అన్నిట్లో "తాళ్లపాక తిరుమలయ్య భగవద్గీతార్థము తెలుగుజేసి అర్థం ప్రాపించినది" అనీ, కొన్నిట్లో "రామానుజ గీతాభాష్యక్రమాన భగవద్గీతను తెలుగు చేశారు" అనీ వ్రాసి ఉంది. గ్రంథాంతంలో ఒక ప్రతిలో ఇట్లా ఉంది:

ధర తాళపాక అన్నయ
వరసుతుడగు తిరుమలయ్య వాచా ప్రౌఢిన్
వెరవున భగవద్గీతల
పరమార్థము లంధ్రభాష పరగ రచించెన్."

ఇందు స్పష్టం సరళం పటిష్టం అయిన వ్యావహారిక వచనంలో ప్రతి భగవద్గీతా శ్లోకం తెలుగులోకి అనువాదం చేయబడింది. భగవద్గీతకు మొట్ట మొదటి పూర్తి తెలుగు అనువాదం ఇది. * ఒక వేదాంతగ్రంథం ప్రథమంగా ఆంధ్రంలోకి పూర్తిగా అవతరించటంకూడా దీని ద్వారానే. వ్యావహారికంలో 13 వ శతాబ్దంలోనే ఏదో జ్యోతిషగ్రంథంపై వ్రాయబడ్డ తెలుగుటీక ఉందట.† వ్యావహారికంలో ఉన్న కృష్ణమాచార్యుల "సింహగిరి నరసింహవచనాలు" 13-14 వ శతాబ్దాలవి. కొన్ని శాసనాలలో తెలుగు వ్యావహారికం అంతకు ముందే కొంచెం కొంచెంగా వాడబడింది. అందుచేత పెద తిరుమలాచార్యుల భగవద్గీతానువాదం తెలుగులో వ్యావహారికంలో వ్రాయబడ్డ తొలిరచన అంటానికి వీలు లేదేమో: కానీ ఆంధ్రంలోని ప్రథమవేదాంత రచనగా, భగవద్గీతకు మొదటి తెలుగు అనువాదంగా, ధారాళమైన మనోజ్ఞమైన వ్యావహారికంలో వ్రాయబడ్డ మొదటి తెలుగు వ్యావహారికగ్రంథంగా,

---

* ఆంధ్రమహాభారతం భీష్మపర్వంలో భగవద్గీతకు పూర్తి అనువాదం లేదు కదా!

† ఈ సంగతి నాకు శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు చెప్పారు.

దీని ప్రాముఖ్యత చిరస్థాయిగా ఉంటుంది. దీనివి 8 తాళపత్రప్రతులు దొరికినయి; అందులో నాలుగు మరీ ముఖ్యమైనవి; క్రీ. శ. 1609 (?) లో వెంకటపతియోగి వ్రాసింది—తంజావూరిది; కొండవీటి సీమకు చెందిన తోట గజపతి వ్రాసింది—రాజమండ్రిది; క్రీ. శ. 1686 లో ఎవరి చేతనో వ్రాయబడింది—మదరాసుది; రామలింగా నాయనిపల్లెకు చెందిన లక్ష్మీనారాయణ అనే కరణం క్రీ. శ. 1732 లో వ్రాసింది—ప్రొద్దుటూరిది.

తాను వ్రాసిన వైరాగ్యవచనమాలికాగీతాలు లేక వేంకటేశ్వరవచనాలలో భగవద్గీతలో 700 శ్లోకాలే ఉన్నట్టు పెద తిరుమలాచార్యులు చెప్పారు. కానీ ఈయన భగవద్గీతకు ఇప్పుడు లభిస్తున్న తాళపత్రప్రతుల్లో 705 శ్లోకాలున్నాయి. వీటిలో రెండు ఉపనిషత్తులనుండి ఉద్ధరణలు. ఇవి ఈ పుస్తకంలో 8 వ అధ్యాయంలో 13A, 13Bలుగా ప్రకటింపబడినయి. వీటికి ఏ ప్రతిలోను తెలుగులేదు. మిగతా రెండు శ్లోకాలలో 10 వ అధ్యాయంలో ఒకటి 31A గాను, ఇంకొకటి 11 వ అధ్యాయంలో 44A గాను ప్రకటించారు. ఇవి కొన్ని తాళపత్రప్రతుల్లో అనువాద సహితంగా ఉన్నాయి. ఇవి భగవద్గీతయొక్క నెవారిపాఠంలో కూడ కన్పడతయి. ఇక ఈ పుస్తకంలో 13 వ అధ్యాయంలో 1 వ శ్లోకంగా కానవచ్చేది అన్ని తాళపత్రప్రతుల్లోను సానువాదంగా ఉంది. కాని అది శంకర రామానుజ మధ్వ భాష్యాల్లో వ్యాఖ్యానింప బడలేదు. రాఘవేంద్రస్వామి ఇత్యాదులు మాత్రం దాన్ని వ్యాఖ్యానించారు. ఈ అయిదూ కూడా తిరుమలయ్య పరిగ్రహించి ఉండడు. తాళపత్ర ప్రతుల్లోకి ఎట్లాగో దూరినయి.

పెద తిరుమలాచార్యుల భగవద్గీతావచనం తర్వాత 19 వ శతాబ్దం వరకు భగవద్గీతను వచనంగానో, టీకలుగానో, అనువాదాలుగానో కణవె వీరరాజు, తుపాకుల అనంతభూపాలుడు, అనంతకృష్ణతీర్థుడు, యోగీంద్రసూరి, శ్రీధరస్వామి అనేవారు వివరించారు. ఈ గ్రంథాలన్నీ మదరాసులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఉన్నాయి. ఇవిగాక అడయారు లిఖితపుస్తక భాండాగారంలో ఎవరు వ్రాసినవో తెలియని నాలుగు భగవద్గీతావచన టీకలు, తంజావూరు లిఖిత పుస్తకభాండాగారంలో రచయితలెవరో తెలియని ఒక గీతావచనానువాదం ఉన్నాయి. వేముగంటి దత్తోజి, మిక్కిలి మల్లికార్జునుడు, కొండూరి జగ్గరాజు, కంభంపాటి నారప్ప, తోట గజపతి—వీరుచేసిన పద్య భగవద్గీతానువాదాలు, మాధవకవిది గద్యపద్యానువాదం, కూడా లిఖితపుస్తకరూపంగా ఉపలబ్ధమవుతున్నాయి. ఈ పద్య, వచన- టీక- అనువాదాలన్నీ

బహుశా 17 వ శతాబ్దివే. పెద తిరుమలాచార్యుల తర్వాత 19 వ శతాబ్దివరకు వ్యావహారికవచనంలో గ్రంథాలు 271 పైగా వెలువడగా, గ్రాంధికవచనంలో 25 గ్రంథాలు మాత్రమే వెలువడినయి. * అప్పటివరకు వేదాంతాది విషయాల చర్చకు వ్యావహారిక భాషలోని వచనగ్రంథాలకే ఎక్కువ ప్రచారం, ఆదరం ఉన్నదని తేలుతుంది.

1927 వరకు భగవద్గీతకు సంబంధించిన గ్రంథాలు తెలుగులో 38 మాత్రమే ప్రకటింపబడినయి. వీటిలో 14 పుస్తకాల ప్రకటన సంవత్సరాలు తెలియవు. తక్కినవాటిలో అన్నిటికంటే ముందుగా 1809 లో యం. సుబ్బరామయ్య వ్రాసిన "భగవద్గీతా వచనం" వెలువడింది. తర్వాత క్రమంగా రామచంద్రానందసరస్వతి భగవద్గీత 1870; సి. రామయ్య భగవద్గీతార్థ సంగ్రహము 1886; కె. సుబ్రహ్మణ్య శాస్త్రి భగవద్గీతాభాష్యార్థచంద్రిక 1893.† ఆ తర్వాత తెలుగులో భగవద్గీతాటీకలు, అనువాదాలు, వివరణలు, ఉపన్యాసాలు విరివిగా వచ్చినయి. అన్నిటికంటే మొదటి దయిన పెద తిరుమలాచార్యుల అనువాదం నేటికి ప్రకటింపబడుతూంది. దీనితో ఇప్పుడు లభ్యమౌతున్న ఈయన రచనలన్నీ ప్రకటితమైనయి.

# 4

రామానుజభాష్యక్రమాన గీతార్థాన్ని తెలుగు చేయటమే తానీ గ్రంథంలో కావించిందని గ్రంథకర్తే ప్రతి అధ్యాయాంతాన చెప్పారు. అందుచేత ఇందులో మౌలికభావాలు, విమర్శలు, చర్చలు ఇత్యాదులేవీ లేవు. ప్రతి శ్లోకానికి క్లుప్తంగా

---

* ఈ పేరాలోని వివరాలన్నీ శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు సేకరించి నాకిచ్చినవి. 1929లో మదరాసు ఆంధ్రపత్రికా కార్యాలయంచే ప్రకటింపబడిన "ఆంధ్రవాఙ్మయ సూచిక" ప్రకారం మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలో తెలుగులో ఉన్నవి నాల్గు భగవద్గీతలు మాత్రమే; మాధవకవిది; కంభంపాటి నారప్ప పద్య అనువాదం; అనంతకృష్ణతీర్థుల భగవద్గీతార్థదీపిక; తాళ్లపాక తిరుమలయ్యదిన్ని. ఆంధ్రసాహిత్యపరిషత్ పుస్తకభాండాగారంలో మాధవయ్య వ్రాసిన "భగవద్గీతాయోగశాస్త్రం" లిఖితప్రతి ఉన్నట్టు ఆ "సూచికే" చెపుతుంది.

† "ఆంధ్రవాఙ్మయ సూచిక."

సూటిఅయిన మామూలుభాషలో అర్థాన్ని చెప్పటమే జరిగింది. కొన్ని ముఖ్య శ్లోకాలకు రామానుజులు ఎలా భాష్యం చేసింది, తిరుమలయ్య ఎలా తెలుగు చేసింది చూద్దాం.

(1) 2 వ అధ్యాయంలో 48 వ శ్లోకం తీసుకొందాం. దానికి పూర్తి రామానుజభాష్యం:—"రాజ్యం, బంధువులు ఇత్యాదులందు సంగం త్యజించి, యుద్ధాది కర్మలను యోగస్థుడవై చెయ్యి. వాటిలో, అంతర్భూతాలైన విజయాది సిద్ధి అసిద్ధులలో సముడవై చెయ్యి. ఈసిద్ధి అసిద్ధుల సమత్వమే 'యోగస్థ' అనే శబ్దంలోని 'యోగ' శబ్దంచే చెప్పబడింది. సిద్ధి అసిద్ధుల సమత్వరూపమైన చిత్త సమాధానమే యోగం." దీనికి తిరుమలయ్య తెలుగు ఇలా చేశారు:—"యోగ నిష్ఠుడవై, ఫలసంగం విడిచి, ఫలం సిద్ధించినప్పుడున్ను, సిద్ధించనప్పుడున్ను సముడవై కర్మములు శేయుము....ఆ చేశెడి కర్మఫలముయొక్క సిద్ధియందున్ను సముడవై యుండుటే యోగము."

(2) 5 వ అధ్యాయం 10 వ శ్లోకానికి పూర్తి రామానుజభాష్యం ఇట్లా ఉంది:— "ఇక్కడ 'బ్రహ్మ' శబ్దంచేత ప్రకృతి చెప్పబడింది; 'మమ యోని ర్మహద్బ్రహ్మ' అని చెప్పబడబోవుచున్నది కూడా. ఇంద్రియాలు ప్రకృతిపరిణామ విశేషరూపాలు. అందుచేత ఇంద్రియాకారమున ఉన్న ప్రకృతిలో 'పశ్యన్ శృణ్వన్' ఇత్యాది శ్లోకాలచే చెప్పబడిన ప్రకారంగా కర్మలను స్థాపించి, ఫలసంగాన్ని విడిచి 'నైవకించిత్ కరోమి' అని ఎవడు కర్మలను చేస్తాడో, వాడు ప్రకృతితో సంస్పృష్టుడై ఉంటున్నప్పటికీ, ప్రకృతియందు ఆత్మాభిమానరూపమగు సంబంధకారణంగా పాపంచే లిప్తుడు కాడు- ఎట్లన పద్మపత్రం నీటిచే సంస్పృష్టమైనను (నీటిచే) లిప్తము గానట్టు, వాడును లిప్తుడు కాడని అర్థం." ఇక తిరుమలయ్య తెలుగు:—"బ్రహ్మ మనే పేరగల ప్రకృతివలననే సర్వమైన యింద్రియాలున్ను బుట్టెగనుక, యింద్రి యాలచాతను జేసే కర్మలనెల్లాను, ప్రకృతియందేపెట్టి, ఫలసంగం విడిచి, కర్తృ యోగం చేసుకొనువాడు తామరపాకు నీళ్లను అంటనట్టే వాడున్నూ పాపాలనంటడు."

(3) 9 వ అధ్యాయం 4 వ శ్లోకానికి పూర్తిరామానుజభాష్యం:—"ఈ చేతనాచేతనాత్మకమైన సంపూర్ణజగత్తు అప్రకాశితస్వరూపుడనైన, అంతర్యామినైన నాచేత వ్యాప్తం. ఈ జగత్తు ధారణార్థం నియమనార్థం శేషిత్వముచే వ్యాప్తమని అర్థం. ఎట్లన అంతర్యామిబ్రాహ్మణంలో 'యః పృథివ్యాం తిష్ఠన్.... యం పృథివీ న వేద,' 'య ఆత్మని తిష్ఠన్.... యమాత్మా న వేద' అన్నట్టు, చేతనాచేతన వస్తుజాతాలచే చూడబడని అంతర్యామిచే అంతా వ్యాప్తమని అక్కడక్కడ చెప్ప

బడింది. కాబట్టి అన్ని భూతాలు అంతర్యామి యగు నా యందు ఉన్నవి. ఏలన ఆ బ్రాహ్మణంలోనే 'యస్య పృథివీ శరీరం యః పృథివీమన్తరో యమయతి,' 'యస్యాత్మా శరీరం య ఆత్మానమన్తరో యమయతి' అని శరీరత్వముచే సమస్తముయొక్క నియామ్యత్వం ప్రతిపాదితమైంది. స్థితి నియమనాలు భగవదాయత్తాలుగా ప్రతిపాదించబడగా, ఆయన యొక్క శేషిత్వం కూడా సిద్ధించింది. నా స్థితి భూతాలయందు ఆయత్తమై లేదు, నా స్థితికై వాటివలన ఎట్టి ఉపకారమూ లేదని అర్థం." దీనికి తిరుమలయ్య తెలుగు:—"యీ సర్వజగత్తున్నూ అప్రకాశిత రూపుడైన, అంతర్యామినైన నాచాత విస్తరింపబడెను. సర్వమయిన భూతాలున్నూ నా ఆధీనమై వుండును. నేను ఆ భూతాలకు అధీనుడగాను."

(4) 13 వ అధ్యాయం 2 వ శ్లోకానికి రామానుజులు విస్తృతభాష్యం వ్రాశారు. దాని సంగ్రహం ఇది:—"దేవమనుష్యాది అన్ని క్షేత్రాలయందు వేదితృత్వముచే ఏది ఏకాకారమో ఆ 'క్షేత్రజ్ఞుణ్ణి'కూడా నే ననే తెలిసికొనుము, మదాత్మకమని తెలిసికొనుము. 'క్షేత్రజ్ఞుణ్ణి కూడా' అనటంచేత క్షేత్రం కూడా నే ననే తెలిసికొనమని చెప్పబడినట్లు బోధపడుతూంది. ఈ క్షేత్ర క్షేత్రజ్ఞుల వివేకవిషయమైనట్టి, ఆ రెండింటియొక్క మదాత్మకత్వ విషయమైనట్టియు ఏ జ్ఞానం చెప్పబడిందో, అదే ఉపాదేయమైన జ్ఞానమని నా అభిప్రాయం." ఇక తిరుమలయ్య తెలుగు: —"క్షేత్రజ్ఞుడయినటువంటి ఆత్మను నాకు శరీరమైనవాడుగా నెరుగుము. ఈ దేహము ఆత్మకు శరీరమైనట్టే యీ ఆత్మాను, దేహమున్ను నాకు శరీరాలు. (నాకు శరీరాలు అనేటి) యీక్షేత్రము యొక్కాను, యీ క్షేత్రజ్ఞుని యొక్కాను స్వరూపమును యెరుగుట నాకు సమ్మతము." (చూడు పుట 233 లో 3 వ శ్లోకం.)

(5) 15 వ అధ్యాయం 16 వ శ్లోకానికి పూర్తి రామానుజభాష్యం:—క్షరుడు, అక్షరుడు అని ఈపురుషులిద్దరు లోకంలో ప్రథితులు. అందు క్షరశబ్ద నిర్దిష్టడగు పురుషుడనగా జీవ శబ్దంచే చెప్పబడే క్షరణస్వభావంచేత అచిత్ సంసృష్టములైన బ్రహ్మాదిస్తంబపర్యంతముగనున్న సర్వభూతాలు అచిత్సంగరూపమగు ఒకే ఉపాధితోనే అన్నిటికి సంబంధం ఉంది కాబట్టి, పురుషుడు అని ఏకత్వనిర్దేశం జరిగింది. అక్షరశబ్ద నిర్దిష్టుడు కూటస్థుడు; అచిత్సంసర్గవియుక్తుడు; స్వరూపమందు అవస్థితుడైన ముక్తాత్మ. అతడు అచిత్సంసర్గాభావం వలన అచిత్పరిణామ విశేషములగు బ్రహ్మాదిదేహాలను ధరించేవాడు కానందున కూటస్థుడని చెప్పబడును. ఇక్కడకూడా ఏకత్వనిర్దేశం అచిద్వియోగరూపమగు ఒకే ఉపాధినిబట్టి జరిగింది. ఏలన, ఇంతకుపూర్వం అనాదికాలంనుంచి ముక్తుడు ఒకడు మాత్రమే అని కాదు.

'బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః' అని, 'మమ సాధర్మ్య మాగతాః, సర్గేఽపి నోపజాయన్తే ప్రలయే న వ్యథన్తి చ' అనిన్నీ, భగవద్గీతలోనే ఉన్నది కదా. ఇక తిరుమలయ్య తెలుగు:— "ఆ వేదాలకు సారమైన అర్థం యెట్టిది అంటేను. లోకమందు క్షరుడున్నూ, అక్షరుడున్నూ అనగాను యిద్దరుపురుషులు గలరు. బ్రహ్మాది దేవుడు మొదలయిన సమస్తప్రాణుల శరీరాలయందున్నూ వుండి సంసారం చేశే జీవుడు క్షరు డనిపించుకొనును. ఈ సంసారసంగం లేక, ఆనందస్వరూపుడై, వికారంలేక బ్రహ్మానుభవంతో గూడివుండెడి యటువంటి ముక్తుడయిన జీవుడు అక్షరు డనిపించుకొనును."

(6) 18 వ అధ్యాయం 66 వ శ్లోకానికి పూర్తి రామానుజభాష్యం:— "పరమ నిః శ్రేయససాధనభూతాలగు కర్మయోగ జ్ఞానయోగ భక్తియోగ రూపాలైన అన్ని ధర్మాలను నా ఆరాధనత్వంగా అతిమాత్రప్రీతితో యథాధికారంగా చేస్తూనే, నేను చెప్పినరీతిన ఫలకర్మకర్తృత్వాది పరిత్యాగంద్వారా వాటిని పరిత్యజించి, నేనొక్కణ్ణే కర్తను, ఆరాధ్యుడను, ప్రాప్యుడను అని తలచుచు, ఆ ప్రాప్తికి ఉపాయంకూడా నేనే అని అనుసంధానం చేయుము. ఇదే సర్వధర్మాల శాస్త్రీయపరిత్యాగమని ఈ అధ్యాయంలోగల 4 వ శ్లోకంనుండి 11 వ శ్లోకం వరకు సుదృఢంగా ఉపపాదింపబడింది. 'నేను నిన్ను సర్వపాపాలనుండి విడిపింతును' అనగా, సర్వ ధర్మాలను శాస్త్రీయంగా పరిత్యజించి వర్తిల్లుతున్న నిన్ను నా ప్రాప్తికి విరోధులైన అకృత్యకరణ, కృత్యఅకరణరూపాలైన అనాదికాలంనుండి సంచితాలైన అనంత పాపాలనుంచి ముక్తుణ్ణి చేస్తాను; శోకించకుము. లేక, ఈ శ్లోకాన్ని ఇంకో విధంగా కూడా అర్థం చేసుకోవచ్చును. ఎట్లంటే:— సర్వపాపవినిర్ముక్తుడు, భగవంతుని కత్యర్థప్రియపురుషుడును అగువానిచేతనే భక్తియోగం నిర్వర్తనీయం. భక్తియోగా రంభానికి విరోధాలైన పాపాలు అనంతాలు. వాటిప్రాయశ్చిత్తరూపాలగు ధర్మాలను అపరిమితకాలపర్యంతంచేసినా వాటిని దాటటం దుస్తరం. ఇదంతా ఆలోచించి తనకు భక్తియోగారంభానికి అర్హతలేదని శోకిస్తున్న అర్జునుని శోకం పోగొట్టుతూ, భగవంతుడు 'సర్వధర్మాలను పరిత్యజించి నన్నొక్కణ్ణే శరణు జొచ్చుము' అని చెప్పారు. అనాదికాలంచే సంచితాలైన నానావిధ అనంతపాపాలకు అనుగుణాలైన వాటి ప్రాయశ్చిత్తరూపాలైన నానావిధ అనంతకర్మాలు* పరిమితకాలవర్తివైన నీచేత

---

* కృచ్ఛ్ర, చాంద్రాయణ, కూష్మాండ, వైశ్వానర, ప్రాజాపత్య, వ్రాతపతి, పవిత్రేష్టి, త్రివృత్, అగ్నిష్టోమాదికాలు.

అనుష్ఠింపబడటం కఠినం, కాబట్టి నీ వా సర్వధర్మాలను వదలి భక్తియోగారంభసిద్ధికై, పరమకారుణికుడను, అనాలోచిత విశేషశేషలోకశరణ్యుడను, ఆశ్రితవాత్సల్యజలధిని అయిన నన్నొక్కణ్ణే శరణు జొచ్చుము (ప్రపద్యించుము); ఇందాక చెప్పిన స్వరూపంగల భక్తి ఆరంభానికి విరోధాలైన అన్నిపాపాలనుండి నిన్ను విడిపిస్తాను: శోకింపకుము." ఈ శ్లోకానికి తిరుమలయ్య తెలుగు: —"కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగరూపాలైన సమస్త ధర్మాలనున్ను ఇప్పుడు నే చెప్పినట్టు అనుష్ఠింపుచున్ను, అందులఫలమును తా గర్తననే కర్తృత్వమున్ను విడిచి, సకలకర్తనైన నన్నే శరణు చొరుము. యీ రీతినుండితివా, నన్ను బొందేటందుకు విరోధులైన సమస్తపాపాలవల్లనున్ను నిన్ను ముక్తుని జేశేను, వగవకుము." ఇది భగవద్గీతలో అతిప్రధానమైన చరమశ్లోకం. దీని ఆంధ్రీకరణం సంతృప్తికరంగా లేదు; భాష్యం లోనిభావం ఇందులో పూర్తిగాను బాగాను అనువృత్తం కాలేదు. ఒక అధ్యాత్మ కీర్తనలో ఈ శ్లోకాన్ని ఇలా ఇమిడ్చా డీయన:

నాడు "మామేకం శరణం వ్రజ" యను మాట
పోడిమి దిక్కుల నీ వెప్పుడు చాటగా
నేడు నీ దాసులమై నెరవేరితిమి గాక
వేడి వేడి కర్మపువిధు లిక నేలా?"

భాష్యాన్ని ఆంధ్రీకరణాన్ని తులనాత్మకంగా వివేచనచేస్తే, ఆబాలగోపాలానికి గీతార్థం విశిష్టాద్వైతమతానుసారం అవగతంకావాలని తిరుమలయ్య ప్రయత్నించారని తెలుతుంది; చాలామట్టుకు సఫలులైనట్టు తోస్తుంది. భాష్యమే కాకుండా వేదాంత దేశికుల టీక కూడా ఈ ఆంధ్రీకరణానికి ఆలంబనం అయింది. గ్రంథస్థం అయిన శాస్త్రార్థంకంటే గ్రంథకర్తకున్న విజ్ఞానం అధికతరంగా ఉంటుందని ఒకచోట శంకరులు అన్నారు.* పాణినికి తెలిపిందంతా ఆయనచే సూత్రీకరింపబడలేదు. అట్లాగే తిరుమలయ్య వేదాంతపాండిత్యం అంతా ఈ ఆంధ్రీకృత భగవద్గీతలో నిర్విశేషంగా ఇమడలేదు; అది ఈయన 14 కృతుల్లో అభివ్యక్తమైన దానికంటేకూడా అధికతరం.

---

* "యద్యద్విస్తరార్థం శాస్త్రం యస్మాత్పురుషవిశేషాత్సంభవతి, యథా వ్యాకరణాదిపాణిన్యాదేః, జ్ఞేయైకదేశార్థమపి, స తతోఽప్యధికతర విజ్ఞాన ఇతి ప్రసిద్ధం లోకే." బ్రహ్మసూత్రభాష్యం, 1-1-3.

# 5

1976 నుంచి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయప్రాచ్యపరిశోధనసంస్థను పునరుజ్జీవింప జేశాము. ఈ సందర్భంలో ప్రథమపదంగా ఆంధ్ర భగవద్గీతా సాహిత్యంలో ఆదిగ్రంథమైన దీన్ని సంస్కరించి ప్రకటించమని నేను సంస్థను కోరాను. శ్రీ వేంకటేశ్వర దేవాలయంచే ప్రదత్తమైన భూమిపై ఆ దేవాలయ సహాయంతో ఈ విశ్వవిద్యాలయం నెలకొల్పబడి, అవిచ్ఛిన్నంగా సహాయం పొందుతూంది. ఈ ప్రాచ్యపరిశోధనాసంస్థ ఆ దేవస్థానం స్థాపించి కొన్నేళ్లు నడిపి విశ్వవిద్యాలయానికిచ్చింది. శ్రీమద్రామానుజుల భాష్యానుసారం శ్రీ వేంకటేశ్వరుల అవ్యభిచారేకాంతభక్తుడు, పండితుడు, మహాకవీ అయిన వ్యక్తి వ్రాసిన, ఇంతవరకు వెలుగుచూడని ఈ గ్రంథాన్ని ప్రకటించగల్గటం ఈ సంస్థయొక్క సుకృతం. సంస్థకు మంగళకరమూన్ను.

నన్నయకు ముందుకూడా తెలుగులో పద్యరచన ఉండివుండవచ్చు; వాల్మీకి కంటే ముందుకూడా సంస్కృతంలో కవులు ఉండి ఉండవచ్చు. అయినా, ఈ భాషల్లో ఈ మహామహుల్ని ఆదికవులంటే అసామంజస్యం లేదు. అలాగే, వ్యావహారిక ఆంధ్రవచనంలో తిరుమలాచార్యుల గీత తొలిరచనంటే దోషం లేదు. రమారమి 500 ఏండ్లనాటి ఈ గ్రంథాన్ని ఆధునిక విమర్శాపద్ధతులతో పరిచయమున్న విద్వాంసుని పర్యవేక్షణలో సంస్కరించి సంపాదనచేయటం యుక్తమని ప్రొఫెసర్ జి. ఎన్. రెడ్డిని ఈ కార్యాన్ని నిర్వహించమన్నాను. ఆయన ప్రసిద్ధభాషాశాస్త్రజ్ఞులు, కృతకృత్యులైన నైఘంటుకులున్ను. తాళ్లపాక సాహిత్యంపై ప్రామాణిక విద్వాంసులు. తాళ్లపాక సంకీర్తనలలో కొన్నిటికి పరిష్కర్తయు అయిన శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులున్ను, శ్రీ కె. జె. కృష్ణమూర్తి ఈ కార్యంలో ప్రధాన పాత్రవహించారు. తాళపత్రప్రతులను తులనాత్మకంగా పరిశీలించటం, సంశోధించటం, పాఠనిర్ణయం, సాపుప్రతి తయారుచేయటం వీరిద్దరుచేశారు. ఈ ముగ్గురి ప్రయత్నఫలితం ఈ ప్రచురణ. వీరిని అభినందిస్తున్నాను.

అచ్చైనఫారాలు చూచినాక వీరితోపాటు రామానుజభాష్యమూలం అధ్యయనం చేసి వేదాంతశాస్త్రంలో పరిశ్రమచేసిన విద్వాంసులొకరు ఈ ముగ్గురికి తోడైతే ఇంకా బాగుండేదని తోచింది. అప్పుడు, లభ్యమైన 8 తాళపత్రప్రతుల్లో ఒకదాన్ని ప్రధానమైన దానినిగా పరిగ్రహించి ప్రకటిస్తూ తక్కినవాటిలోని పాఠభేదాలను క్రింద

సూచించేపద్ధతి గాకుండా, లభించిన అన్నిపాఠభేదాల్లో ఏది పరిగ్రాహ్యమో భాష్యాను సారం నిర్ణయంచేసి దాన్ని తిరుమలయ్యరచనగా నిర్ణయించి ప్రకటిస్తూ, దానికి భిన్నపాఠభేదాలను క్రిందసూచించటానికి వీలయ్యేది. తిరుమలయ్య తెనిగించింది భాష్యానుసారం కాబట్టి ఆయనేం వ్రాసిందీ నిర్ణయించటానికి భాష్యమే నికషోపలం. అప్పుడు కొన్నిచోట్లమాత్రం ఒక శ్లోకానువాదంలోనే ఒక పాదానువాదం ఒక తాళపత్ర ప్రతినుంచి. మరొక పాదానువాదం ఇంకోదానినుంచి గ్రహించాల్సివచ్చేది. దానికంటే ఇప్పుడు ఈ సంస్కరణలో అనుసరించిన విధానమే బాగుందని కొంద రనుకోవచ్చు. భాషా ఇతిహాసం దృష్ట్యా. భాషాశాస్త్రం దృష్ట్యా ప్రొఫెసర్ జి. ఎన్. రెడ్డి, శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు, శ్రీ కె. జె. కృష్ణమూర్తి తమకు నే నప్పగించిన పనిని తమ పాండిత్యాన్ని, అనుభవాన్ని వినియోగించి తృప్తికరంగా నిర్వహించారు. విద్వల్లోకం వారి పరిశ్రమను ఆమోదిస్తుందనీ, తెలుగు వ్యావహారిక భాషలోని ఇంచుమించు తొలిరచనను సరైన పద్ధతిన సంస్కరించి ప్రకటించినందుకు వీరికి ధన్యవాదాలిస్తుందనీ, ఆశిస్తాను. ఆంధ్ర గీతాసాహిత్యంలోని ఆదిగ్రంథప్రకటన ఆస్తికులకు—విశేషించి గీతాప్రేమికులందరికీ—సంతోషకారణం అవుతుంది. తిరుమలయ్య తెలుగుద్వారా గీతాహృదయం కనీసం కొన్నిచోట్ల ఇదివరకు లభ్యమైన తెలుగు టీకలు అనువాదాలలోకంటే ఎక్కువ బాగా వివృతం అవుతుందను కుంటాను.

తిరుపతి, 1978

# పీఠిక

ఆచార్య జి. యన్. రెడ్డి,
పరిష్కర్త

## 1. తాళ్లపాక కవుల ప్రాశస్త్యం

తెలుగు సాహిత్య చరిత్రలో తాళ్లపాక కవులకున్న స్థానం విలక్షణమైంది. విలక్షణ మని చెప్పడానికి ముఖ్యమైన కారణాలు:

(1) వంశకర్తగా వెలసినట్టి అన్నమయ్య మొదలు ఐదు తరాలవరకు- అంటే ఒకటిన్నర శతాబ్దికాలం-అవిచ్ఛిన్నంగా వివిధ ప్రక్రియల్లో అనేక గ్రంథాలను రచించి తెలుగు భాషా సాహిత్యాలకు ఎనలేని సేవ చేసినట్టి కవివంశీయులు తాళ్లపాక వారు.

(2) రాజాస్థానాల ప్రవేశాన్ని ఆశించకుండా నిర్మలమైన భక్తితో దైవసన్నిధిలో నివసించి ఇహపరాల పట్ల సమభావాన్ని వహించి సంగీత సాహిత్య కర్తలుగా రాశిలోను, వాసిలోను ఎన్నదగిన వాఙ్మయాన్ని సృష్టించిన మహనీయులు తాళ్లపాక కవులు.

(3) రాజాశ్రయానికి అర్రులు చాచకపోయినా, ఆనాటి ప్రభువులు వారంతకు వారే తమకు అనేక గ్రామాల్ని దానంచేస్తే వాటిని స్వీకరించి, రాజులయెడ ఆదరణను ప్రదర్శించిన తెలుగు కవులు వీరే.

(4) అయాచితంగా రాజులు తమకు దానంచేసిన గ్రామాలను స్వీయజీవనోపాధికి వినియోగించకుండా స్వామి కైంకర్యంలో నిమగ్నమైన కవివంశం కూడ తాళ్లపాక వారిదే.

(5) వేలకొలది సంకీర్తనలతో వేంకటేశ్వరస్వామికి సాహిత్యనీరాజనాలను అర్పించడమే కాకుండా స్వామి నిత్యకైంకర్యానికి వేనవేలుగా ద్రవ్యదానం చేసిన కవివంశీయులు వీరు.

(6) అధ్యాత్మ శృంగార భరితమైన సంకీర్తనల్ని వేలాదిగా రచించి, వేంకటేశ్వరస్వామి సన్నిధిలో గానంచేసి ఆ గానసంప్రదాయాన్ని ఈనాటి వరకు స్వామి సేవలో అవిచ్ఛిన్నంగా సాగిస్తూవున్న భక్తకవుల వంశం వీరిది.

(7) అశాశ్వతమైన తాళపత్రాలో, భూర్జపత్రాలో లేఖనసామగ్రిగా ఉన్న కాలంలో తాము రచించిన వేలకొలది సంకీర్తనల్ని, కొన్ని లఘురచనల్ని అక్షయమైన రాగిరేకుల మీద వ్రాయించి తమ వంశీయుల రచనలకు ఒక భాండాగారాన్ని స్థాపించుకొన్న కవివంశీయులు కూడ తాళ్లపాకవారే.

(8) తెలుగు కావ్యవాఙ్మయంలో సాంప్రదాయికంగా వస్తూవుండినటువంటి గ్రాంథికశైలిని ఒకవైపు ఆదరించి, మరొక వైపు వ్యావహారికభాషను గూడ రచనలందు ప్రవేశపెట్టి భాషావిషయంలో సంప్రదాయాన్ని, ప్రయోగాన్ని ప్రదర్శించినటువంటి పండితకవులు తాళ్లపాకవారు.

(9) తెలుగులో సంగీత సాహిత్య మిశితమై, అభినయార్హమైన సంకీర్తన వాఙ్మయానికి ఆద్యులై, అలేఖ్యమూ, నిసర్గమనోజ్ఞమూ అయిన జానపదకవిత్వపు ఛాయల్ని తమ రచనల్లో ప్రతిబింబింప చేసినట్టి ప్రజా కవు లనదగినవారు తాళ్లపాక కవులు.

పై కారణాలవల్ల తెలుగు కవుల్లో తాళ్లపాక కవులకున్న స్థానం విలక్షణమైంది; విశిష్టమైంది.

## 2. తాళ్లపాక అన్నమాచార్యులు (క్రీ. శ. 1408-1503)†

తాళ్లపాక కవుల వంశకర్త అన్నమయ్య, అతని తండ్రి తాతలు ప్రసిద్ధులు కారు. సామాన్యులుగా జీవించిన వారి నామస్మరణకు వంశోద్ధారకుడుగా వెలసిన అన్నమాచార్యులే ప్రధాన కారణం. వారు నందవరీక స్మార్త బ్రాహ్మణులు. ఆ వంశంలో కారణజన్ముడుగా వెలసినవాడు అన్నమయ్య. బాల్యంలోనే స్వగ్రామమైన తాళ్లపాకను వదలి తిరుమల చేరగా ఆ బాలభక్తునికి వేంకటేశ్వరస్వామి సాక్షాత్కరించాడట. అక్కడే ఘనవిష్ణుడు అనే వైష్ణవయోగివల్ల శంఖ చక్ర ముద్రా ధారణాన్ని, శ్రీ వైష్ణవాన్ని స్వీకరించి అన్నమాచార్యు డయ్యాడు. వేదాంతదేశికులు ఏడుకొండల వాని గుడిగంట అంశమని ప్రసిద్ధి. అలాగే అన్నమాచార్యులు నంద

† T. T. D. రిపోర్టు ప్రకారం.

కాంశ సంభూతుడని ప్రఖ్యాతి. మరణ పర్యంతం వేంకటేశ్వర స్వామిని సంగీత సాహిత్యాలతో ఆరాధించి వంశకర్తగా వెలసిన గృహస్థుడు అన్నమాచార్యుడు. ఇతడు తెలుగులో తొలిసారిగా సంకీర్తన రచనకు శ్రీకారం చుట్టి ముప్పదిరెండువేల సంకీర్తనలకు కర్తగా 'పదకవితా పితామహుడు'గా ప్రసిద్ధికెక్కిన మహనీయుడు.

ప్రాచీన తెలుగు కవులు స్వీయచరిత్రలు వ్రాయలేదు. వారి జీవిత చరిత్రల్ని ఆనాటి వారు వ్రాసి పెట్టలేదు. కాని అన్నమాచార్యుల జీవిత చరిత్రమ మనుమడైన తాళ్లపాక చిన్నన్న ద్విపదలో గ్రంథస్థం చేసి పెట్టాడు.[1] ఈ విధంగా జీవిత చరిత్రకు నోచుకొన్న తొలి తెలుగు కవి అన్నమాచార్యుడే అనవచ్చు. కవి జీవితాన్ని ఇతివృత్తంగా స్వీకరించి జీవిత చరిత్రను రచించిన తొలి తెలుగు కవి కూడ తాళ్లపాక వంశీయుడే కావడం గమనార్హం. ఇంచుమించు శత శరత్తులు జీవించిన అన్నమాచార్యులకు సాళ్వ నరసింగరాయలు (క్రీ. శ. 1485-1492) సమకాలికుడు. చెలికాడని కూడా ప్రతీతి.

## 3. పెద తిరుమలాచార్యులు (క్రీ. శ. 1468-1553)

అన్నమాచార్యుల పుత్రుడు పెదతిరుమలయ్య. తండ్రి గుణగణాలను. భక్తి ప్రపత్తుల్ని, సంగీత సాహిత్య పాటవాన్ని, గ్రంథరచనా కౌశలాన్ని సమృద్ధిగా సంక్రమింప జేసుకొని తండ్రికి తీసిపోని కుమారుడుగా జీవించిన మహనీయుడు పెద తిరుమలాచార్యులు. 'శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య', 'శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్య'. 'వేదాంతాచార్యా'ది బిరుదాలు పెద తిరుమలయ్య ప్రతిభా పాండిత్యాలకు దృష్టాంతాలు. ఇతడు సంస్కృతాంధ్రా లందే గాకుండా తమిళభాషలోనూ ప్రవీణుడు. అన్నమయ్యకు వలె పెదతిరుమలయ్యకు జీవిత చరిత్ర గ్రంథం వెలసినట్లు లేదు. అయినా అతడు రచించిన కృతులు. వేయించిన శాసనాలు చాలా వున్నాయి. వాటి ఆధారంతో పెద తిరుమలయ్య జీవిత విశేషాలను తెలుసుకోవచ్చు.

తన జీవితంలో పెదతిరుమలాచార్యులు నిర్వహించిన ఘనకార్యాలు మూడు:

(1) తండ్రి ఆదేశాన్ననుసరించి పెద తిరుమలయ్య ప్రతి దినం ఒక సంకీర్తనను శ్రీ వేంకటేశ్వరునికి అంకితంగా రచించి స్వామి సన్నిధిలో గానం చేయడమే గాక తన తండ్రి రచించిన వేలకొలది సంకీర్తనల్ని తన సంకీర్తనలతో పాటు రాగి రేకుల మీద వ్రాయించి భద్రపరచడం. పెద తిరుమలయ్య సంకీర్తన రచనకు శ్రీకారం

---

1. అన్నమాచార్య చరిత్రము: తిరుమల తిరుపతి దేవస్థాన ప్రచురణ. 1949

పుట్టిన రోజు శాలివాహన శకం 1424, దుందుభి ఫాల్గుణ బహుళ ద్వాదశి. అంటే క్రీ. శ. 23-2-1503.

కవికృతుల్ని తామ్రఫలకాలమీద వ్రాయించే సంప్రదాయం తెలుగుదేశంలో తాళ్లపాక కవులకు పూర్వం లేదు. వారి తర్వాత కూడ లేదు. ఈ పద్ధతికి తాళ్లపాక వంశీయులే ఆద్యులు, అద్వితీయులు. మరి భారతదేశంలో కావ్యాలను తామ్ర ఫల కాలమీద వ్రాయించే సంప్రదాయం ప్రాచీనకాలంలోనే ఉన్నట్లు తెలుస్తుంది. కని ష్కుడు కొన్ని బౌద్ధమత గ్రంథాలను రాగిరేకుల మీద వ్రాయించినట్లు హ్యూయాన్ త్సాంగ్ పేర్కొని వున్నాడనీ, సాయణాచార్యుల వేదభాష్యం కూడా రాగిరేకుల మీది కెక్కినట్లు ఒక ఐతిహ్యమున్నదనీ డి. సి. సర్కార్ వ్రాసియున్నారు.[2] లఘు కావ్యాలను శిలలమీద చెక్కించే సంప్రదాయం కూడా। వున్నదని, కాంచీపురంలో కచ్ఛపేశ్వరాలయంలోని ఒక శిలా స్తంభం మీద మయూరుని సూర్యశతకం అక్ష రత్వాన్ని పొంది వున్నదనీ శ్రీ ఆర్. ఎస్. పంచముఖిగారు పేర్కొన్నారు.[3]

తాళ్లపాక కవుల సాహిత్యాన్ని రాగిరేకులమీద వ్రాయించి తిరుమలలో ఆలయ ప్రాంగణంలో భద్రపరచిన గదికి 'తాళ్లపాక అర' అని పేరు. పెద తిరుమలయ్య మనుమల తరం తర్వాత తాళ్లపాక వంశంలో కవులు, రచయితలు వెలసినట్లులేదు. కాని ఆ వంశీయులు తమ పితాళ్ల (తండ్రి తాతల) సాహిత్యాన్ని పెంపొందించక పోయినా సంరక్షించినారు. తాళ్లపాక అరలోని తాళ్లపాక కవుల సాహిత్యాన్ని గురించి మన ప్రాచీనకవు లెవరూ ప్రస్తావించలేదు. మొట్టమొదట ప్రస్తావించిన వాడు విదేశీయుడైన ఎ. డి. క్యాంబెల్. అతడు క్రీ. శ. 1816లో వ్రాసిన మాటలు:

"Having heard that a number of Poems engraved on some thousand sheets of Copper had been preserved by the pious care of a family of Brahmins in the temple on the sacred hill at Tirupati, I deputed a native for the purpose of examining them, but with the exception of a treatise on grammar, of which a copy

---

2. Vide P. 377 Indian Epigraphy by D. C. Sircar. First Edition 1965.

3. Vide Presidential Address delivered by Mahamahimopadhyaya R. S. Panchamukhi, 4th Annual congress of Epigraphical Society of India, January 1978, Madras.

was taken, the whole collection was found to contain nothing but Voluminous hymns in praise of the Deity."[4]

2. శ్రీవేంకటేశ్వరపాదారవిందచింతనామృతపానవిశేషమత్తచిత్తుడైన పెద తిరుమలాచార్యులు స్వామివారి పూజలకు, కైంకర్యాలకు, పునరుద్ధరణ కార్యక్రమాలకు అనేక గ్రామాలను, అమితమైన ధనాన్ని దానం చేయడం అతడు నిర్వహించిన రెండవ ఘనకార్యం. అందుకు శాసన సాక్ష్యాలున్నాయి. తిరుమల తిరుపతి దేవస్థాన శాసన సంపుటాలలో తాళ్లపాక వంశీయులు వేయించిన శాసనాలు ఇరవై ప్రకటితమై ఉన్నాయి.[5] వాటిలో అన్నమాచార్యులు వేయించిన శాసనమంటూ ఏదీ లేదు కాని పెద తిరుమలయ్య వేయించిన శాసనాలు పదిహేను ఉన్నాయి. మిగిలిన ఐదు పెద తిరుమలయ్య సంతతివారు వేయించినవి. పెదతిరుమలయ్య వేయించిన శాసనాల వివరాలు:

| క్రమసంఖ్య | శాసనసంపుటం | శాసనసంఖ్య | శాసనకాలం | భాష |
|---|---|---|---|---|
| 1. | III | 122 | 30-11-1517 | తమిళం |
| 2. | IV | 6 | 31-10-1530 | తమిళం |
| 3. | IV | 14 | 27-3-1532 | తమిళం |
| 4. | IV | 20 | 1532 | తెలుగు |
| 5. | IV | 40 | 17-5-1535 | తమిళం |
| 6. | IV | 41 | 1532 | తెలుగు |
| 7. | IV | 100 | 25-10-1537 | తమిళం |
| 8. | IV | 122 | 15-1-1539 | తమిళం |
| 9. | IV | 129 | 17-3-1539 | తమిళం |
| 10. | IV | 155 | 12-2-1541 | తమిళం |
| 11. | V | 34 | 19-3-1544 | తమిళం |
| 12. | V | 47 | 3-7-1545 | తమిళం |
| 13. | V | 47A | (?) | తమిళం |
| 14. | V | 55 | 2-8-1545 | తమిళం |
| 15. | V | 68 | 20-6-1546 | తమిళం |

---

4. Vide Introduction, Grammer of Teloogoo language by A. D. campbell. First Edition, 1816, Madras.

5. T. T. D. Epigraphical Series Vol. I to VI. Edited by Sri Sadhu Subrahmanya Sastry, 1931, Tirupati.

చుట్టిన రోజు శాలివాహన శకం 1424. దుందుభి ఫాల్గుణ బహుళ ద్వాదశి. అంటే క్రీ. శ. 23-2-1503.

కవికృతుల్ని తామ్రఫలకాలమీద వ్రాయించే సంప్రదాయం తెలుగుదేశంలో తాళ్లపాక కవులకు పూర్వం లేదు. వారి తర్వాత కూడ లేదు. ఈ పద్ధతికి తాళ్లపాక వంశీయులే ఆద్యులు, అద్వితీయులు. మరి భారతదేశంలో కావ్యాలను తామ్ర ఫల కాలమీద వ్రాయించే సంప్రదాయం ప్రాచీనకాలంలోనే ఉన్నట్లు తెలుస్తుంది. కని ష్కుడు కొన్ని బౌద్ధమత గ్రంథాలను రాగిరేకుల మీద వ్రాయించినట్లు హ్యూయాన్ త్సాంగ్ పేర్కొని వున్నాడనీ, సాయణాచార్యుల వేదభాష్యం కూడా రాగిరేకుల మీది కెక్కినట్లు ఒక ఐతిహ్యమున్నదనీ డి. సి. సర్కార్ వ్రాసియున్నారు.[2] లఘు కావ్యాలను శిలలమీద చెక్కించే సంప్రదాయం కూడా వున్నదని, కాంచీపురంలో కచ్ఛపేశ్వరాలయంలోని ఒక శిలాస్తంభం మీద మయూరుని సూర్యశతకం అక్ష రత్వాన్ని పొంది వున్నదనీ శ్రీ ఆర్. ఎస్. పంచముఖిగారు పేర్కొన్నారు.[3]

తాళ్లపాక కవుల సాహిత్యాన్ని రాగిరేకులమీద వ్రాయించి తిరుమలలో ఆలయ ప్రాంగణంలో భద్రపరచిన గదికి 'తాళ్లపాక అర' అని పేరు. పెద తిరుమలయ్య మనుమల తరం తర్వాత తాళ్లపాక వంశంలో కవులు, రచయితలు వెలసినట్లులేదు. కాని ఆ వంశీయులు తమ పితాళ్ల (తండ్రి తాతల) సాహిత్యాన్ని పెంపొందించక పోయినా సంరక్షించినారు. తాళ్లపాక అరలోని తాళ్లపాక కవుల సాహిత్యాన్ని గురించి మన ప్రాచీనకవు లెవరూ ప్రస్తావించలేదు. మొట్టమొదట ప్రస్తావించిన వాడు విదేశీయుడైన ఎ. డి. క్యాంబెల్. అతడు క్రీ. శ. 1816లో వ్రాసిన మాటలు:

"Having heard that a number of Poems engraved on some thousand sheets of Copper had been preserved by the pious care of a family of Brahmins in the temple on the sacred hill at Tirupati, I deputed a native for the purpose of examining them, but with the exception of a treatise on grammar, of which a copy

---

2. Vide P. 377 Indian Epigraphy by D. C. Sircar. First Edition 1965.

3. Vide Presidential Address delivered by Mahamahimopadhyaya R. S. Panchamukhi, 4th Annual congress of Epigraphical Society of India, January 1978, Madras.

was taken, the whole collection was found to contain nothing but Voluminous hymns in praise of the Deity." [4]

2. శ్రీవేంకటేశ్వరపాదారవిందచింతనామృతపానవిశేషమత్తచిత్తుడైన పెద తిరుమలాచార్యులు స్వామివారి పూజలకు, కైంకర్యాలకు, పునరుద్ధరణ కార్య క్రమాలకు అనేక గ్రామాలను, అమితమైన ధనాన్ని దానం చేయడం అతడు నిర్వ హించిన రెండవ ఘనకార్యం. అందుకు శాసన సాక్ష్యాలున్నాయి. తిరుమల తిరుపతి దేవస్థాన శాసన సంపుటాలలో తాళ్లపాక వంశీయులు వేయించిన శాసనాలు ఇరవై ప్రకటితమై ఉన్నాయి.[5] వాటిలో అన్నమాచార్యులు వేయించిన శాసనమంటూ ఏదీ లేదు కాని పెద తిరుమలయ్య వేయించిన శాసనాలు పదిహేను ఉన్నాయి. మిగిలిన ఐదు పెద తిరుమలయ్య సంతతివారు వేయించినవి. పెదతిరుమలయ్య వేయించిన శాసనాల వివరాలు:

| క్రమసంఖ్య | శాసనసంపుటం | శాసనసంఖ్య | శాసనకాలం | భాష |
|---|---|---|---|---|
| 1. | III | 122 | 30-11-1517 | తమిళం |
| 2. | IV | 6 | 31-10-1530 | తమిళం |
| 3. | IV | 14 | 27-3-1532 | తమిళం |
| 4. | IV | 20 | 1532 | తెలుగు |
| 5. | IV | 40 | 17-5-1535 | తమిళం |
| 6. | IV | 41 | 1532 | తెలుగు |
| 7. | IV | 100 | 25-10-1537 | తమిళం |
| 8. | IV | 122 | 15-1-1539 | తమిళం |
| 9. | IV | 129 | 17-3-1539 | తమిళం |
| 10. | IV | 155 | 12-2-1541 | తమిళం |
| 11. | V | 34 | 19-3-1544 | తమిళం |
| 12. | V | 47 | 3-7-1545 | తమిళం |
| 13. | V | 47A | (?) | తమిళం |
| 14. | V | 55 | 2-8-1545 | తమిళం |
| 15. | V | 68 | 20-6-1546 | తమిళం |

4. Vide Introduction, Grammer of Teloogoo language by A. D. campbell. First Edition, 1816, Madras.

5. T. T. D. Epigraphical Series Vol. I to VI. Edited by Sri Sadhu Subrahmanya Sastry, 1931, Tirupati.

పెద తిరుమలయ్య వేయించిన పై పదిహేను శాసనాల్లో తెలుగుభాషలో వున్నవి రెండు మాత్రమే. (Vol. IV. 20; 41.) మిగిలినవన్నీ తమిళంలోనే వున్నాయి. తమిళ శాసనాల్లో పెద తిరుమలయ్యకు తిరుమలై అయ్యంగార్, తాళ్ళపాకం పెరియ తిరుమలయ్యంగార్ అని వ్యవహారం.

పై పదిహేను గాకుండా పెద తిరుమలయ్య సంతతివారు వేయించిన శాసనాలు ఐదు. వాటిలో తెలుగుశాసనం ఒక్కటే. (సం. IV, సంఖ్య 144-కాలం. క్రీ. శ. 20-3-1540). మిగిలిన నాలుగూ తమిళ శాసనాలు. (సం. V, సంఖ్య 71, 99, 153, 159.) పై శాసనాలనుబట్టి పెద తిరుమలయ్యకు, అతని కుమారులకు అచ్యుత రాయలు (క్రీ. శ. 1529-1542), సదాశివరాయలు (క్రీ. శ. 1542-1570) సన్నిహితులని తెలుస్తుంది. కృష్ణదేవరాయలు పెద తిరుమలయ్యకు సమకాలికుడే. రాయలు క్రీ. శ. 1513-1521 మధ్యకాలంలో ఏడుమార్లు తిరుమల యాత్రలు చేసి స్వామికి భూరిదానాలు చేసినట్లు శాసనాలున్నాయి. కాని రాయలు వేయించిన శాసనాల్లో పెద తిరుమలయ్య ప్రసక్తిగాని, పెద తిరుమలయ్య వేయించిన శాసనాల్లో కృష్ణరాయల ప్రస్తావనగాని లేకపోవడం ఒక వింతగా తోస్తుంది. పైగా కృష్ణదేవరాయలు క్రీ. శ. 1524 లో వ్యాసరాయలకు తాళ్ళపాకను, మరికొన్ని పరిసర గ్రామాలను దత్తం చేసినాడు. ఏ కారణం వల్లనో రాయలకు, పెద తిరుమలయ్యకు పరస్పరమైత్రి ఉన్నట్లు లేదు. మెకంజీ సంపుటాల్లో తాళ్ళపాక వంశీయులకు సంబంధించిన గ్రామ కైఫీయత్తులుకూడా కొన్ని ఉన్నాయి.[6]

పెద తిరుమలయ్య క్రీ. శ. 1531 లో విజయనగరాన్ని దర్శించి విఠలస్వామి ఆలయానికి కొంత దానం చేసినట్లూ, క్రీ. శ. 1534 లో అచ్యుతరాయల అనుమతితో కడప జిల్లా నందలూరులోని ఆలయానికి అందపూరు అనే గ్రామం ఇప్పించినట్లూ, క్రీ. శ. 1533లో చినకంచిలోని పెరుమాళ్ళస్వామికి కొన్ని ఉత్సవాలు ఏర్పరచి, నైవేద్యం జరిపించినట్లూ తెలిపే శాసనాలు కూడా వున్నాయి. సాళువ తిమ్మరుసు,

---

6. చూడండి: గ్రామ కైఫీయత్తులు. 1. యాటిమార్పురం M. 356; 2. కల్లూట్ల L. R. Vol. 1; 3. తుమ్మలూరు L. R. Vol. 2; 4. మాచనూరు L. R. Vol. 2; 5. పొడదుర్తి L. R. Vol. 2; 6. వ్యాటపల్లి L. R. Vol. 2; 7. కలువేపల్లె L. R. Vol. 7; 8. చదిపిరాళ్లదిన్నె L. R. Vol. 15; 9. మిన్నికల్లు L. R. Vol. 57; 10. మంగళగిరి L. R. Vol. 57; 11. గొరిజవోలు L. R. Vol. 60.

లక్షణానికీ, భారతాంతర్గతమైన భగవద్గీతకూ పెద తిరుమలయ్య వ్యాఖ్యానాలు రచించి నాడు. మొదటిది అలభ్యం. రెండవది లభ్యం. ఇది భగవద్గీతకు తొలి తెలుగు వ్యాఖ్య; పైగా ఆనాటి వ్యావహారిక భాషలో వెలసిన వచన వ్యాఖ్య. దుర్గ్రాహ్యంగా వున్న ఒక గ్రంథాన్ని పాఠకులకు సుబోధకమయ్యేటట్లు ఉద్దేశించి చేసిన రచనే వ్యాఖ్య. సుబోధకతను ఆశించే వచనరచనలో గ్రాంథికానికన్నా వ్యావహారికమే ఉచితం. ఈ రహస్యాన్ని గ్రహించి వ్యావహారికభాషను భగవద్గీతా వ్యాఖ్యానంలో పాటించిన పెద తిరుమలయ్య అభినందనీయుడు. ఈ సంప్రదాయాన్ని అనుసరించే అతని మనుమడు తిరువేంగళయ్య అమరకోశానికి 'గురుబాలప్రబోధిక' అనే పేరుతో ఒక వ్యాఖ్యానాన్ని ఆనాటి వ్యావహారికంలోనే వ్రాశాడు. కాని వావిళ్లవారు ప్రచురించిన ఆ గురుబాలప్రబోధిక మాత్రం గ్రాంథికభాషావతారాన్ని ధరించింది.

తెలుగుభాషాచరిత్రలో భాషాపరమైన ఒక ఉద్యమాన్ని లేవదీసినవారు శివ కవులు. 'ఆరూఢ గద్య పద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠరచనా' రూపమైన సంస్కృత భాషాధిక్యాన్నుండి తెలుగుభాషకు విముక్తిని కలిగించడానికి వారు ప్రయత్నించినారు. కాని ఆ ఉద్యమం పూర్తిగా ఫలప్రదం కాలేదు. శివకవులు ప్రతిపాదించిన 'దేశి', 'జానుతెనుగు' వాస్తవానికి గ్రాంథికభాషాపరిధిని దాటలేదు. కాని శివకవులు అభిమానించిన 'దేశి', 'జానుతెనుగు' శివకవుల వాఙ్మయంలోకన్న తాళ్లపాక సాహిత్యంలోనే భాషాపరంగా సువ్యక్తమై ఉన్నాయి. అందుకు కారణం తాళ్లపాక కవులు వ్యావహారిక భాషా ప్రాధాన్యాన్ని గుర్తించి అభిమానించడమే. తాళ్లపాక కవులు పరతత్త్వారాధకులైనప్పటికీ వారి లోకజ్ఞత మాత్రం మెచ్చదగింది. తాళ్లపాకకవులు స్థాపించిన వ్యావహారిక భాషారూపసంప్రదాయాన్నే అప్పకవ్యాది ప్రాచీన వ్యాఖ్యాతలందరు పాటించారు. మనుచరిత్ర, వసుచరిత్రాది ప్రబంధాలకు సి. పి. బ్రౌన్ ఆనాటి పండితులచేత వ్రాయించిన వ్యాఖ్యానాలుకూడా వ్యావహారికం లోనే వున్నాయి. గ్రాంథిక భాషారూప వ్యాఖ్యానాలు మాత్రం చిన్నయసూరి తర్వాతనే వచ్చినాయి.

## 4. భగవద్గీతావ్యాఖ్య

పెదతిరుమలయ్య రచించిన భగవద్గీతావ్యాఖ్య భగవద్గీతపరంగానేగాక తెలుగు వాఙ్మయంలోనూ తొలి వ్యాఖ్యాన గ్రంథం. ఈ గ్రంథానికి విషయాన్నిబట్టేకాకుండా, భాషాశైలినిబట్టికూడా ప్రాధాన్యం ఉంది. శాసనాలను మినహాయిస్తే 16 వ శతాబ్దపు తెలుగుభాషా వ్యావహారిక స్వరూపాన్ని ముఖ్యంగా—ఆనాటి రాయలసీమప్రాంతపు

భాషావ్యవహారాన్ని తెలుసుకోవడానికి ఇది ప్రబలాధారం. దీని రచనా కాలం మనకు తెలియదు. అయినా ఇది ప్రౌఢనిర్భరవయఃపరిపాకంలోకాక పలితకేశుడైన పిదపనే పెద తిరుమలయ్య రచించి వుంటాడని చెప్పవచ్చు. ఇది 16వ శతాబ్ది రెండవపాదంలో ఆవిర్భవించిన రచన కావచ్చు.

తిరుమలాచార్యుని భగవద్గీతావ్యాఖ్యకు ఆంధ్రవేదాంతమనే నామాంతర మున్నట్లు కొందరి ఊహ. అలా మొదట ఊహించినవారు పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.[8] వారు పిఠాపురం రాజావారి ఆదేశంతో తాటాకు పుస్తకాల్ని సేకరించడానికి 1923 జూన్ నెలలో కర్నూలుమండలసంచారం చేసినారు. అప్పుడు వెలుగోడుకు సమీపగ్రామమైన అబ్దుల్లాపురంలో చిదంబరయ్య అనే గృహస్థుడు తనకు వచన భగవద్గీతను ఇచ్చినట్లు గ్రంథస్థం చేసివున్నారు.[9]

భగవద్గీత వ్యాఖ్యకు లభిస్తున్న ఏ తాళపత్రప్రతిలోనూ 'ఆంధ్రవేదాంతము' అనే పేరులేదు. ఎక్కువ ప్రతుల్లో అధ్యాయాంతాల్లో "భగవద్గీతార్థం తెలుగుచేసి వ్రాయించినందు" అని మాత్రం వున్నది. ఒకటి రెండు ప్రతుల్లో కొన్ని అధ్యాయాల చివర "శేఠిన భగవద్గీతార్థం తెనుగు టీక", "చేఠిన భగవద్గీతల తెనుగు టీక" ఇత్యాదిగా ఉంది. మరి 'ఆంధ్రవేదాంతము' అనే తెలుగు గ్రంథమేది కూడా ఇంతవరకు మనకు లభించలేదు.

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారి తరువాత ఈ భగవద్గీతావ్యాఖ్యను ప్రస్తావించినవారు గిడుగు వేంకట రామమూర్తి పంతులు. పెద తిరుమలయ్య భగవదీత టీకనుండి 'గద్య చింతామణి'లో మూడు శ్లోకాల తెలుగు తాత్పర్యాన్ని వారు ఉదహరించినారు.[10]

1945 లో '(శ్రీ వేంకటేశ్వరవచనము'లను పరిష్కరించిన వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పీఠికలో పెద తిరుమలాచార్యుల కృతులు పంద్రెండింటిని పేర్కొంటూ అందులో 'ఆంధ్రవేదాంతము (ద్విపద)', 'భగవద్గీత (వచనము) అనే రెండింటిని

---

8. చూ: పీఠిక పరమయోగి విలాసము. పిఠాపుర సంస్థానాధీశుల ప్రచురణ, 1928.

9. చూ: సారస్వత సర్వస్వము. సంపుటము ౧, సంచిక ౫. పుట 23, రుధిరోద్గారి పౌష్యము (జనవరి 1924.)

10. చూ: పుట 201, గద్యచింతామణి. ప్రచురణ 1933.

C

భిన్నకృతులుగా పేర్కొన్నారు. వేటూరివారే 1949లో 'అన్నమాచార్యచరిత్రము'నకు వ్రాసిన పీఠికలో పెద తిరుమలయ్య కృతులను మరలా పేర్కొన్నారు. ఆ జాబితాలో 'ఆంధ్రవేదాంతము (ద్విపద)' అన్నది లేదు. 'భగవద్గీత తెల్గువచనము' మాత్ర మున్నది. శ్రీ వేటూరి ఆనందమూర్తి ఈ 'భగవద్గీత వచనము'నకే 'ఆంధ్ర వేదాంత మనియు, భగవద్గీతాటీక' యనియు నామాంతరములు" అని తన గ్రంథంలో వ్రాసి వున్నారు.[11] ఆధారం మాత్రం చూపలేదు.

వ్యాఖ్యాన గ్రంథాలకుకూడా నామకరణంచేసే సంప్రదాయం సంస్కృతంలో ఉంది. తాళ్లపాక కవుల్లో పెద తిరుమలయ్య మనుమడైన తిరువెంగళప్ప మమ్మటుని కావ్యప్రకాశానికి వ్రాసిన వ్యాఖ్యకు 'సుధానిధి' అని, అమరకోశవ్యాఖ్యకు 'గురుబాల ప్రబోధిక' అని పేర్లు పెట్టినాడు. వ్యాఖ్యలకు నామకరణంచేసే ఈ సంప్రదాయాన్ని బట్టి పెద తిరుమలయ్య భగవద్గీతావ్యాఖ్యకు ఆంధ్రవేదాంతమని—గ్రంథంలో ఈపేరు లేకున్నా తర్వాత వారు వ్యవహరించినారని ఊహించవచ్చు. 'వేదాంతాచార్య' అనే బిరుదు కూడా వారికున్నది కదా!

## 5. భగవద్గీతావ్యాఖ్య—తాళపత్రప్రతులు

ఈ గ్రంథ పరిష్కరణకు స్వీకరించిన తాళపత్రప్రతులు ఎనిమిది. వాటిలో తిరుపతిప్రతులు నాలుగు (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థలోనివి). తంజావూరుప్రతి ఒకటి (సరస్వతిమహల్‌లోనిది). మద్రాసుప్రతులు రెండు (ప్రభుత్వ ప్రాచ్యలిఖిత భాండాగారంలోనివి). ప్రొద్దుటూరుప్రతి ఒకటి (శ్రీ పి. మల్లేశుడుగారి సొంతప్రతి).[12]

పై ఎనిమిది ప్రతులకు ఇచ్చిన సంకేతాలు; వివరాలు.

A ప్రతి (D 2145 తిరుపతి)

ఈ ప్రతి బాగుంది. వ్రాయసకానిపేరు తోట గజపతి. దీని లేఖనకాలం హేవళంబి సంవత్సరం అంటే క్రీ. శ. 1777 కావచ్చు.

---

11. చూ: పుట 462 తాళ్లపాక కవుల కృతులు_వివిధ సాహితీ ప్రక్రియలు, సంపుటం I, 1974.

12. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తక భాండాగారంలో ఒక ప్రతి ఉన్నది. ఆ ప్రతి మాకందుబాటులోకి రాని కారణాన దానిని సంప్రదించలేదు.

B ప్రతి (R 804 తిరుపతి)

ఇది ప్రాచీనమైనప్రతి. క్రిమిదష్టం. కొంతశిథిలం. ఇందులో అవతారికతో పాటు తొలి ఆరు శ్లోకాలున్న గ్రంథభాగం లుప్తం. వ్రాయసకాని పేరుగాని లేఖన కాలంగాని ఇందులోలేవు. ఈ ప్రతిని పిఠాపురం మహారాజావారు మద్రాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారానికి 1927-28 లో బహూకరించినారు. అంతే పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారికి 1923 జూన్‌లో కర్నూలుజిల్లా అబ్దుల్లాపురం వాస్తవ్యులు చిదంబరయ్యగారు ఇచ్చినప్రతి ఇదే.

C ప్రతి (D 2147 తిరుపతి

అక్కడక్కడ క్రిమిదష్టతవున్నా ఈ ప్రతి స్థితి ఫరవాలేదు. ఇది B ప్రతి అంత ప్రాచీనంకాదు. వ్రాయసకాని పేరుగాని, లేఖనకాలంగాని ఇందులో లేవు.

D ప్రతి (7653 తిరుపతి)

ఇది ఒక్కటే అసమగ్రంగా ఉన్నప్రతి. మొదటి ఐదు అధ్యాయాలు సమగ్రంగా ఉన్నాయి. ఆరో అధ్యాయం నాల్గవశ్లోకం తర్వాతి గ్రంథభాగం లుప్త మైంది. ఇందులో వ్రాయసకాని పేరు లేదు. లేఖనకాలం కూడా లేదు.

E ప్రతి (8918 తంజావూరు)

ఇందులో శైథిల్య గ్రంథపాతాదులు లేవు. లేఖకుని పేరు వెంకటపతియోగి, లేఖనకాలం లేదు.

F ప్రతి (D 2015 మద్రాసు)

ఈ ప్రతి మంచిస్థితిలోవుంది. కాని లేఖకుడు అక్కడక్కడ ఉండవలసిన అక్షరాలకు బదులు శ్రీకారాలను వ్రాసివున్నాడు. అంటే అతడు గ్రహించిన మూల ప్రతిలో క్రిమిదష్టమై లోపించిన అక్షరాల్ని తన ప్రతిలో శ్రీకారాలతో పూరించు కొన్నాడని భావించాలి. లేఖనకాలం లేదు. వ్రాయసకాని పేరుకూడా లేదు, కాని 'శ్రీకణ్ణపురనాయకి సహిత శ్రీ శౌరిరాజాయనమః' అని దేవతాస్మరణ అధ్యాయాం తాల్లో కన్పిస్తుంది. తంజావూరుజిల్లాలో తిరుక్కణ్ణపురక్షేత్రంవుంది. అది వైష్ణవ క్షేత్రం. అక్కడవెలసిన దైవమే శౌరిరాజస్వామి.

G ప్రతి (R 2268 మద్రాసు)

అక్కడక్కడ కొంత శిథిలమైవున్న ప్రతి ఇది. గ్రంథారంభానికి ముందున్న ఆకులో "శ్రీమాన్ మాడభూషి వేదాంతాచార్యులయ్యవార్లంగారి చంపూరామాయణం"

అనివుంది. మరి ఈ గ్రంథం భగవద్గీతేగాని చంపూరామాయణంకాదు. గ్రంథాంతంలో ఇచ్చిన లేఖనకాలం క్షయ సంవత్సర భాద్రపద శు. ౧౦. బు. అంటే దీని లేఖన కాలం క్రీ. శ. 18-8-1686.

P ప్రతి

కడపజిల్లా ప్రొద్దుటూరు ప్రభుత్వ కళాశాలలో తెలుగు అధ్యాపకుడుగావున్న శ్రీ పి. మల్లేశుడుగారి సొంతప్రతి ఇది. ఈ ప్రతిలో అక్కడక్కడ నాలుగైదాకులు విరిగివున్నా మొత్తంమీద ఇది చక్కనిప్రతి. గ్రంథాంతంలో వ్రాయసకాని వక్కణ మున్న ఆకు కొంత శిథిలమైంది. అందు 'తిరుచాణూరు అలుగు శింగరప్పకు రామలింగానాయణిపల్లె కరణం లక్ష్మీనారాయణ' ఈ ప్రతిని వ్రాసినట్లువుంది. రామలింగానాయనిపల్లె అనంతపురంజిల్లా తాడిపత్రి తాలూకాలోని ఒకగ్రామం. ఈనాడు దాన్నే 'రామలింగాయపల్లె' అంటారు. లేఖనసంవత్సరం 'పర్విధారి' అని వుంది. పరీధావి 'పర్విధారి'గా వ్రాయబడింది అని భావిస్తే లేఖనకాలం క్రీ.శ. 1732 అవుతుంది. కాదు సర్వధారి అని భావిస్తే అది క్రీ. శ. 1768 అవుతుంది.

పై ఎనిమిది ప్రతుల్లో ఏదికూడా పెద తిరుమలయ్య స్వహస్తలిఖితంకాదు. అతని కాలానికి చెందినట్టిదీ కాదు. ఇవన్నీ పెద తిరుమలయ్య కాలంనాటి ప్రతులకు తర్వాతికాలంలో వెలువడిన ప్రత్యంతరాలే. పైగా ఈ ఎనిమిది ప్రతుల్నీ సరిపోల్చి చూస్తే ఏ ఒకటీ మరొకదానికి పుత్రికకాదని తెలుస్తుంది. ఇవి విభిన్నాలైనా వీటిలో కొన్ని ప్రతులమధ్య సాదృశ్యంగావున్న కొన్నిలక్షణాల్ని—తాత్పర్యాల ఉపక్రమోప సంహారాలూ, వ్రాయకవదలిన భాగాలూ, వ్రాయసగాండ్ర దోషాలూ మొదలైనవాటిని-పురస్కరించుకొని వర్గీకరించవచ్చు. ఆవిధంగా వర్గీకరిస్తే స్థూలంగా BP ప్రతులు ఒక వర్గంగాను, CF ప్రతులు మరొకవర్గంగాను, AD ప్రతులు ఇంకొక వర్గంగాను ఏర్పడతాయి. G ప్రతి పెక్కు అంశాలలో CF ప్రతులకు సన్నిహితంగాను, మరికొన్ని అంశాలలో AD ప్రతులకు దగ్గరగాను ఉన్నది. E ప్రతి (తంజావూరు) అన్నిప్రతులకన్నా విలక్షణమైంది. దీని వ్రాయసకాడు కొంత వ్యుత్పన్నుడు. భాషా పరంగా అర్వాచీన లక్షణాలు ఇందు కనిపిస్తాయి. ఇతర ప్రతుల్లోకన్న ఇందులో లేఖన దోషాలు తక్కువ. పదాదిలో 'య, వ' లను పరిహరించి అచ్చులువ్రాయడం ఈ ప్రతిలో ఎక్కువ. తాత్పర్యాల విషయంలో మిగిలిన ప్రతులకన్నా ఇందులో కొంత అధికప్రసంగం కనిపిస్తుంది. ఆయా వాక్య స్వరూపాల్లో మార్పులు, శ్రీరామానుజ భాష్యానికి, వేదాంతదేశికుల తాత్పర్యచంద్రికకు అనువైన కూర్పులు,

చేర్పులు ఈ ప్రతిలో చోటుచేసికొనివున్నాయి. ఉదాహరణకు కొన్ని చూడండి: అధ్యా 1-శ్లో 12; అధ్యా 2-శ్లో 9; అధ్యా-8-శ్లో 17; అధ్యా 10-శ్లో 6; అధ్యా 12-శ్లో 15; అధ్యా 13-శ్లో 7; అధ్యా 17-శ్లో 16.

కొన్నిపదాల ప్రయోగంలోకూడ అన్ని ప్రతులవి ఒకదారి అయితే E ప్రతిది మరొకదారిగా కన్పిస్తుంది. ఆదారి తత్సమదారి. ఉదా॥

| E ప్రతిలోనిరూపం | ఇతర ప్రతుల్లోనిరూపం |
|---|---|
| రక్షించుట (1-11) | కాచుక తిరుగుడ (1-11) |
| కార్యాలు (1-15) | శాతలు (1-15) |
| రోమాంచము (1-29) | నిలువెంట్రుకలు (1-29) |
| చర్మము (1-30) | తోలు (1-30) |
| బాణాలు (1-47) | అమ్ములు (1-47) |
| పర్వతశిఖరంవలె (6-8) | కొండవలె (6-8) |

పై సాక్ష్యాల్నిబట్టి తంజావూరిప్రతి అన్నిటికన్నా అర్వాచీనమని భావించవచ్చు.

ఈ పరిష్కరణకు స్వీకరించిన ప్రతులన్నిటిని తులనాత్మకంగా పరిశీలించి, పాఠభేదాలను గుర్తించి, ఆంతరంగిక సాక్ష్యాధారాలతో ప్రక్షిప్తాలను పరిహరించి సంశోధించి పెద తిరుమలయ్యలిఖిత మూలప్రతి స్వరూపాన్ని(Critical Recension) పునర్నిర్మించడానికిగాని, ఈ ఎనిమిది ప్రతుల వంశవృక్ష నిర్మాణానికిగాని (Stemma Codicum) ప్రయత్నం చేయలేదు. వ్యాఖ్యాన తత్వ నిరూపణకన్న భాషా స్వరూప పరిశీలనకే ఈ పరిష్కరణలో ప్రాధాన్యం. కాబట్టి ఈ ప్రతుల్లో P ప్రతిని ప్రధానప్రతిగా, ఒజ్జబంతిగా స్వీకరించడమయింది. అందుకు ముఖ్యమైన కారణాలు మూడు.

1. P ప్రతిలో శైథిల్యం తక్కువ, వ్రాత చక్కన. ఒక్క E ప్రతిని మినహాయించి P ప్రతిని మిగిలిన ప్రతుల్లోకిచేర్చి సరిపోల్చి చూస్తే పరస్పర భేదాలు కొన్ని గోచరించినా P ప్రతిలో కల్పితపాఠాలు, ప్రక్షిప్తాలు మృగ్యం.

2. తాత్పర్యాల విషయంలో ఇతర ప్రతుల్లో అక్కడక్కడా కనిపించే జారుపాట్లు కూడా ఇందులో లేవు.

3. అన్ని ప్రతుల్లోకన్న ప్రాచీనమై శిథిలంగా వున్న B ప్రతికి ఈ ప్రతి చాలా దగ్గర.

## 6. తాళపత్ర ప్రతుల్లోని లేఖనవిధానం

ప్రాచీన తాళపత్రగ్రంథాలను యథాతథంగా ఎవరూ ముద్రించరు. ముద్రణకు ముందు అవి పండితపరిష్కృతం కావాలి. తాళపత్రగ్రంథ పరిష్కరణ సామాన్యమైన పనికాదు. అందులో ఎన్నో సమస్యలున్నాయి. వాస్తవానికి గ్రంథపరిష్కరణ ఒక శాస్త్రీయమైన వ్యాసంగం.

ఒక కావ్యానికి మహాకవి ఒకడు కర్త కావచ్చు. కాని ఆ కావ్యానికి కాలాంతరంలో వివిధ ప్రతులు ఏర్పడి దేశంలో వ్యాప్తి కలిగినపుడు వ్రాయసగాండ్ర ప్రమత్తతవల్ల, అజ్ఞానంవల్ల, భాషాపరిణామకారణంవల్ల మూలంలోలేని భాషాదోషాలు, పాఠభేదాలు, లేఖనదోషాలు వివిధ రూపాల్లో ఆ యా ప్రతుల్లో సాక్షాత్కరిస్తాయి. అసలు ప్రాచీన తెలుగు శాసనాలను, తాళపత్ర గ్రంథాలను పరిశీలిస్తే తెలుగులేఖనంలో ఒక నిర్దిష్టమైన పద్ధతి, ప్రామాణికత ఏ యుగంలోనూ ఉన్నట్లు లేదు. ఒకవిధంగా లేఖనదోషాలు మనకు నన్నయకు పూర్వంనుండి సంక్రమించిన సంప్రదాయమని చెప్పవచ్చు. నన్నయకు పూర్వపు తెనుగుశాసనాల వ్రాతలో వున్న కొన్ని పదాల వర్ణక్రమాన్ని చూడండి.[13]

అయ్న, అఇన, ఏ్న, ఐయ్న (అయిన); ఆచంద్రదర్కము (ఆచంద్రార్కము) ఆచంద్రదరరార్కంబు (ఆచంద్రతారార్కంబు); కులచు (కొలుచు); కులొపిఞ్చన (కొలిపించిన); కాన్కి (కానుక); తణ్కి (తాంకి); మహారాజులాకు (మహారాజులకు); రచ్చమానంబున (రాచమానంబున); వాక్రాంబు (వక్రంబు); వ్రపి (వ్రాపి); శఖవరుషంబులు (శకవర్షంబులు) మొదలైనవి.

నన్నయ తరువాతి తెలుగు శాసనాల్లోనూ, మనకు లభించే తెలుగుతాళపత్ర గ్రంథాల్లోనూ రకరకాల లేఖన దోషాలకు కొదవలేదు. ఛందోబద్ధంగావున్న కావ్యప్రబంధాల ప్రతుల్లోకూడ లేఖనదోషాలు అనేకం.

పెద తిరుమలయ్య భగవద్గీతావ్యాఖ్య వచన రచన. పైగా వ్యావహారికం. కాబట్టి ఛందోబద్ధమైన కావ్యప్రబంధాల తాళపత్రప్రతులకన్నా ఈ వ్యాఖ్యాప్రతుల్లో లేఖనదోషాలు, పాఠభేదాలు, ప్రమాదాలు, లోపాలు అధికంగా వుండడానికి ఆస్కారం

---

13. Radhakrishna B. Early Telugu Inscriptions, A. P. Sahitya Akademi Publication. 1971

వుంది. ఉన్నాయి కూడ. ఈ పరిష్కరణకు స్వీకరించిన ఎనిమిది ప్రతుల్ని పరిశీలించి చూస్తే వాటి అన్నిటిలోని లేఖన విశేషాల్ని నాలుగు విధాలుగా వర్గీకరించవచ్చు. అవి:

(1) లేఖన దోషాలు (Lapsus Calami)

(2) లేఖన సంప్రదాయ ద్యోతక రూపాలు (Scriptal tradition)

(3) ఉచ్చారణ విధేయ లేఖన విశేషాలు (Phonetic transcription)

(4) క్రమభంగం (Disorder)

పై నాలుగు రకాల లేఖన విశేషాలను పాఠకుల సులభావగాహనకు సోదాహరణంగా కొంత విస్తరించి చెప్పడం అప్రస్తుతం కాదు.

1. లేఖన దోషాలు: (Lapsus Calami = Slip of the pen)

ఇవి కేవలం వ్రాయసకాని తొందరపాటుకు, ఏమరుపాటుకు, 'భ్రాంతిమదప్రామాణికత'కు, వైయక్తిక విద్దూరాలకు సంబంధించిన దోషాలు. తాను వ్రాసుకొన్న ప్రతిని వ్రాయసకాడు పునఃపరిశీలన చేసివుంటే లేదా పండితులకు చూపించి వుంటే దిద్దుకొనివుండే దోషాలివి. ఈ దోషాల్ని తెలుగుపండితుడు విద్యార్థుల వ్యాసరచనలను దిద్దినట్లు దిద్దడం పరిష్కర్తకు తప్పనిసరి. మన పరిష్కరణకు తీసుకొన్న ప్రతుల్లో ఇట్టిదోషాలు కొల్లలు. ఉదాహరణకు కొన్ని:

| ప్రతి | అధ్యాయశ్లోక తాత్పర్యాల సంఖ్య | ఉన్నరూపం | ఉండవలసిన రూపం |
|---|---|---|---|
| P | 11-21 | అబలుల | అంజలుల |
| P | 9-11 | అనుమానం | అవమానం |
| E | 2-20 | అజ్ఞుడై | అజుడై |
| A | 5-15 | అమృతమైతేను | అవృతమైతేను |
| D | 5-15 | అనృతమైతేను | అవృతమైతేను |
| D | 2-13 | ఆయుద్ధమందు | ఆయర్థమందు |
| C | 2-19 | ఆయిద్సరొంన్ను | ఆయిద్దరున్ను |
| D | 2-24 | అశలుడై | అచలుడై |
| A | 1-40 | ఆధర్మము | అధర్మము |
| E | 2-30 | అద్యుడై | అవధ్యుడై |
| D | 4- 1 | అర్యమైన | అవ్యయమైన |

| | | | |
|---|---|---|---|
| D | 4-20 | ఆశ్వాసమే | అభ్యాసమే |
| E | 6-10 | ఆకాశరహితుడై | ఆశారహితుడై |
| C | 6-12 | ఆమోపభోగాల | ఆకామోపభోగాల |
| A | 2- 7 | ఆది | అది |
| B | 4-21 | ఆశతహితుడై | ఆశారహితుడై |
| D, E. G | 1-46 | ఆయుద్ధంవిడిచి | ఆయుధంవిడిచి |
| B | 5-19 | ఇసృష్టి | ఈసృష్టి |
| P | 10-19 | ఎశ్వర్య | ఐశ్వర్య |
| C | 8-11 | కర్మాన | క్రమాన |
| F | 9- 7 | కల్పవృక్షయమైన | కల్పక్షయమైన |
| A | 7-26 | కులాల | కాలాల |
| F | 6-35 | కోలమండలి | లోకమండలి |
| D | 2- 9 | గుడాకేశవుడైన | గుడాకేశుడైన |
| C | 13-31 | ఘంటినది | బుట్టినది |
| P | 2-20 | చప్పంబడు | చంపబడు |
| A | 2-25 | చచ్చినట్టు | వచ్చినట్టు |
| C | 10-36 | జూండవ | జూదము |
| E | 13-13 | దశ్యాంశాలైన | విశాలాలైన |
| F | 6-25 | దైత్యంచేత | ధైర్యంచేత |
| E | 10-38 | నిది | నీతి |
| E | 2-67 | నీడమీద | నీళ్లమీద |
| C | 4-10 | పద్రితులై | పవిత్రులై |
| C | 17- 6 | పతస్సు | తపస్సు |
| A | 1-12 | ప్రతాపవానులైన | ప్రతాపవానులైన |
| A, C | 2-58 | ప్రతిజ్ఞ | ప్రజ్ఞ |
| A | 16-10 | పనియని | తనియని |
| E | 16-22 | పొందుదును | పొందును |
| G | 2-51 | భలమును | ఫలమును |
| B | 7-12 | భాగాలు | భావాలు |
| C | 7-20 | భుజింతురు | భజింతురు |

| | | | |
|---|---|---|---|
| P, B | 16-14 | బిడ్డలు | బీదలు |
| A | 2-29 | మరివోఁడడు | మరివాఁకడు |
| P | 17-10 | యజ్ఞార్హ్వతము | యజ్ఞార్హము |
| F | 6-42 | యోనికులమందు | యోగికులమందు |
| C | 7-29 | రత్నం | యత్నం |
| A | 16-10 | విచిడి | విడిచి |
| C | 18-38 | విషయమువలె | విషమువలె |
| G | 2-52 | వాసమును | పాపమును |
| A | 2-60 | విశ్వాంసుండైన | విద్వాంసుండైన |
| G | 2-72 | విజ్ఞానం | అజ్ఞానం |
| A | 2-29 | వున్న | పుణ్య |
| C | 17- 9 | శ్లోకమును | శోకమున్ను |
| G | 1-25 | శయనికుల | సైనికుల |
| C, F | 17-5 | హంకారముతో | అహంకారముతో |
| G | 7-22 | హీనమైన | హితమైన |
| A | 2-49 | హాఁకృపణులు | మహాఁకృపణులు |

లేఖనదోషాలుగా పై పట్టికలో ఇచ్చిన రూపాల్ని చూస్తే సాధారణంగా అచ్చైన తెలుగు పుస్తకాల చివర ఇచ్చే తప్పొప్పుల పట్టికలాగా ఉంది కదూ!

(2) లేఖన సంప్రదాయ ద్యోతక రూపాలు (Scriptal tradition)

పదలేఖనంలో (Spelling) ఈనాడు మనం వ్రాసే పద్ధతికి లేదా ముద్రించే పద్ధతికి కొంత భిన్నంగా ఉన్న కొన్ని లక్షణాలు తాళపత్ర లేఖనంలో కన్పిస్తాయి. అట్టి ప్రాచీన లేఖన లక్షణాల్ని ఆధునిక లేఖనానికి అనుగుణంగా గ్రంథ పరిష్కరణలో మార్చడం అవసరం. కొన్ని ఉదాహరణాలు:

| లేఖన సంప్రదాయంలోని లక్షణాలు | తాళపత్రలిఖిత రూపం | ఆధునిక రూపం |
|---|---|---|
| (a) వలపల గిలక | అజ౯నుడా | అర్జునుడా |
| | కీతి౯ | కీర్తి |
| | యేప౯రుపబడి | యేర్పరుపబడి |

| | | |
|---|---|---|
| (b) పూర్ణబిందుపూర్వక ద్విత్వ హల్లు | క్షత్రియుండ్డవు | క్షత్రియుండవు |
| | నిత్యుండ్డను | నిత్యుండను |
| | కొండ్దరు | కొందరు |
| | వుండ్డుదురు | వుండుదురు |
| (c) పూర్ణబిందుపూర్వక అనునాసిక ద్విత్వం లేదా అనునాసిక సంయుక్తం | అంన్నమాచార్యులు | అన్నమాచార్యులు |
| | వాంన్ని | వాన్ని |
| | కృష్ణంమ్మ | కృష్ణమ్మ |
| | సంమ్మంధాన | సమ్మంధాన |
| | పుంణ్యం | పుణ్యం |
| | జంన్మము | జన్మము |
| | అంన్యమైన | అన్యమైన |
| | కాంమ్యకర్మాలు | కామ్యకర్మాలు |
| (d) పూర్ణబిందుపూర్వక అద్విరుక్త హల్లు | వాండు | వాఁడు/వాడు |
| | అర్జునుండు | అర్జునుఁడు/అర్జునుడు |
| | దాంటీని | దాఁటీని/దాటీని |
| | ప్రాంత | ప్రాఁత/ప్రాత |
| | యెరింగి | యెరిఁగి/యెరిగి |
| (e) పదమధ్య అజ్లోపాన్ని పాటించిన సంయుక్తాక్షర రచన | అడ్గితేను | అడిగితేను |
| | నడ్మ | నడుమ |
| | వాన్కి | వానికి |
| | వల్న | వలన |
| | గన్క | గనుక |
| | సాత్వికుల్కు | సాత్వికులకు |
| | వివేకులయ్న | వివేకులయిన |
| | భోజ్నం | భోజనం |
| | య్వండు | యవఁడు/యవడు |
| | ద్య | దయ |
| (f) ఏత్వానికిఎత్వం(సంస్కృత లేఖన ప్రభావం కావచ్చు) | నెను | నేను |
| | అనెటిది | అనేటిది |
| | చెశెది | చేశేది |
| | అంటెను | అంటేను |

| | | |
|---|---|---|
| (g) పద మధ్యంలో వ్యస్తంగా అచ్చు | అఉను | అవును |
| | అఇశ్వర్యమున్ను | అయిశ్వర్యమున్ను |
| | శ్రీఇన్ని | శ్రీయిన్ని |

(3) ఉచ్చారణ విధేయ లేఖన విశేషాలు : (Phonetic transcription)

తాళపత్ర గంథాల్లోని కొన్ని ధ్వనుల, పదాల వ్రాతలో ఆనాటి ఉచ్చారణకు విధేయమైన లేఖన పద్ధతి కనిపిస్తుంది. నేటి పండితులకు, ప్రామాణిక గ్రాంథిక భాషాదృష్టిగల వారికి అవి విడ్డూరాలైన లేఖక దోషాలుగా తోచవచ్చు. కాని అవి ఆనాటి వ్యవహారంలో ధ్వనుల ఉచ్చారణ విధాన్ని వ్యక్తం చేస్తాయి. నిజానికి అట్టి వ్రాత భాషా ధ్వని పరిణామ చరిత్రకు, తదవగాహనకు అమూల్యమైన ఆధారం. అట్టి వ్రాతలోని వర్ణ సంకేతాలను లేఖక ప్రమాదంగా భావించి బాలవ్యాకరణానుగుణమైన రచనా రూపంలోకి మార్చడం పరిష్కరణ దోషం అవుతుంది. వాటిని పరిష్కరించాలన్నా, ఉన్నవి ఉన్నట్లు నిలపాలన్నా పరిష్కర్తకు భాషా చారిత్రక దృష్టి, లేఖన సంప్రదాయజ్ఞత, భాషావిజ్ఞాన పరిచయం, వీనికితోడుగా కొంత మెలకువ ఉండాలి. 'సింహము' అనే పదాన్ని వ్రాయసగాళ్లు తమ ఉచ్చారణను అనుసరించి వ్రాయడానికి కాబోలు చేసిన ప్రయత్నంలో సిద్ధించిన పదలేఖన వైవిధ్యం చూడండి: శింహ్వము (A ప్రతి); శింహ్మము (B ప్రతి); సింహ్వము (C, E ప్రతులు); సింహ్వం (F,P ప్రతులు), ఈ పరిష్కరణకు గ్రహించిన ఎనిమిది ప్రతుల్లో ఉచ్చారణ విధేయంగా కన్పించే కొన్ని లేఖన విశేషాల్ని క్రింది విధంగా వర్గీకరించవచ్చు.

| | |
|---|---|
| (a) పదాది యకార, వకారాలు : | యెవడు, యేది, యిందుకు, యిటువంటి, యీశ్వరుడు, వొక్కండనే, వొకటి, వోయి అర్జునుడా!, వో అర్జునుడా!, వుపాసన, వూర్జితము. |
| (b) ఐ, ఔ లకు క్రమంగా 'అయి, అవు'లు: (తత్సమ పదాల్లో కూడ) | అయిరావతము, అయిశ్వర్యము. అవుషధము. |
| (c) తాలవ్యహల్లుకు పరంలో అత్వానికి ఏత్వం: | శెక్తి,చెంద్రుడు,యెముడు, నాయెందు. శెరీరము. జెనులు, జెంతువులు. |
| (d) ఋత్వానికి 'రు' : | మహారుషులు, రుతువు. |

| | |
|---|---|
| (e) హల్లుకు పరంగా ఉన్న ఋత్వానికి 'రి' లేదా 'రు' : | క్రిష్ణవాక్యం, ద్రిష్టి, శ్రిష్టి, బ్రుహత్సామ. |
| (f) హల్పరమైన ఏత్వానికి (పరాక్షరంలో అత్వమున్నపుడు) దీర్ఘాకారం, య వత్తు : | ప్యాద (పేద) ల్యాక (లేక) |
| (g) 'చ'వర్ణానికి శ/స లు : | చేయు, శేయు, సేయు, చేశేయి, శేశేయి, సేశేయి, చేత, శేత, సేత |
| (h) శ వర్ణానికి స : | వైస్యులు; సూద్రులు, సోషింపజేయు |
| (i) స వర్ణానికి శ : | శింహ్మము; రహశ్యాలు, వలశిన; చేశే పనులు, శేవించు |
| (j) ట వర్ణానికి ష (కొన్ని పదాల్లో:) | అషువంటి; యిషువంటి అషుగనక; యిషనగా |
| (k) జ్ఞ కు గ్న (కొన్ని పదాల్లో) | యగ్నము; గ్నానము |

(4) క్రమభంగం (Disorder)

ఈ వ్యాఖ్యలో ఉండవలసిన క్రమం మొదట శ్లోకం, తర్వాత తెలుగు తాత్పర్యం. కాని కొన్ని ప్రతుల్లో అక్కడక్కడ శ్లోక తాత్పర్యాలకు సంబంధించిన క్రమభంగం కనిపిస్తుంది. దీనికి కారణం ప్రధానంగా వ్రాయసకాని అజాగ్రత్త, లేదా తొందరపాటు. ఒకవేళ పునఃపరిశీలనలో వ్రాయసకాడు ఈ లోపాన్ని గుర్తించి వుండినా తాళపత్ర రచనలో సవరించడం సాధ్యంకాదు. గ్రంథపరిష్కరణలో ఇట్టి లోపాలను, క్రమభంగాలను కూడ జాగ్రత్తగా చూసుకోవాలి. భగవద్గీతా వ్యాఖ్యా ప్రతుల్లో కనిపించే శ్లోక తాత్పర్యాల క్రమభంగం నాలుగైదు రకాలుగా కనిపిస్తుంది.

(a) మూలశ్లోకాన్ని వ్రాయక వదలివేయడం, కొన్ని ప్రతుల్లో అక్కడక్కడ ఒకటి రెండు శ్లోకాలు వరుస క్రమంలో తొలగి ఉన్నాయి. అయినా వాటి తెలుగు తాత్పర్యాలు మాత్రం వ్రాయబడి ఉన్నాయి. ఉదాహరణకి G ప్రతిలో 2 అధ్యా. 16 శ్లో; B ప్రతిలో 2 అధ్యా. 39 శ్లో; E ప్రతిలో 10 అధ్యా. 22 శ్లో. లేవు.

(b) తెలుగు తాత్పర్యాన్ని వ్రాయక వదలివేయడం. కొన్ని ప్రతుల్లో అక్కడక్కడ శ్లోకం ఉన్నా తాత్పర్యం ఉండదు. ఉదా:—B ప్రతిలో 2 అధ్యా. 38 వ తాత్పర్యం; C ప్రతిలో 9 అధ్యా. 13 వ తాత్పర్యం; F ప్రతిలో 2 అధ్యా. 26 వ తాత్పర్యం లేవు.

(c) శ్లోక తాత్పర్యాలు రెండింటిని వదలివేయడం. A ప్రతిలో 9 అధ్యా 23; G ప్రతిలో 3 అధ్యా. 39; 4 అధ్యా. 32; E ప్రతిలో 8 అధ్యా. 6.

(d) ఒక శ్లోకం క్రిందనే తర్వాతి శ్లోక తాత్పర్యాన్ని కూడా పూర్తిగానో లేదా అరగొరగానో కల్పి వ్రాయడం, ఉదా : G ప్రతిలో 2 అధ్యా. 16 శ్లోకం క్రింద 16, 17 శ్లోకాల తాత్పర్యాలు కలిపివున్నాయి. E ప్రతిలో 2 అధ్యా. 15 శ్లోకం క్రింద 15. 16, 17 శ్లోకాల తాత్పర్యాలు కలిపి వ్రాయబడినాయి. P ప్రతిలో 11 అధ్యా. 12 వ శ్లోకం క్రింద 12, 13 శ్లోకాల తాత్పర్యాలు కలిపివున్నాయి.

పై క్రమభంగాలే గాక ఒకటి రెండుచోట్ల శ్లోక తాత్పర్యాల పునరుక్తికూడా కన్పిస్తుంది. ఉదా : E ప్రతిలో 10 అధ్యా. 23 వ శ్లోక తాత్పర్యం. B ప్రతిలో 18 అధ్యా. 68 వ శ్లోక తాత్పర్యం రెండుమార్లు పునరుక్తం.

ఇంతవరకు తిరుమలయ్య భగవద్గీతా వ్యాఖ్య తాళపత్ర ప్రతుల్లోని లేఖన విశేషాలను, పరిష్కరణకు సంబంధించిన కొన్ని సమస్యలను దిఙ్మాత్రంగా సూచించడమైంది. ఇక ముద్రితమై మీ చేతిలో ఉన్న భగవద్గీతా వ్యాఖ్యను పరిష్కరించిన విధానాన్ని కొంత ప్రస్తావించుకొందాం.

## 7. ప్రతుల పరిశీలన - పరిష్కరణ పద్ధతులు

పెద తిరుమలయ్య భగవద్గీతా వ్యాఖ్యను ప్రకటించాలని నిర్ణయం తీసుకొన్న తర్వాత దేశంలోని తద్వ్యాఖ్యాన ప్రతుల ఆకరాలను, వివరాలను తెలుసుకోడానికి ప్రయత్నం చేయడమైంది. చివరకు ఈ పరిష్కరణకు ఎన్నిక చేసుకొన్నవి, మా కందుబాటులోనికి వచ్చినవి ముందు చెప్పిన ఎనిమిది ప్రతులు మాత్రమే. ఈ ఎనిమిది ప్రతులలోని శ్లోకాలను, తాత్పర్యాలను మొదట నిడుపాటి కాగితాల మీద పాఠ భేదాలతో గుర్తించి వ్రాయించడమైంది.

పై విధంగా వ్రాయించిన తర్వాత P ప్రతిని ప్రధాన ప్రతిగా—ఇంతకు ముందు చెప్పిన కారణాలవల్ల—స్వీకరించడమైంది. ఆ తర్వాత ఒక్కొక్క కాగితం మీద ఒక్కొక్క శ్లోకాన్ని, దాని క్రింద P ప్రతిలోని తెలుగు తాత్పర్యాన్ని వ్రాయించడమైంది. ఆ తాత్పర్యానికి తక్కిన ఏడు ప్రతుల్లోని పాఠాంతరాలను సంఖ్యా క్రమంలో క్రింద గుర్తించడం జరిగింది.

పై విధంగా P ప్రతి తాత్పర్యాన్ని, ఇతర ప్రతులలోని పాఠాంతరాలను వ్రాయించిన తర్వాత పరిష్కరణ కార్యక్రమం ప్రారంభమయింది. వివిధ ప్రతుల్లోని

లేఖనవిధానాన్ని. వాటిలో స్థూలదృష్టికే కన్పించే వైవిధ్యాన్ని. పెద తిరుమలయ్య భాషలో కన్పించే విలక్షణాలను అవగాహన చేసుకొని చర్చాపూర్వకంగా కొన్ని సూత్రాలు రూపొందించబడినాయి. ఆ సూత్రాలు, వాటిని పాటించిన తీరు.

(1) శ్లోకాలకు సంబంధించి:

ఈ ప్రతుల్లో శ్లోకపరమైన పాఠభేదాలు చెప్పదగినవి లేవు. కాబట్టి శ్లోకాలకు పాఠాంతరాలను చూపలేదు. ప్రతుల్లో శ్లోక లేఖనంలో పాదాంతంలో పూర్ణానుస్వారం లిఖితమై ఉన్నచోట్ల సంస్కృత సంప్రదాయా న్ననుసరించి మకారపొల్లు (మ్) పాటింపబడింది. ప్రతుల వ్రాతలో అవగ్రహ (ఽ) చిహ్నంలేదు. కాని యిందులో చూపబడింది. సంస్కృతంలో హ్రస్వ ఎకార, ఒకారములు లేవు కదా! అయినా శ్లోక లేఖనంలో ఇంచుమించు అన్ని ప్రతుల్లోను హ్రస్వ ఎకార. ఒకార సంకేతములే వున్నాయి. వాటిని దీర్ఘాలుగా సరిదిద్దుకున్నాం. ఉదా: ధర్మక్షెత్రె = ధర్మక్షేత్రే; పురుషొత్తమ = పురుషోత్తమ;

(2) తాత్పర్యభాగానికి సంబంధించి :

తెలుగు తాత్పర్య భాగానికి సంబంధించిన పరిష్కరణను నాలుగు విభాగాల క్రింద (a) లిపికి (d) లేఖన దోషాలకు (c) పదలేఖన రీతులకు (b) పాఠాంతరాలకు సంబంధించినవిగా వింగడించి చూపవచ్చు.

(a) లిపికి సంబంధించినవి : ఇవి నేటి లేఖన విధానానికి అనుగుణంగా చేసిన మార్పులు.

(1) వలపలగిలకను పరిహరించడం.

(2) పూర్ణబిందుపూర్వక ద్విత్వహల్లును అద్విత్వంగా చూపడం.

ఉదా: సంజ్జయుండ్డ = సంజయుండ.

(3) పూర్ణబిందుపూర్వక అద్విత్వహల్లువున్న రూపాల్లో అర్థభంగము కానిపట్ల పూర్ణబిందువును తొలగించడం అంటే ఆ చోట్ల అర్ధానుస్వారానికి గతి కల్పించలేదు.

ఉదా: వాండు-వాడు; ధనంజయుండ-ధనంజయుడ.

(4) పూర్ణబిందుపూర్వక అనునాసిక ద్విత్వం లేదా అనునాసిక సంయుక్తం ఉన్న రూపాల్లో పూర్ణబిందువును తొలగించడం.

ఉదా: వాంన్ని-వాన్ని; కృష్ణంమ్మ-కృష్ణమ్మ; అంన్నమయ్య-అన్నమయ్య;

(5) పద మధ్య అజ్లోపం ఏర్పడిన సంయుక్తాక్షరాల్లో తెలుగు ఉచ్చారణ అసహజంగా తోచినచోట్ల అజ్లోప రహితంగా చూపడం.

ఉదా: అడ్గితేను-అడిగితేను; భోజ్నం-భోజనం; దయ్-దయ. కాని-వల్న, వల్దు, గన్క- ఇత్యాది రూపాల్ని కొన్నిటిని రూపాంతరాలను చూపడానికి కొన్నిచోట్ల నిల్పడమైంది.

(6) ద్వితీయావిభక్తి ప్రత్యయాంతాలుగా 'ంని', 'ంను' ఉన్న రూపాల్లోను, సముచ్చయార్థంలో 'ంనూ', 'ంనై' ఉన్న రూపాల్లోను బిందువును తొలగించి పరంలోని న వర్ణాన్ని ద్విత్వంగా చూపడం.

ఉదా: సంజయుంని-సంజయున్ని; కౌరవులుంనూ పాండవులుంనూ-కౌరవులున్నూ పాండవులున్నూ; శూరులుంనై-శూరులున్నై.

(7) తెలుగు పదాల లేఖనంలో ఏత్వానికి బదులు ఎత్వమున్న చోట్ల—ఇది సంస్కృత లేఖన ప్రభావంవల్ల కావచ్చు—దీర్ఘాన్నే వ్రాయడం.

ఉదా: నెను-నేను; చెప్పెటిది-చెప్పేటిది.

(8) పదమధ్యంలో వ్యస్తంగా వ్రాసివున్న ఇ, ఉ లను క్రమంగా య, వ లతో చేర్చి చూపడం.

ఉదా: అఇదు-అయిదు; శ్రీఇన్ని-శ్రీయిన్ని; నీఉన్ను-నీవున్ను.

(9) లేఖనంలో 'భ్రాంతిమదప్రామాణికత' కారణంగా రేఫకు వట్రువ సుడిని వాడినచోట్ల రేఫగా సంస్కరించడం.

ఉదా: దేవేంద్రృడు-దేవేంద్రుడు; శతృవులు-శత్రువులు; సముద్రృడు - సముద్రుడు.

(10) తాత్పర్యాంతంలో వాక్యం చివర ఉకార ముండవలసిన చోట్ల దీర్ఘ ఉకారం కొన్ని ప్రతుల్లో కన్పిస్తుంది. వాటిని హ్రస్వీకరించడం.

ఉదా: '....................అభ్యాసం చేశినవాడు నిర్వాణమైన బ్రహ్మను పొందునూ. (పొందును.)

(11) ఈ ప్రతుల్లో సముచ్చయార్థక ప్రత్యయానికి ఉన్న రూపాంతరాలు ను/నూ/న్ను/న్నూ. వీటికి వ్రాతలో బిందుపూర్వక రూపాలు గూడా ఉన్నాయి. అయితే P ప్రతిలోని వ్రాతలో మాత్రం 'న్నూ' చేర్చి వ్రాసిన రూపాల్లో పూర్ణ

బిందువే గాకుండ, తత్పూర్వాక్షరం గూడ కొన్నిచోట్ల దీర్ఘంగా వ్రాయబడి వుంది. అట్టిచోట్ల పూర్వదీర్ఘాన్ని హ్రస్వంగా చూపడమైంది.

ఉదా: కడుపులూంన్నూ, వక్త్రాలూంన్నూ, కన్నులూంన్నూ, మధ్య మూంన్నూ = కడుపులున్నూ, వక్త్రాలున్నూ, కన్నులున్నూ, మధ్యమున్నూ.

(P ప్రతి అధ్యా. 11-శ్లో 16)

(b) తాత్పర్యాలలోని లేఖనదోషాలు (Lapsus calami)—పరిష్కరణ:

కేవలం వ్రాయసగాని అజాగ్రత్తవల్ల, వేగిరపాటువల్ల లేఖనంలో దొర్లిన లేఖనప్రమాదా లివి, ఇవి భగవద్గీతా వ్యాఖ్యాప్రతుల్లో కొల్లలుగావున్నాయి. అనేక రకాలుగావున్న యివి అవశ్యపరిష్కరణీయాలు. అట్టి లేఖనప్రమాదాలు, వాటికి కొన్ని ఉదాహరణాలు:

(1) లిపి చిహ్నాన్ని వదలివేయడం: మస్త్రివి (మరిస్త్రివి); పురునికి (పురుషునికి); తత్పండై (తత్పరుండై).

(2) లిపి సంకేతాల పునర్లేఖనం: వాడవౌవుదువు (వాడవౌదువు); వరుర్షం (వర్షం); యవవరు (యవరు); అర్హుదౌవును (అర్హుదవును).

(3) లిపి చిహ్నాల స్థాన వినిమయం. అచ్చుల్లో: శరీరవాసన పర్యంతమున్ను (శరీరావసాన పర్యంతమున్ను); చేతనునీకె (చేతనునికే); హల్లుల్లో: పతస్సు (తపస్సు); కర్మాన (క్రమాన)

(4) అచ్చులహ్రస్వదీర్ఘాల్లో తార్మారు: పిండించినారు (పీడించినారు); చిశిరా (చేశిరా); మోదలు (మొదలు); హారి సమ్మంధమైన (హరి సమ్మంధమైన); కోనును (కొనును).

(5) ఒక అక్షరానికి మరొక అక్షరం: ఇవి సాధారణంగా సంకేతాల సాదృశ్యరూపాన్నిబట్టి లేదా ఉచ్చారణనుబట్టి ఏర్పడినవి. ఇవి రకరకాలు. కొన్ని ఉదాహరణలు: రత్నం (యత్నం); భాగాలు (భావాలు); పారకప్పడ (వారాసపడ్డ); వెళ అయినప్పుడున్ను (వెళ్ళైనప్పుడున్ను); గోడంట్టి (గొడ్డంటి).

(c) పదలేఖనరీతులు (Spelling):

తాళపత్ర లేఖనంలో కన్పించే మరికొన్ని లక్షణాలను కేవలం లేఖనదోషాలని చెప్పలేము. అవి నేటి ప్రామాణిక లేఖనదృష్ట్యా దోషాలుగా కన్పించినా వాస్తవానికి

అవి ఆనాటి ఉచ్చారణరీతులకు, ధ్వని లక్షణాలకు ప్రతిబింబాలనవచ్చు. అంటే లేఖకుడు బుద్ధిపూర్వకంగానే ప్రదర్శించిన పదలేఖన విశేషాలివి. వీటికి ఏ ప్రతిలో కూడ ఒక నియతి ఉన్నట్లు కనిపించదు. కాబట్టి పదలేఖనంలో అనేక పదాలకు రూపాంతరాలు ఈ ప్రతుల్లో ఉన్నాయి. ఏకరూపతకొరకుగాని, వ్యాకరణదృష్ట్యాగాని వీటిని మార్చకుండా పదలేఖనంలోని వైవిధ్యాల్ని చాలవరకు ఉన్నది ఉన్నట్లుగానే ఉంచడమైంది. అట్టివి కొన్ని:

(1) పదాది యకార వకారాలు: పదాదిలో యకార వకార రచనను వ్యాకరణాలు నిషేధిస్తాయి. య, వ లను పదాదిలో వ్రాయడం దోషమని అప్పకవి చాటినాడు.

క॥ పద్యాది ప్రాణంబుల
నాద్యంతాస్థములుగ, నజ్ఞులు కృతులన్
జైద్యహరః వ్రాయుదురు తము
విద్యాధికులెల్లఁ జూచి వికవిక నవ్వన్

(అప్పకవీయం. 2. ఆశ్వా. 43. పద్య.)

తెలుగువారి ఉచ్చారణలో పదాదిలో 'అ, ఆ' లనే రెండు అచ్చులు తప్ప ఇతరాచ్చులు వినబడవు. పదాదిలో పూర్వాచ్చులైన ఇ, ఈ, ఎ, ఏ లకు ముందు 'య' వర్ణాన్ని పశ్చిమాచ్చులైన ఉ, ఊ, ఒ, ఓ లకు ముందు 'వ' వర్ణాన్ని చేర్చి ఉచ్చరించడం సహజం. ఇది అనాదిగా కనిపిస్తున్న తెలుగుభాషా వ్యవహార లక్షణం కూడ.[14] ఉచ్చారణ విధేయంగా వ్రాయదలచుకున్నప్పుడు పదాదిలో 'య' లేదా 'వ'ను చేర్చే వ్రాయాలి. కాబట్టి ఈ భగవద్గీతావ్యాఖ్య తాళపత్రప్రతుల్లో 'య,వ' లున్న రూపాలు ఎక్కువగా ఉన్నాయి. పరిష్కరణలో వాటిని మార్చలేదు. లేనిచోట్ల వాటిని చొప్పించలేదు.

(2) తాలవ్య హల్లులకు పరంలోవచ్చే అత్వానికి, తాలవ్యేతర హల్లుకు పరంలో వున్న అత్వానికి తెలుగు వుచ్చారణలో కొంతభేదం వుంది. రెండవది వివృతాచ్చైతే మొదటిది అర్ధసంవృతాచ్చుకు సన్నిహితమైంది. వినికిడికి స్పష్టమైన ఈ ధ్వనిభేదాన్ని వ్యాఖ్యాత తిరుమలయ్య గుర్తించినట్లున్నారు, అందువల్లనే పద లేఖనంలో తాలవ్య హల్లులకు పరంలో అత్వ, ఎత్వాలున్న రూపద్వయం ఈ

---

14. పదాది 'య, వ' ల సంబంధమైన చారిత్రక పరిశీలనకు చూడండి: వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారి 'ధ్వని–లిపి–పరిణామం' (1955) 1-53.

ప్రతుల్లో కన్పిస్తుంది. ఉదా: శెక్తి—శక్తి; చెంద్రుడు—చంద్రుడు; యెందు—యందు; జెనులు—జనులు. ఈ ఉచ్చారణభేదాన్ని ప్రదర్శించడానికి పరిష్కరణలో ఎత్వసహిత లేఖనాన్ని నిలుపడమైంది. 'ఎ' కు బదులు అత్వమున్న విలోమలేఖనం కూడ ప్రతుల్లో కన్పిస్తుంది. ఉదా: జప్పక (జెప్పక); చెప్పుకొనియదరు (చెప్పు కొనియెదరు); వచ్చను (వచ్చెను); యందు (యెందు). ఇట్టిలేఖనాన్ని నాలుగైదు చోట్ల నిలిపి మిగిలినచోట్ల మార్చడమైంది. ఇవిగాక చ వర్ణానికి తాలవ్య శవర్ణో చ్చారణ తెలియజేసే రూపాలు కూడా ఉన్నాయి. వాటిని చాలావరకు అలాగే వుంచడమైంది. ఉదా: చేయు—శేయు; చాత—శాత; చాయవలె—శాయవలె; చేశేయి—శేశేయి.

(3) తెలుగు వర్ణమాలలోని ఋత్వానికి స్వరోచ్చారణ ఏనాడూ లేదు. అనాదిగా దానికి రేఫోచ్చారణే. పెద తిరుమలయ్య కాలంలోకూడ ఋత్వానికి పదాదిలో 'రు' పదమధ్యంలో 'రి, రు' ల ఉచ్చారణ ఉన్నదనడానికి శాసనాల సాక్ష్యం కూడ వుంది. ప్రతుల వ్రాతలో ఋ/రుల సంకేతాలు రెండూ ప్రయుక్తమైవున్నా 'ఋ' సంకేతం అరుదు. పరిష్కరణలో వీటిని మార్చలేదు.

(4) హల్పరకమైన ఏత్వానికి దీర్ఘ అకారం, య్ వత్తు ఉన్న లేఖనం కొన్ని పదాల్లో కన్పిస్తుంది. అట్టి పదాల్లో రెండవ అక్షరంలో అత్వం తప్పక వుంటుంది. ఈనాటి వ్యవహారంలోకూడ పేట, పేడ, మేక ఇత్యాది రూపాల్లోని తొలి ఏత్వము అర్ధసంవృత తాలవ్యాచ్చుగానే వినిపిస్తుంది. ఈ ఉచ్చారణవిశేషం 16 వ శతాబ్దంలో కూడా వున్నదనడానికి ప్రతుల్లోని ప్యాద (పేద), ల్యాక (లేక) ఇత్యాది పదలేఖనం ఒక దృష్టాంతం.

(5) తత్సమ రూపాల్లో చ, శ, స లకు సంబంధించిన అనియత లేఖనం కనిపిస్తుంది. ఒక దృష్టికి వీటిని తద్భవాలని సమర్థించవచ్చు. అట్లే మహాప్రాణ ధ్వనికి అల్పప్రాణ సంకేతాలున్న కొన్ని రూపాల్నికూడ తద్భవాలన్నా తప్పుకాదు. కారణం తెలుగువారి ఉచ్చారణలో మహాప్రాణోచ్చారణ చాలవరకు ప్రయత్న పూర్వకం. ఈ పరిష్కరణలో చ, శ, సల వినిమయం ఉన్న రూపాల్లోను, మహా ప్రాణధ్వని లేని రూపాల్లోను కొన్నిటిని ఆలాగే చూపించాము.

(6) పదమధ్య ట వర్ణానికి ష వర్ణలేఖనం. P ప్రతిలో అరుదుగాను, మిగిలిన ప్రతుల్లో అక్కడక్కడా కన్పిస్తుంది. ఇది వైదికుల ఉచ్చారణ విశేషం. P ప్రతిలో

ఉ వర్ణాన్నే పాటించి ఇతరప్రతుల్లో ఉన్నవాటిని పాఠభేదాలుగా కొన్నిచోట్ల చూపించాము.

(7) శకటరేఫలేఖనం C, F ప్రతుల్లో అక్కడక్కడా కన్పిస్తుంది, ఇతర ప్రతుల్లో మృగ్యం. శకటరేఫలున్న పాఠాల్ని మార్చలేదు.

D. పాఠాంతరాలు—పరిష్కరణ:

P ప్రతికి ఇతరప్రతులలో ఉన్న పాఠభేదాలు, పాఠాంతరాలు అసంఖ్యాకం. అప్రధానాలూ, నిరర్థకాలూ అయిన పాఠభేదాల ప్రదర్శనంవల్ల చదువరులకు 'నేత్రశ్రమ' తప్ప వేరొక ప్రయోజనం ఉండదు. కాబట్టి ప్రధానాలు, సార్థకాలు అయిన పాఠాంతరాలను విధిగాచూపించి, సామాన్యాలు, కేవల రూపాంతరాలు అయిన పాఠభేదాలను పూర్తిగా పరిహరించకుండా మచ్చుకన్నట్లు ఆయా ప్రతుల్లోని వాటిని కొన్నిచోట్లమాత్రం చూపి, అనేకచోట్ల విస్మరించడమైంది. ఇట్టి లాఘవం భాషాస్వరూపావగాహనకు భంగంకలుగని పద్ధతిలో నిర్వహింపబడింది. ఇందుకు పాటించిన పద్ధతి:

(1) అర్థదృష్ట్యా విలక్షణంకాకుండ. పదలేఖనం (spelling)లో మాత్రమే కొంత వైవిధ్యమున్న రూపాంతరాలను కొన్నిచోట్లనే స్వీకరించి మిగిలినచోట్ల పరిహరించడం. అట్టి రూపాంతరాలు:

వలదు—వల్దు—వద్దు
కలదు—కల్దు—కద్దు
గనుక—గనక—గన్క
వలన—వలను—వల్న—వల్ను
అటని—ఇటని
అటువంటి—ఇటువంటి
అటువలె—ఇటువలె
—బలె— —వలె
అందరు—ఇందరు
వకడు—వొకడు
వారలు—వార్లు—వాండ్లు, వారు
వోయీ—వోయి—వో మొదలైనవి.

ప్రత్యయాలమీద ఉత్వసహిత ద్రుతమున్నరూపాలు, లేనిరూపాలు:

చేతను, చేత

చేయగాను, చేయగా

అటువలెను, అటువలె మొదలైనవి.

సముచ్చయార్థక ప్రత్యయ రూపాంతరాలు:

ను, న్ను, నూ, న్నూ;

సాధారణసంధి, విసంధిరూపాలు:

యేమనుటంచేను, యేమనుట అంచేను;

సరైన, సరి అయిన వంటివి;

సంబోధనలోని హ్రస్వదీర్ఘ భేదం:

అర్జునుడా!—అర్జునుడ! ;

అర్జునా!—అర్జున! వంటివి:

గసడదవాదేశాలు, సరళాదేశాలు మొదలైనవి.

(2) వివిధ ప్రతుల్లో వున్నట్టి పర్యాయపద రూప పాఠాంతరాలు, అధిక పాఠాలు, విభిన్న పాఠాంతరాలు, భాషాచరిత్రకు ఉపయోగించే వివిధరూపాలు యీ పరిష్కరణలో జాగరూకతతో స్వీకరింపబడినాయి.

(3) P ప్రతిలో ఒకపదములేక అక్షరము అర్థరహితమని తోచినపుడు అర్థవంతమైన రూపాన్ని అక్కడే కుండలీకరణాల్లో చూపించడమైంది.

ఉదా: చూ. పుట 33 '....సమస్తమైన ప్రాణా(ణు)లున్ను....'

చూ. పుట 43 '....మహానైపొంది (మహానేరై్పంది)'

(4) P ప్రతిలో ఒక అక్షరమో, పదమో లుప్తంగా ఉన్నచోట్ల ఇతర ప్రతుల్ని పురస్కరించుకొని లుప్తపూరణం చేయబడింది. లుప్తపూరణ భాగాలు నిలువు బ్రాకెట్లమధ్య చూపబడినాయి. ఉదాహరణకు. చూ. పుట 65 '....నాయొక్క యీ [మతమును నిత్య]మున్ను ఆచరింతురు.'

(5) P ప్రతిలో తెలుగు తాత్పర్యానికి ఎక్కువ శైథిల్యమున్నచోట్ల A ప్రతి తాత్పర్యాన్ని ఒజ్జబంతిగా స్వీకరించి, దానికి ఇతర ప్రతుల్లోని పాఠాంతరాలు చూపబడినాయి.

(6) P ప్రతి తాత్పర్యానికి, ఇతరప్రతుల్లోని తాత్పర్యానికి అత్యధికభేదం ఉన్నపుడు సౌలభ్యంకోసం అత్యధికభేదమున్న తాత్పర్యాలను పూర్తిగా వ్రాయడమైంది.

## 8. భాషా విశేషాలు :

ఈ వ్యాఖ్య తెలుగు భాషా పరిణామ చరిత్రకు మిక్కిలి ప్రయోజనకారి. పదహారో శతాబ్దపు తెలుగు భాషా స్వరూపాన్ని తెలుసుకోవడానికి ఆనాటి కావ్య, శాసనాలకన్నా వ్యావహారికంలోని ఈ వ్యాఖ్య ఎంతో ఉపకరిస్తుంది. ఇందులో ఒకటి రెండు సిద్ధాంత వ్యాసాలకు తగినంత భాషాసామగ్రి ఉన్నదంటే అతిశయోక్తికాదు. ఇందున్న పదప్రయోగాలు, కారక వైచిత్రి, అనువాద విశేషాలుకూడా పరిశీలనార్హాలు. ఈ వ్యాఖ్యలో కన్పించే భాషా విశేషాలు కొన్ని దిఙ్మాత్రంగా క్రింద సూచింపబడ్డాయి.

(1) ధ్వనులు—వర్ణాలు :

పెద తిరుమలయ్య 'రేఫఱకార నిర్ణయము' అనే లక్షణ గ్రంథానికి కర్త. కాని ఈ వ్యాఖ్యలో C, F ప్రతుల్లోనే అక్కడక్కడ శకటరేఫ లేఖనం గోచరిస్తుంది. ఇతర ప్రతుల్లో ఇది మృగ్యం.

ఋవర్ణము రేఫతుల్య మనడానికి తత్సమ పద లేఖనంలో 'ఋ' సంకేతమే గాకుండా రేఫ సంకేతంకూడా ప్రయుక్తమైంది.

తాలవ్యహల్లులకు పరంగా ఉన్న అత్వానికి అర్ధ వివృతమూ, హ్రస్వమూ అయిన పూర్వాచ్చు ఉచ్చారణ (helf-open unrounded Front vowel), అల్లే ఏత్వానికి అర్ధ వివృతమూ, దీర్ఘమూ అయిన పూర్వాచ్చు ఉచ్చారణ ఆనాడు ఉన్నట్లు పదాల లేఖనాన్నిబట్టి చెప్పవచ్చు. ద్వ్యక్షర పదాల్లో రెండవ అక్షరంలో అత్వమున్నపుడు ప్రథమాక్షరంలోని ఏత్వానికి అర్ధ వివృతమూ, దీర్ఘమూ అయిన పూర్వాచ్చు ఉచ్చారణ ఉన్నట్లుకూడా 'ప్యాద,' 'ల్యాక' వంటి పదాల లేఖనాన్ని బట్టి నిర్ణయించవచ్చు.

ఘాలి, ఘట్టి, వొఖటి వంటి కొన్ని దేశ్యపదాల్లో అక్కడక్కడ ఉన్న మహాప్రాణ సంకేతం ఒత్తి చెప్పడానికి, లేదా ప్రామాణిక భ్రాంతి వల్ల ప్రయుక్తమైనట్లు ఊహించవచ్చు. C ప్రతిలోని 'వొహోనొహపుడున్' అనే పాఠ భేదం (పుట 334)

మొదలైనవి. 'భ్రమయు' అన్నది యువర్ణాంతమైన తత్సమక్రియ. భ్రమయుడు (పుట 26); భ్రమస్తే. భ్రమసును (పుట 48); భ్రమయుదురు (పుట 78).

స్వార్థంలో క్రియలకు చేరే 'కొను' అనుబంధానికి 'కొ, కు. క' రూపాంతరాలు కూడా ఈ వ్యాఖ్యలో కన్పిస్తాయి.

(4) సమాసాలు :

వ్యాకరణాలు ఒప్పుకోని మిశ్రసమాసాలు కొన్ని ఈ వ్యాఖ్యలో కన్పిస్తున్నాయి: మహావిలుకాడు (పుట 6); మహానేర్పు (పు 43); భుజబలిమి (పు. 282); అనేకపాట్లు (పు 306); ద్రవ్యవెచ్చాలు (పు 315) మొదలైనవి.

(5) వాక్యరచన :

సంస్కృతకారకానుగుణమైన వాక్య నిర్మాణం ముఖ్యంగా యత్తదర్థక వాక్యాల్లోను, కర్మణి ప్రయోగాల్లోను కవిపిస్తుంది. యత్తదర్థక వాక్యాల్లో పూర్వ భాగం సమాపక క్రియగా భాసిస్తూ వుంటుంది. అంటే క్రియాంతంలో ఓత్వంలేని రచన. ఉదా:

(1) 'యే చుట్టాలకొరకు అయినానేమి భోగాలు, సుఖాలు, రాజ్యమున్నూ కాంక్షింపబడును, అటువంటి చుట్టాలు ప్రాణాలున్నూ. ధనాలున్నూ విడిచి యుద్ధమందు యెదిరించివున్నారు' (పు. 12).

(2) దేహంవిడిచి యెవ్వడుపోవును, వాడు ప్రకృతితోబాసిన ఆత్మస్వరూపమనే పరమగతిబొందును. (మూలం: యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ (పు. 146).

కర్మణి ప్రయోగానికి ఉదాహరణాలు:

(1) 'ప్రకృతిచాతను ప్రయోజనాలు చేయింపబడుచున్నది' (మూలం: ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని. పు. 246).

(2) 'యిటని అర్జునునిచాతను పలుకబడిన కృష్ణుడు' (మూలం: ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన. పుట 9).

వాక్యాంతంలో వాక్యార్థ నిరూపణకొరకు 'అనుట' అన్నపదాన్ని చేర్చడం ఈ వ్యాఖ్యలో ఒక విలక్షణం. ఉదా: 'అటుగనుక, కర్మమందు జ్ఞానం పొడగనవచ్చును అనుట' (పు 80); 'ఇటనగాను మనస్సును యింద్రియాలవెంట బారకుండాను నిలుపుమరనుట' (పు 83).

కొన్నిప్రతుల్లో అక్కడక్కడా కర్త బహువచనంలోవున్నా క్రియ ఏకవచనంలో ఉండడం కనిపిస్తుంది. ఉదా: 'యీ పావనాలయిన యజ్ఞదాన తపస్సులు నాకు ప్రీతిగాను మోక్షమపేక్షించినవానిచాత శాయదగినది' (ఈ వాక్యంలో అన్నిప్రతుల్లోను క్రియకు ఏకవచనరూపమేవుంది. చూ. పు. 306).

(6) పదప్రయోగ విశేషాలు:

ఈ వ్యాఖ్యలో గుర్తింపదగిన పదప్రయోగాలు ముఖ్యంగా అనువాదంలో చాలా ఉన్నాయి.

ఉదాహరణకు కొన్ని:
విశారదాః = మహానేర్పరులు (పు. 4)
పర్యాప్తం = నిండుకొనివున్నది (పు. 4)
అపర్యాప్తం = పాడువారుచున్నది (పు. 4)
ఆనకః = డక్కీలు/డక్కలు (పు. 5)
శస్త్రసంపాతః = యెలగోలుపోట్లాట (పు. 7)
రణసముద్యమః = సందడియుద్ధము (పు. 8)
శ్వశురాః = బిడ్డనిచ్చినమామలు (పు. 10)
సుహృదః = చుట్టాలు (పు. 10)
పితరః = పితాళ్లు (పు. 15)
అహోబత = వోహోకటకటా (పు. 16)
హృదయదౌర్బల్యః = మనస్సుపేదతనము (పు. 21)
పండితాః = వివేకులయినవార్లు (పు. 25)
జీర్ణానివాసాంసి = పాతకోకలు (పు. 31)
అక్షరః = జీవుడు (పు. 58)
బ్రహ్మ = ప్రకృతి సంబంధమైన శరీరం (పు. 58)
రాగః = వేడుక (పు 66); స్త్రీపురుషులు వొకరికొకరు వేడుకపడెడి వేడుక (పు. 253)
కూటస్థః = కొండవలెనే నిర్వికారుడు (పు. 109)
పతిః = యేలికె (పు. 179)
నాగాః = అనేక శిరస్సులుగల పాములు (పు. 185)
యోధముఖ్యాః = గమికాండ్లు (పు. 205)

ఈళః = యేలిక (పు. 215)

గంధాః = పరిమెళాలు (పు. 268)

దేహః = కడుపు (పు. 271)

దుష్పూరః కామః = యెంతయినా తనియని ఆసోదము (పు. 281)

ప్రాజ్ఞాః = పెద్దలు (పు. 296)

'ఉవాచ' అనే పదానికి ప్రతుల్లో వున్న వివిధ అనువాదాలు చూడండి: వాక్యం, మాట, ప్రశ్న, పల్కుచున్నాడు, అంచున్నాడు, చెప్పుచున్నాడు, అడుగుతున్నాడు, చెప్పేవాక్యం, ఆనతిచ్చినక్రమము, ఆనతిచ్చినవివరము.

గ్రంథపరిష్కరణ పాశ్చాత్యులు నేర్పిన విద్య. అది తెలుగువారికి బ్రౌన్ పెట్టిన భిక్ష. ముద్రితాలై వున్న ప్రాచీన తెలుగుకావ్య ప్రబంధాలన్నీ పండితపరిష్కృతాలే. వాటిలో అనేకం పునఃపరిష్కృతాలై పునర్ముద్రితాలైనవి కూడా. కాని, గ్రంథపరిష్కరణ విద్యకు సంబంధించిన సమస్యల్ని, విధానాల్ని వివరించి తెలిపే ఒక చిన్న పుస్తకంగాని, వ్యాసాలుగాని తెలుగులో లేవు. అందువల్ల భాషాసాహిత్య ప్రియులకు ప్రాచీన తాళపత్రప్రతుల స్వరూపం తెలియదు. గ్రంథప్రకటనకు ముందు పరిష్కరణదశలో పరిష్కర్త పొందే ప్రసవవేదన ఎట్టిదో పాఠకలోకానికి దురూహ్యం. పెద తిరుమలయ్య భగవద్గీతావ్యాఖ్యయొక్క ప్రాధాన్యాన్ని గుర్తించి దాన్ని పరిష్కరించాలని నన్ను ఆదేశించి ప్రోత్సహించినవారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయోపాధ్యక్షులు ఆచార్య కొత్త సచ్చిదానందమూర్తిగారు. వారు అటు సంప్రదాయానికి, ఇటు నవీన ప్రయోగానికి సమన్వయమార్గాన్ని స్థాపించి అందు నడచి నడిపించగల ప్రగతిశీలురు; సమ్యగవేక్షణమూర్తులు. వారికి నా కృతజ్ఞతాంజలి.

ఈ వ్యాఖ్యాపరిష్కరణలో సహాయకులుగా నియుక్తులై నాకు చేదోడు వాదోడుగా పనిచేసినవారిద్దరు: 1. శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు; 2. శ్రీ కె. జె. కృష్ణమూర్తి. శ్రీనివాసాచార్యులుగారు తాళ్లపాక సాహిత్యంలో చిరకాలపరిశ్రమ చేసిన పరిశోధకులు. వారికున్న తాళ్లపాక సాహిత్య పరిజ్ఞానం మెచ్చదగింది. ఈ పరిష్కరణలో వారు చేసిన సూచనలకు, పంచుకొన్న శ్రమకు నా కృతజ్ఞత. పైగా పుస్తకముద్రణపరమైన విధుల్ని కూడా శ్రీనివాసాచార్యులుగారే నిర్వహించినారు. శ్రీకృష్ణమూర్తిగారు వృత్తిలోను, ప్రవృత్తిలోను పరిశోధకులు. ప్రతి విషయాన్నీ లోతుగా తరచి చూడాలని ఉబలాటమున్నవారు. గ్రంథపరిష్కరణకాలంలోనే

గాకుండా ఈ పీఠికను వ్రాయడంలో నేను కోరిన వివరాల్ని చాలవరకు సేకరించి ఇచ్చి నా శ్రమను తగ్గించినారు. వర్ధిష్ణువైన శ్రీ కృష్ణమూర్తికి నా ధన్యవాదాలు.

తమ దగ్గరున్న ప్రతిని ఎరవుగా ఇచ్చి ఈ పరిష్కరణ కుపయోగించుకోమని అనుమతించిన మిత్రుడు శ్రీ మల్లేశుడు. వారికి నా ధన్యవాదాలు.

ఈ పరిష్కరణలో నాకు కలిగిన సమస్యల్ని, సందేహాలను చర్చించడానికి అప్పుడప్పుడు తమ కాలాన్ని నాకోసం వినియోగించిన డాక్టర్ ఎస్. శంకర నారాయణన్‌గారికి, డాక్టర్ డి. శ్రీధరబాబుగారికి, ప్రారంభంలో కొన్ని సూచనల్ని చేసిన డాక్టర్ పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి నా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదాలు.

F ప్రతికారుడు గ్రంథాంతంలో
'వ్రాతతప్పువలన వాచకు లయిగక
తప్పు గలిగెనేని తగినయెడల
వలయు అక్షరములు వర్ణించిపెట్టుడీ
సుకవులైనవారు సురుచిరముగ'

అని వేడుకొన్నాడు. లిఖితప్రతుల్లోని వ్రాత తప్పుల్ని సవరించగలిగినా, ముద్రితప్రతిలో కొన్ని ముద్రారాక్షసాలు చోటు చేసుకొన్నాయి. అయినా అవి ప్రత్యేకపట్టికలో చూపదగినట్టి పెద్ద తప్పులుగావు. కాబట్టి సహృదయులైన పాఠకులే వాటిని సరిచూచుకోగలరని మనవి.

పరిష్కృతమై మీ చేతిలో వున్న ఈ భగవద్గీతావ్యాఖ్య పండితుల, విమర్శకుల దృష్టిని ఆకర్షించి, నిర్మాణాత్మకమైన విమర్శకు వారిని ప్రోత్సహిస్తే ఈ గ్రంథ ప్రకటన ప్రయోజనం ఫలించినట్లే.

మార్చి, 1978.

E ప్రతిలో

# [ధ్యాన శ్లోకాలు]

† సచ్చిదానంద రూపాయ కృష్ణాయాభీష్టకారిణే
నమో వేదాంతవేద్యాయ గురవే బుద్ధి సాక్షిణే॥

* కృష్ణద్వైపాయనం వ్యాసం సర్వలోకహితేరతమ్
వేదాబ్జభాస్కరం వందే శుకతాతం తపోనిధిమ్॥

†† పారాశర్యవచస్సరోజమమలం గీతార్థగంధోత్కటం
నానాఖ్యానక కేసరం హరికథా సద్ధ్యాన సంబోధితమ్
లోకే సజ్జనషట్పదై రహరహః పేపీయమానం ముదా
భూయాద్భారతపంకజం కలిమలప్రధ్వంసి నః శ్రేయసే॥

* వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః॥

§ కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే
నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంతవేదినే॥

§ యదంఘ్రికమలద్వంద్వం ద్వంద్వతాపనివారణమ్
తారకం ద్విపదం వందే శ్రీగురుం ప్రణమామ్యహమ్॥

§ ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృతదుహే నమః॥

§ సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాలనందనః
పార్థోవత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥

§ వాచకః ప్రణవో యస్య క్రీడావస్త్వఖిలం జగత్
శ్రుతిరాజ్ఞా వపుర్జ్ఞానం తస్మై కృష్ణాత్మనే నమః॥

§ సచ్చిదానందరూపాయ కృష్ణాయాక్లిష్టకర్మణే
నమో జ్ఞానస్వరూపాయ తస్మై కృష్ణాత్మనే నమః॥

## [కరన్యాసం]

శ్రీమదైశ్వర్యాత్మనే ఛందసే శ్రీకృష్ణాయ తర్జనీభ్యాం స్వాహా, శ్రీమ ద్భక్త్యా[త్మ]నే శ్రీవేదవ్యాసాయ మధ్యమాభ్యాం వౌషట్, శ్రీమద్బలాత్మనే బలభద్రరామాయ అనామికాభ్యాం హుం, శ్రీమత్తేజసాత్మనే వాసుదేవాయ కనిష్ఠికాభ్యాం వౌషట్, శ్రీమద్విజయాత్మనే గాండీవధన్వినే అర్జునాయ కరతల కరపృష్ఠాభ్యాం ఫట్, ఏవం హృదయాది షడంగన్యాసః భూర్భువ స్సువరోమితి దిగ్బంధః.

ధ్యానమ్—

క కరకలిత నిదర్శితార్థముద్రః పరికలితోన్నతబర్హిబర్హచూడః
ఇతరకరగృహీతవేత్రతోత్రో మమ హృది సన్నిధి మాతనోతు శౌరిః॥

卐 పార్థాయ ప్రతిపాదితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీం
అంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్॥

క ఆలంబసూత్రేణ సహారసూత్రం యస్తోత్రముద్రాంకుర పల్లవేన
ప్రదర్శయన్నార్థ పదార్థతత్వం పార్థాయ తత్సారథయే నమోస్తు॥
శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్॥

శ్రీమదలమేల్మంగాసమేత శ్రీవేంకటేశాయనమః.

E ప్రతిలో ఇంతవరకు కల భాగం భగవద్గీత ప్రారంభానికి ముందు ఒక తాటాకుపై వ్రాయబడి ఉంది.

† ఈ శ్లోకం గురుస్తోత్రశ్లోకం. ఇది G.O.M లైబ్రరిలోని D2048 భగవద్గీత సంస్కృతటీక గల ప్రతిలో ఉంది.

§ ఈ శ్లోకం గురుస్తోత్ర శ్లోకం.

* ఈ శ్లోకాలు వ్యాసస్తోత్ర శ్లోకాలు.

†† ఈ శ్లోకం మహాభారత స్తుతి శ్లోకం.

§ ఈ శ్లోకాలు కృష్ణస్తోత్ర శ్లోకాలు.

卐 ఈ శ్లోకం భగవద్గీతాస్తోత్ర శ్లోకం.

F ప్రతిలో—

# [ కరన్యాసం ]

అస్య శ్రీ గీతాశాస్త్రమంత్రస్య ప్రాయేణాభు.................అనుష్టుప ఛందః క్వచిన్నానాఛందాంసి చ శ్రీవేదవ్యాస భగవాన్ ఋషిః, శ్రీకృష్ణః పరమాత్మా దేవతా, అశోచ్యానన్వశోచ[స్త్వ]మితి బీజం, సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజేతి శక్తిః, అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచేతి కీలకం .........ష్ణ ప్రీత్యర్థే వినియోగః.

శ్రీమద్జ్ఞానాత్మనే కృష్ణాయ అంగుష్ఠాభ్యాన్నమః, శ్రీమదైశ్వర్యాత్మనే తర్జన్యాత్మనె తర్జనీభ్యాన్నమః, [శ్రీమ] చ్ఛక్త్యాత్మనే వేదవ్యాసాయ మధ్యమాభ్యాన్నమః, శ్రీమద్బలాత్మనే బలభద్రరామాయ అనామికాభ్యాం నమః, శ్రీమత్తేజసాత్మనే కృష్ణాయ కనిష్ఠికాభ్యా[న్నమఃశ్రీ] మద్వీర్యాత్మనే గాండీవ ధన్వినే కరతలకరపృష్ఠాభ్యాన్నమః, శ్రీమద్జ్ఞానాత్మనే కృష్ణాయ హృదయాయనమః, శ్రీమదైశ్వర్యాత్మనే శిరసే [స్వాహా శ్రీమచ్ఛక్త్యా]త్మనే వేదవ్యాసాయ శిఖాయైవౌషట్. శ్రీమద్బలాత్మనే బలభద్రరామాయ కవచాయ హుం శ్రీమత్తేజసాత్మనే కృష్ణాయ నేత్రత్రయాయై వౌ [షట్ శ్రీమద్వీ] ర్యాత్మనే గాండీవధన్వినే [అర్జునాయ] హస్తాయ [అస్త్రాయ] ఫట్.

## [ ధ్యాన శ్లోకాలు ]

ȣ ప్రపన్నపారిజాతాయ తోత్రవేత్రైకపాణయే
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృత దుహే నమః॥

ȣ సర్వోపనిషదోగావో [దోగ్ధా గోపాల] నందనః
పార్థోవత్స స్సుధీర్భోక్తా దుగ్ధం గీతామృతం మహత్॥

§ చతుర్ణామపి వేదానాం సారముద్ధృత్య విష్ణునా
త్రైలోక్యస్యోపకారాయ గీతాశాస్త్రం ప్రకాశితమ్॥

ȣ వాచకః ప్రణవో యస్య క్రీడావ స్త్వఖిలం జగత్
శ్రుతిరాజ్ఞా వపుర్జ్ఞానం తం వందే దేవకీ సుతమ్॥

ȣ వందే కృష్ణార్జునౌ వీరౌ నరనారాయణా వుభౌ
ధార్తరాష్ట్రకులోన్మత్త గజారోహణవల్లభౌ॥

ȣ సారథ్య మర్జునస్యాదౌ సృష్టం గీతామృతం దదౌ
లోకత్రయోపకారాయ తస్మై కృష్ణాత్మనే నమః॥

† పార్థాయ ప్రతిపాదితాం భగవతా నారాయణేన స్వయం
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యే మహాభారతమ్
అద్వైతామృతవర్షిణీం భగవతీ మష్టాదశాధ్యాయినీ
మంబ త్వా మనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్॥

ȣ కరకలితనిదర్శితాత్మముద్రః పరికలితోన్నతబర్హిబర్హచూడః
ఇతరకరగృహీతవేత్రతోత్రో మమ హృదిసన్నిధి మాతనోతు శౌరిః॥

ȣ భారతోదధిమంథస్య గీతానిర్మథనస్య చ
సారముద్ధృత్య కృష్ణేన అర్జునస్య ముఖే హుతమ్॥

* మునిస్నిగ్ధాంబుదాభాసం వేదవ్యాస మకల్మషం
వేదవ్యాసం సరస్వత్యావాసం వ్యాస మకల్మషమ్॥

ƒ మూలే కల్పతరోస్సరోరుహగతం గోగోపగోపీవృతం
నీలాంభోజనిభం త్రిభంగిసలిలం సంవీతపీతాంబరమ్
శ్రీమత్కౌస్తుభపారిజాతకుసుమస్రగ్భూషితోరస్థ్సలం
వందే నందసువేణునాదనినదం పింఛావచూడం ముహుః॥

* తం వేదశాస్త్రపరినిష్ఠితశుద్ధబుద్ధిం
చర్మాంబరం సురమునీంద్రసంసుతం కవీంద్రమ్
కృష్ణత్విషం కనకవర్ణజటాకలాపం
వ్యాసం నమామి శిరసా తిలకం? నమామి॥

† గీతాకల్పతరుం భజే భగవతా కృష్ణేన సంరోపితం
వేదవ్యాసవివర్ధితం శ్రుతిశిరోబీజం ప్రబోధాంకురమ్
నానాశాస్త్రరహస్యశాఖమరతిక్షాంతిప్రవాళాంకితం
కృష్ణాంఘ్రిద్వయభక్తిపుష్పసురభిం మోక్షప్రదం జ్ఞానినామ్॥

ƒ శోకానుకంపాహృతయుద్ధధీమతం కిరీటినం తత్త్వరూపణాత్పున....?
....అర్థాపయంతస్యమరాయతీతం కృష్ణం భజే జ్ఞానఘనం పరాత్పరమ్?

卐 శేషాశేషముఖవ్యాఖ్యా చాతుర్యం త్వేకవక్త్రతః
దధానమద్భుతం వందే పరమానందమాధవమ్॥

卐 భాష్యకారమతంసమ్యక్తద్వ్యాఖ్యాతృగిర స్తథా
యథామతి సమాలోడ్య గీతావ్యాఖ్యాం సమారభే॥

卐 గీతావ్యాఖ్యాయతే యస్యాః పాఠమాత్రా దయత్నతః
సేయం సుబోధినీ టీకా సదా ధ్యేయా మనీషిభిః॥

అస్మద్గురుభ్యోన్నమః శ్రీమతే రామానుజాయనమః.

ƒ ఈ శ్లోకాలు కృష్ణస్తోత్ర శ్లోకాలు.

† ఈ శ్లోకాలు భగవద్గీతాస్తోత్ర శ్లోకాలు.

* ఈ శ్లోకాలు వ్యాసస్తోత్ర శ్లోకాలు.

卐 ఈ శ్లోకాలు భగవద్గీతకు సంస్కృతంలో శ్రీధరస్వామి రచించిన "సుబోధినీ" టీక ప్రారంభంలో ఉన్నాయి.

F ప్రతిలో ఇంతవరకు కల భాగం భగవద్గీతప్రారంభానికి ముందు ఒక తాటాకుపై వ్రాయబడి ఉంది.

# [అవతారిక]

† ధర్మరాజువారున్నూ, దుర్యోధనునివారున్నూ యుద్ధానకు [1]ఆయత్తపడి వుభయ[2]దళాలున్నూ మోహరించి [3]వున్నందుకు ధృతరాష్ట్రుడు తన [4]కొలువుచావడి లోను [5]చింతిస్తూ వుండగాను [6]అక్కడికి వేదవ్యాసులు [7]వచ్చి, ధృతరాష్ట్రుడా! నీ వేల వగచేవు? [8]కృష్ణస్వామి [9]భూభారం అణచ నవతరించినాడు. ఆ [10]పోట్లాడే రాజుల[11]కెల్లాను కాలం చేరువై వున్నది. [12]యెవరు మాన్చినాను [13]మానదు. నానాటి యుద్ధము నీకు [14]తెలియజెప్పేటట్టుగాను నా యనుగ్రహం[15]వల్లను త్రికాలవేదియైన సంజయుడు [16]నీకు జెప్పుచున్నూ వచ్చీని. అని [17]సంజయుని ధృతరాష్ట్రుని వద్ద బెట్టి వేదవ్యాసులు [18]తన ఆశ్రమానకు పోయెను. [19]ఆటు తరువాత [20]ధృతరాష్ట్రుడు [21]సంజయున్ని పోట్లాడే వివరం అడుగుచున్నుండును.

1 FG ఆయిత్తపడి 2 A బలములున్ను 3 A వున్న యప్పుడు G వున్నందున 4 G కొల్వులోను 5 F చింతిస్తున్నుండగాను G చింతిస్తున్ను వుండగాను 6 G అక్కడిక్కి 7 F వేంచేశి 8 A శ్రీభగవానులు F శ్రీకృష్ణుడు G కృష్ణమ్మ 9 A భూభారమడంప F భూభారం అణపను 10 A పోట్లాటకు వచ్చిన రాజుల 11 AF కల్లాను 12 AFG యెవ్వరు మాన్పినాను 13 F మానరు. 14 A అదిగనుక చెప్పే అట్టుగాను F తెలిపి చెప్పే టట్టుగాను G తెల్పి చెప్పే అట్టుగాను 15 A వల్లను G వల్న 16 A నీకు జెప్పుచు వచ్చీని. F నానాటియుద్ధము నీకు 17 A ఆ సంజయు నిని F సంజయున్ని G సంజయునిని 18 F తన యాశ్రమానకు G తమ ఆశ్రమాన్కి 19 A ఆ తరువాతను F ఆ తరవాత G ఆ తర్వాతను 20 A ధృతరాష్ట్రుండు 21 A సంజయునితో పోట్లాడిన వివరం అడుగుచున్నాడు. F సంజయున్ని పోట్లాడే వివరం అడుగుచున్నాడు. G సంజయున్ని పోట్లాడే విధము అడుగుచున్నాడు.

† ఈ అవతారికావచనం సంస్కృత మహాభారతభీష్మపర్వ (జంబూఖండ వినిర్మాణపర్వ) మందలి రెండవ అధ్యాయంలోని తొలి పదకొండు శ్లోకాలకు, అయిదవ అధ్యాయంలోని మొదటి రెండు శ్లోకాలకు (మొత్తం పదమూడు శ్లోకాలకు) పెద తిరుమలాచార్యులు చేసిన స్వేచ్ఛానువాదం. చూ. పూనా భండార్కర్ సంస్థవారి సంస్కృతమహాభారతం 7 వ సంపుటం, పుటలు 8, 9, 24.

C పాఠం- ధర్మ ............రున్ను యుద్ధానకు ఆయత్తపడి పుణ్యక్షేత్రమైన కురుక్షేత్రమందు మోహరించి వున్నందుకు ధృతరాష్ట్రుడు తన కొలువు చావడి

లోను చింతాక్రాంతుడై విదురుడున్ను, సంజయుడున్ను కొలిచివుండగాను ఖిన్నుడై వుండె. తరవాతను వేదవ్యాసులు వస్తేను ప్రత్యుత్థానము చేశి, అర్ఘ్యపాద్యాదుల బూజించి, సుఖాసనమందు గూర్చుండబెట్టుకొని, తాను గూర్చుండి తలవంచుకొని చింతింపుచునున్న ధృతరాష్ట్రునితోను వేదవ్యాసులు వోయి ధృతరాష్ట్రుడ! నీవు యేల చింతించేవు? కాలము చేరువైవుండగాను ............గా పోట్లాట గలి[గి] వున్నది అదికాక కృష్ణమ్మ భూభారము హరించను అవతరించి అన్యోన్య......... కల్పించి పోవుచున్నాడు. ఆ కృష్ణమ్మ సత్యసంధుడు ............కాయదలచిన కార్యము ......నదుని... ...యిందుకు వగవపనిలేదు. కురుపాండవుల యుద్ధము చూడవలస్తేవా నీకు దివ్య...దలచేను అని వేదవ్యాసులు ఆనతిస్తేను, ధృతరాష్ట్రుడు అన్నలున్ను తమ్ములున్ను పోరాడి హతులు గాగాను నేనే మని చూచేను. ...విన్నపం చేసుకొంలేను, వేదవ్యాసులు అట్లైతే నానాటి యుద్ధము చూచివచ్చి నీకు తెలి............సంజయునకు దివ్యద్రిష్టి యిస్తిని, సంజయుడు నీకు చెప్పు చున్ను వచ్చే నని ఆ.........ధృతరాష్ట్రుని వద్ద బెట్టి వేదవ్యాసులు పోయిన తరవాతను ధృతరాష్ట్రుడు సంజయుని పో.........అడుగుచున్నాడు.

D లో ఈ వచనం లేదు. ప్రారంభమే "ధర్మక్షేత్రే" అన్న శ్లోకంతో.

E పాఠం- ధర్మరాజువారున్ను, దుర్యోధనునివారున్ను యుద్ధానకు ఆయత్తపడి వుభయదళాల వారున్ను మోహరించివుండగాను, ధృతరాష్ట్రమహారాజు యీ యుద్ధనిమిత్యం అనేకప్రజాక్షయం అవుతావున్నదని చాలా వగువగాను అక్కడికి వ్యాసులువచ్చి, ధృతరాష్ట్రుడా! యీ యుద్ధానికి నీవేల వగచేవు? శ్రీకృష్ణస్వామి భూభారం అణచేట్టుగా అవతరించినాడు. యీ రాజలోకాన కెల్లా కాలం చేరిక అయినది. ఇది యెవ్వరివల్లా తీరేదికాదు. నీవు విచారము కాయవద్దు. నానాటి యుద్ధము రహస్యమైన వార్తలు హృదయాభిప్రాయాలున్ను నీకు తెలియచెప్పేటట్టుగాను త్రికాలవేదియగు నట్టుగాను సంజయునికె అనుగ్రహం చేశినారు. ఆ సంజయుని వల్ల సకలకార్యాలున్ను వినుమని సంజయున్ని ధృతరాష్ట్రువద్ద నిలిపి వ్యాసులు తమ ఆశ్రమానకు పోయినవాడాయను. ధృతరాష్ట్రుడు సంజయునితో వొఖమాట పలికినవాడాయను.

---



తాళ్లపాక పెద తిరుమలాచార్యులు

1 AF సంజయుడు చెప్పదొణగెను C సంజయుడు ధృతరాష్ట్రునితోను చెప్పుచున్నాడు G సంజయుడు చెప్పుచున్నాడు 2 E వోయి ధృతరాష్ట్రుడా! రాజైన 3 CE యున్న 4 A ద్రోణాచార్యుల దగ్గరబోయి వకమాట పలికెను. C ద్రోణాచార్యులు వున్నచోటికిబోయి పలికెను. D ద్రోణాచార్య దగ్గిరబోయి వొఖమాట పలికెను. E ద్రోణాచార్యుల దగ్గరబోయి వకమాట పలికిన వాడాయను. G ద్రోణాచార్యుని దగ్గరికిబోయి వకమాట పలికెను.

3

పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥

[1] "వోయి ద్రోణాచార్యుడా! నీకు [2] శిష్యుడైన, ధీమంతుడైన ద్రుపదరాజు [3] కుమారునిచాతను, వ్యూహాకారముగాను, పన్నబడినటువంటి పాండుపుత్రులయొక్క మహత్తైన యీ సేన జూడుము.

1 CDF ద్రోణాచార్యుడా! 2 E శిష్యుడున్ను, బుద్ధిమంతుడైన, ద్రుపద రాజకుమారుడైన ధృష్టద్యుమ్నుని చేతన, వ్యూహాకారముగాను పన్నబడిన పాండవ సేనను జూడుము. C లో-కుమారునిచాతను... పన్నబడినటువంటి పాండు-ఈభాగం లేదు.

4

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥

అక్కడ [1] శూరులునై, [2] ధీరులునై, వీరులునైన్ని, [3] అమ్ములున్నుగలవారై, యుద్ధరంగమందు భీమార్జునుల [4] సములైనటువంటివారు [5] యుయుధానుడున్నూ, మహారథుడైన ద్రుపదుడున్నూ,

1 ACDFG శూరులైన, 2 ACDFG లలో-ధీరులునై వీరులునైన్ని-అన్న భాగం లేదు. 3 ACFG మహావిండ్లున్ను, అమ్ములున్ను, D మహావిల్లున్ను, అంబులున్ను, 4 CD సములైనవారు 5 ACDFG యుయుధానుడున్ను, విరాటుడున్ను, మహా

E పూర్తిపాఠం—అక్కడ శూరులు యుద్ధరంగమందు భీమార్జునులకు సములైనవారు యుయుధానుడున్ను, విరాటరాజున్ను, మహారథుడైన ద్రుపద రాజున్ను,

5

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥

ధృష్టకేతుడున్నూ, చేకితానుడున్నూ, [1]వీర్యవంతుడైన కాశిరాజున్నూ, పురుజిత్తుడున్నూ, కుంతిభోజుడున్నూ, నరశ్రేష్ఠుడైన శైబ్యుడున్నూ,

1 ACD వీర్యవానుడైన

6

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥

[1]పరాక్రమంగలిగిన యుధామన్యుడున్నూ, వీర్యవంతుడైన వుత్తమోజుడున్నూ, [2]సుభద్రకొడుకైన [3]అభిమన్యుడున్నూ, [4]ద్రౌపదికొడుకులున్నూ, సర్వమైన [5]యింతవట్టువారున్నూ, [6]మహారథికులు.

1 E పరాక్రమవంతుడైన 2 ACDF సౌభద్రుడున్ను ద్రౌ - E సుభద్రకొమారుడైన 3 ACDF లలో లేదు. 4 E ద్రౌపదికొమాళ్లు అయిదుగురున్ను, 5 G యింతవార్లున్ను 6 ACDEFG మహారథులు.

7

అస్మాకంతు విశిష్టాయే తా న్నిబోధ ద్విజోత్తమ
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥

[1]వోయి [2]ద్విజోత్తముడైన ద్రోణాచార్యుడా! మన సంబంధమైనవార్లలోను [3]విశేషమైనవా రెవ్వరు, వార్ని తెలుసుకొనుము. మన సైన్యముయొక్క నాయకులను నీకు గురుతుకొరకు వారిని [4]జెప్పేను.

1 CG ఓ 2 E బ్రాహ్మణోత్తముడైన 3 ABCDFG విశిష్టు లెవ్వరు, E శ్రేష్ఠులు యెవ్వరు, 4 A జెప్పేను వినుము. B జెప్పెదను వినుము.

8

భవా న్భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ॥

[1] .............న్నూ, కర్ణుడున్నూ, యుద్ధమందు జయించే కృపుడున్నూ, అశ్వద్ధామాను, వికర్ణుడున్నూ, సోమదత్తి(త్త)పుత్రుడైన [2] భూరిశ్రవుసుడున్ను,

1 AD వారు యెవ్వరు అంటేను? నీవున్ను, భీష్ముడు BCF వా రెవ్వ రంటేను? నీవున్ను, భీష్ముడు E సేనానాయకులు యెవ్వరంటేను? భీష్ముడు G సేనానాయకులు వా రెవ్వ రంటేను? భీష్ముడు 2 ABCDFG భూరిశ్రవుడున్ను,

9

అన్యే చ బహవ శ్శూరా మదర్థే త్యక్తజీవితాః
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥

[1] మరిన్ని కొంద రనేకులైన శూరులు నానావిధాలైన శస్త్రాలున్నూ, ఆయుధాలున్నూ కలిగినవార్లై, నాకొరకు ప్రాణాల [2] మీది [3] ఆశ విడిచినారు. [4] వీ రిందరు [5] యుద్ధమందు మహానేర్పరులు.

1 AG మరికొందరు అనేకులైన D మరిన్ని అనేకులైన 2 BDF మీద 3 ABCDFG ఆశ విడిచివున్నారు. 4 ABCE వీ రిందరున్ను DFG వీరు అందరున్ను 5 A యుద్ధమందుల

10

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥

అటువంటి మనసేన భీష్ములచేతను [1] రక్షింపబడియుండిన్ని [2] పాడువారుచున్నది. యీ పాండవులయొక్క బలము భీమునిచేత రక్షింపబడుచున్నూ [3] నిండుకొని వున్నది.

1 AC రక్షింపబడిన్ని 2 E నిండక వున్నది. G పాడుదేరుచున్నది. 3 CEF నిండుక వున్నది. D నిండుకున్నది. G నిండుకొన్నది.

11

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః
భీష్మమేవాభిరక్షంతు భవంత స్సర్వ ఏవ హి॥

[1] అటువలెనే వున్నదిగనక [2] మీ రిందరుగూడి [3] సమస్తతెరగులను [4] పంపుబెట్టుకొని [5] భీష్మన్నే [6] కాచుకొని తిరుగుడా" [7] అంటేను.

1 ACDE ఆటువలె వు_2 B మీ రందరున్నూ గూడి E మీ రందరున్నూ కూడుకొని 3 ABCDFG సమస్తమైన తెరువులాను E సకలమైన మార్గాలనున్ను 4 A పంపుబెట్టుక E ఆయాదిక్కు తప్పకుండాను పంపుబెట్టుక వున్నవారై 5 A భీష్ములనే CDFG భీష్మునినే E భీష్ములను 6 ABCDFGకాచుక E రక్షించుడ అనెను. 7 D లో_అంతేను_లేదు.

## 12

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్ ॥

ఆదుర్యోధనునికి హర్షం పుట్టిస్తున్నవాడై కౌరవవంశవృద్ధుడైన, [1]ప్రతాపవానుడైన [2]భీష్ములు బెట్టుగా సింహనాదం చేసి శంఖము పూరించెను

1 A ప్రతాపవానులైన CDFG లలో లేదు. 2 CFG భీష్ముడు

E పూర్తిపాఠం—కౌరవవంశవృద్ధుడై, ప్రతాపశాలియైనటువంటి, తాతైన భీష్ముడు ఆదుర్యోధనునికి సంతోషమును పుట్టిస్తున్నవాడై, బెట్టుగాను సింహనాదముచేసి శంఖమును పూరించెను.

## 13

తత శ్శంఖాశ్చ భేర్యశ్చ పణ వానక గోముఖాః
సహసైవాభ్యహన్యంత స శబ్ద స్తుములోఽభవత్॥

ఆతరువాతను [1]శంఖాలున్ను, [2]భేరులు, పణవా లనేవాద్యాలు, [3]డక్కీలు, గోముఖా లనేవాద్యాలు శీఘ్రమే వాయింపబడెను. [4]ఆ వాద్యధ్వని దట్టమైవుండెను.

1 ABCDEFG శంఖాలు, 2 D లో_భేరులు_లేదు. E భేరులున్ను, తప్పెటలున్ను, డక్కలున్ను, గోముఖా లనేవాద్యాలున్ను 3 ABG డక్కలు D లో_డక్కీలు గోముఖాలనే_భాగంలేదు. 4 DG ఆ వాయిద్య—

## 14

తతః శ్వేతైః హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥

[1]అప్పుడు [2]తెల్లగుర్రాలు కట్టిన మహారథమందు వున్నటువంటి [3]కృష్ణమ్మాను, అర్జునుడున్నూ [4]దివ్యాలైన శంఖాలు పూరించిరి.

1 E ఆ తరువాతను 2 తెల్లనిగు - F తెల్లనిగుర్రాల కలిగినటువంటి 3 A శ్రీభగవానులున్ను, BD శ్రీకృష్ణుడున్ను, E శ్రీకృష్ణమ్మాను, 4 D దివ్యమై నటువంటి G దివ్యంబైన

## 15

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః ॥

[1]ఆ శంఖాలపేళ్లు యేవి అంటేను? [2]పాంచజన్యం [3]కృష్ణమ్మ పూరించెను. [4]దేవదత్తము అర్జునుడు పూరించెను. పౌండ్ర మనే[5]శంఖం భయంకరమైన [6]శాంతం (శాతలు)గల భీముడు పూరించెను.

1 A ఆ శంఖాలు యే వంటేను? 2 CDEG పాంచజన్యమును 3 A భగ వానులు BCG కృష్ణుడు DEF శ్రీకృష్ణుడు 4 CD దేవదత్తమును E దేవదత్త మనే శంఖం 5 ABCDE శంఖమును 6 A చాతలంగల E కార్యాలుచేశే భీ-F శాతలుగల

## 16

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః
నకుల స్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ॥

యుద్ధమందు [1]స్థిరుడైన, [2]కుంతిపుత్రుడైన, [3]ఆశేన నెల్లాను [4]యేలేటి ధర్మరాజు అనంతవిజయ మనే శంఖం పూరించెను. నకులుడు సుఘోష మనే శంఖం పూరించెను.

1 G ధీరుడైన 2 E గొంతికొమారుడైన C లో లేదు. 3 A ఆశాన నల్లా B ఆశేన నెల్లా C ఆశానల నల్లా E లో లేదు. 4 B యేలే E లో లేదు. G యేలెడి

## 17

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకి శ్చాపరాజితః ॥

[1]మహావిలుకాడున్నూ, కాశిదేశాధీశ్వరుడున్నూ, మహారథుడైన శిఖండిన్ని, ధృష్టద్యుమ్నుడున్నూ, [2]విరాటుడున్నూ, వోటమిలేని సాత్యకిన్నీ,

1 ABCDEF మహావిలుకాడైన G మహావీరుడైన 2 E విరాటరాజున్ను,

## 18

ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే
సౌభద్రశ్చ మహాబాహుః శంఖాన్ దధ్ముః పృథక్ పృథక్॥

ద్రుపదరాజున్నూ, [1]ద్రౌపదీపుత్రులున్నూ, [2]మహానుభావుడైన [3]అభిమన్యుడున్నూ, వోయి ధృతరాష్ట్రుడా! [4]సమస్తమైనవారున్నూ రాజులు [5]వేరే తమ తమ శంఖాలు పూరించిరి.

1 E ద్రౌపదికుమాళ్లున్ను, 2 BCDFG మహాబాహులైన E మహా భుజాలు కలిగిన 3 ABDFG సుభద్రపుత్రుడైన అభిమన్యుడున్ను, E సుభద్రా కుమారుడైన అభిమన్యుడున్ను, 4 ACDEF సమస్తమైన రాజులున్ను G సమస్తమైన సేనలున్ను 5 ABCDEF వేరే వేరే G వేరే వేరే తమ శంఖాలు

## 19

స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥

[1]ఆయొక్క శంఖారావము [2]దట్టమై, ఆకాశమున్నూ, [3]భూమిన్ని ప్రతిధ్వనులచాత [4]మ్రోయింపుచున్నూ, [5]ధృతరాష్ట్రపుత్రుల సేనవారల గుండియలు వ్రక్కలింప జేసు(శె)ను.

1 A ఆ శంఖాలరవము CDF ఆ శంఖారవము E ఆ శంఖధ్వనులు 2 E సంకులమైనవై, 3 CF పృథివినిన్ని 4 D లో లేదు. 5 A ధృతరాష్ట్రి పుత్రుల సేనల గుండెలు D ధృతరాష్ట్రి పుత్రుల సేవారల గుండెలు E ధృతరాష్ట్రి పుత్రుల గుండెలు F ధృతరాష్ట్రి పుత్రులయొక్క సేనవారల గుండెలు G ధృతరాష్ట్రిని వారిసేన గుండెలు

## 20

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః
ప్రవృత్తే శస్త్రసంపాతే ధను రుద్యమ్య పాండవః॥

[1]అటుతర్వాత యుద్ధానకు [2]నిశ్చయించుకొన్నటువంటి ధృతరాష్ట్రపుత్రులను, [3]కపిధ్వజుడైన అర్జునుడు జూచి [4]యెలగోలపోట్లాట నడుస్తుండగాను విల్లెక్కు పెట్టుకున్నవాడై,

1 ABCDEFG తర్వాతను 2 C నిశ్చయించి వున్నటువంటి 3 E హనుమధ్వజా డైన 4 CDFG యెలగోలుపోట్లాట E యెలగోలుజగడం

## 21

హృషీకేశం తదావాక్య మిదమాహ మహీపతే
అర్జున ఉవాచ
సేనయో రుభయో ర్మధ్యే రథం స్థాపయ మే చ్యుత॥

వోయి ధృతరాష్ట్రుడా! అపుడు [1]కృష్ణస్వామినిజూచి అర్జునుడు యిట్లని పలికెను [2]ఆమాట యే మంటేను? "వోయి [3]కృష్ణస్వామి! వుభయసేనామధ్యమందు [4]రథము నిలుపుము

1 A భగవానులను B కృష్ణున్ని CDFG కృష్ణమ్మను E కృష్ణస్వామినిగూర్చి 2 ABCFG ఆమాట యే దంటేను? D లో-ఆమాటయే మంటేను వోయికృష్ణస్వామి -లేదు. 3 ACFG కృష్ణమ్మా! B కృష్ణుడా! 4 A మనరథము BCDEFG నారథము

## 22

యావదేతా న్నిరీక్షేహం యోద్ధుకామా నవస్థితాన్
కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥

యుద్ధము [1]శాయ నిశ్చయించినవారై, [2]ఫౌజు [3]గూడుకొని వొచ్చిన [4]ధృతరాష్ట్రకుమారబలమును యీ సందడి యుద్ధమందు [5]యెవ్వరితో నాకు పోట్లాడవలెనో వారిని జూచేను [6]అందనకా రథము పోనిచ్చి నిలుపుము.

1 C శాయను 2 D సేన E ఫౌజులు 3 A గూడుకవచ్చిన G గూడుక వచ్చిన 4 E యీ ధృతరాష్ట్రికుమారులబలాలను 5 A యెవ్వరితో నాకుపోరాడవలెనో B నాకు యెవ్వనితో పోట్లాడవలెనో 6 AF అందాకాను BCE అందనకాను D అందనుకా G లో-అందనకా... నిలుపుము-లేదు.

## 23

యోత్స్యమానా నవేక్షేహం య ఏతేత్ర సమాగతాః
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః॥

యుద్ధమందు దుర్బుద్ధియైన, ధృతరాష్ట్ర[1]పుత్రుడైన దుర్యోధనునికి ప్రియము శాయ నిశ్చయించినవారలై [2]యెవ్వ రెవ్వరు యీరణమందు [3]గూడుకొని యుద్ధము [4]చేశేవాండ్లను నేను జూచేను".

1 E కుమారుడైన 2 E యె వ్వరాయ నేమి వీరు 3 ABC గూడిరో E కూడినారో F గూడి నాతో 4 ABCDEF చేశెడి వార్లను

## 24

సంజయ ఉవాచ

ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత
సేనయో రుభయో ర్మధ్యే స్థాపయిత్వా రథో త్తమమ్॥

ß

యిటని అర్జునుని [1]చాతను పలుకబడిన కృష్ణుడు [2]వుభయసేనామధ్యమందు [3]రథం [4]నిలిపిన [5]వా డాయెను.

ß BD సంజయుని వాక్యం E సంజయుడు పలుకుచున్నాడు

1 A చాతం బలుక BCDEFG చాతపలుక 2 ABCDEFG వోయి ధృత రాష్ట్రుడా! వుభయ 3 AB వు త్తమమైన రథమును CDEFG వు త్తమమైన రథము 4 ABCDE నిలిపి. FG నిలిపెను. 5 ABCDEFG అలో లేదు.

## 25

భీష్మద్రోణప్రముఖత స్సర్వేషాం చ మహీక్షితామ్
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూ నితి॥

భీష్మద్రోణుల [1]ముందరాను, సమస్తమైన రాజుల [2]ముందరాను, రథము నిలిపి "వోయి [3]అర్జునా! [4]పౌజుగూడిన యీ కౌరవసైనికుల [5]జూడు" మని పలికిన [6]వా డాయెను.

1 B ముందరను C ముందరగాను 2 C ముందరగాను 3 B అర్జునుడా! 4 D సేనకూడిన 5 ABCDEFG చూడు మని పలికెను. 6 ABCDEFG అలో లేదు.

## 26

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄ నథ పితామహాన్
ఆచార్యా న్మాతులాన్ భ్రాతౄ న్పుత్రా న్పౌత్రాన్ సఖీం స్తథా॥

ఆ యుద్ధరంగమందు అర్జునుడు తండ్రులను, తాతలను, ఆచార్యులను, మేనమామలను. [1]తోబుట్టుగులను, కొడుకులను, మనమలను, చెలికాండ్లను,

1 AFG తోడబుట్టువులను BCD తోబుట్టువులను,

E పూర్తిపాఠం-తరువాతను అర్జునుడు ఆ యుద్ధరంగమందు ఉన్నటువంటి తండ్రులనున్ను, తాతలనున్ను, ఆచార్యులనున్ను, మేనమామలనున్ను, తోడబుట్టిన వారినిన్ని, కొమాళ్లనున్ను, చెలికాండ్లనున్ను చూచెను.

27

శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి
తాన్సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూ నవస్థితాన్॥

[1]బిడ్డనిచ్చినమామలను, చుట్టాలను, వుభయ[2]సేనలయందు వుండెడి వారల జూచెను. యుద్ధానకు యెదిరించిన [3]సమస్త బంధువుల జూచి,

1 BDG బిడ్డల E ఆతీరున బిడ్డల 2 ADE సేనలయందున్ను వుండేటి వారల B సేనలందుండేవారిని G సేనామధ్యమందు వుండేవారల 3 ABCDE ఆ సమస్తమైన బంధువులను G ఆ సమస్తమైన పెద్దలజూచి,

28

కృపయా పరయావిష్టో విషీద న్నిదమబ్రవీత్
అర్జున ఉవాచ
దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్॥

[1]మహాఘనమైన కృపతోగూడినవాడై, దుఃఖిస్తున్న అర్జునుడు [2]కృష్ణునితోను యిట్లని పలికెను. [3]"వో కృష్ణుడా! యుద్ధముకాయ నిశ్చయించి [4]పౌజు గూడుకొన్న యీబంధువుల జూచి,

1 E ఘనమైన దయతో 2 A భగవానులతోను DCG కృష్ణునితో D కృష్ణమ్మతో F కృష్ణునితోడ 3 E వోయి కృష్ణస్వామి! 4 E వరరాకలు గూడిన(?)

29

సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥

నాయొక్క అంగాలు బెండుపడుచున్నవి. నోరు యెండుచున్నది. [1]శరీరం వణకుచున్ను. [2]నిరువెంట్రుకలున్ను [3]పుట్టుచున్నది."

1 ACDFG శరీరమందు వణుకున్ను 2 ADFG నిలువెంట్రుకలున్ను B నిడువెంట్రుకలున్ను C నిలువువెంట్రుకలు E రోమాంచమున్ను 3 ABF పుట్టుచున్నవి.

## 30

గాండీవం స్రంసతే హస్తా త్త్వక్చైవ పరిదహ్యతే
న చ శక్నో మ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥

[1]అర్జునుడు పలుకుచున్నాడు వోయి కృష్ణస్వామిః చాతనున్న [2]గాండీవం జారుచున్నది, శరీరమందలి [3]తోలు వుడుకుచున్నది, [4]మనస్సు భ్రమశినట్టువలె నుండగా నిలువనున్నూ శక్తుడగాక వున్నాడను.

1 ABCDEFG లలో – అర్జునుడు ... కృష్ణస్వామి – అన్న భాగంలేదు. 2 E గాండీవ మనే విల్లున్ను 3 E చర్మమున్ను 4 A భ్రమశిన మనస్సునుం బలెనె వుండగాను BCDF భ్రమసినట్టుంబలెనుండగాను E నామనస్సు భ్రమసినట్లు వలెనె ఉన్నది G భ్రమశినట్లుబలె నుండగాను

## 31

నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ
న చ శ్రేయోఽను పశ్యామి హత్వా స్వజన మాహవే॥

వోయి కేశవుడాః విపరీతాలైన [1]నిమిత్తాలను చూస్తున్నాడను. తనవారిని యుద్ధమందు [2]చంపి శ్రేయస్సును గానను.

1 A నిమిత్యాలను C నిమిత్తేలను 2 A చంపే (చంపి + ఏ శ్రేయస్సు) E చంపినా G చంపుటిది యేశ్రేయస్సు గానను.

## 32

న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ
కిం నో రాజ్యేన గోవింద కిం భోగై ర్జీవితేన వా॥

[1]వోయి కృష్ణుడాః [2]వీరి నందరినీన్ని చంపి గెలుపున్నూ, రాజ్యమున్నూ, [3]సుఖాలున్నూ, [4]బ్రతుకులున్నూ యేలా?

1 A వోయి భగవానులు! B లో లేదు. D వోయి గోవిందుడా! 2 AC వీరి నిందరినిన్ని D లో లేదు. E వీరల నందరినిన్ని 3 ACG సుఖాలనున్ను, BF

సుఖాలున్ను, D లో లేదు. 4 A ఆసపడను. వోయి గోవిందుడా! మనకు రాజ్యం యేల? భోగా లేల? బ్రతుకు లేలా? B ఆశపడను. వో గోవిందుడా! మనకు రాజ్యము యేల? భోగములు యేల? బ్రతుకు యేలా? C ఆశపడను. వోయి గోవిందుడ! మనకు రాజ్యము యేల? భోగా లేల? బ్రతుకు లేల? E వోయి గోవిందా! మనకు రాజ్యం యేల? భోగా లేల? బ్రతుకు లేలా? F ఆశపడను. వో గోవిందుడా! మనకు రాజ్యమేల? భోగా లేల? బ్రదుకు లేల? G ఆసపడను. మన రాజ్యమేల? భోగా లేల? బ్రతుకు లేలా?

D పూర్తిపాఠం—వోయి గోవిందుడా! నాకు జయంగోరను. రాజ్యసుఖం కోరను. భోగాలు వద్దు.

## 33

యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగా స్సుఖాని చ
త ఇమేవస్థితా యుద్ధే ప్రాణాం స్త్యక్త్వా ధనాని చ॥

[1]యే చుట్టాలకొరకు అయినానేమి భోగాలు, సుఖాలు, రాజ్యమున్నూ కాంక్షింపబడును, అటువంటి [2]చుట్టాలు ప్రాణాలున్నూ, ధనాలున్నూ విడిచి యుద్ధమందు యెదిరించివున్నారు.

1 G యే చుట్టల 2 ABFG యీ చుట్టాలు

D పూర్తిపాఠం— వోయి కృష్ణుడా! వీర్ని అందరినీ చంపి గెలువున్ను, రాజ్యమున్ను, సుఖాలున్ను ఆశపడను. నాకు రాజ్యము యేల? భోగాలు యేల? బ్రతుకు లేల? యే చుట్టాలకొరకు భోగాలు, సుఖాలు, రాజ్యము కాంక్షింపబడును; అటువంటి యీ చుట్టాలు ప్రాణాలు, ధనాలు విడిచి యుధ్ధమందు విచరించియున్నారు.

E పూర్తిపాఠం—యే చుట్టాల కొరకైనానేమి రాజ్యమున్ను, భోగాలున్ను మనకు కాంక్షింపబడును, యిటువంటి యీ చుట్టాలు ప్రాణాలున్ను, ధనాలున్ను విడిచి యుధ్ధమందు యెదిరించి వున్నారు.

G లో పై తాత్పర్యం తర్వాత 34 వ శ్లోక తాత్పర్యం కలిపి వ్రాయబడింది.

## 34

ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః
మాతులాః శ్వశురాః పౌత్రాః స్యాలాః సంబంధిన స్తథా॥

ఆ చుట్టాలు యెవ్వ రంటేను? ఆచార్యులు, తండ్రులు, [1]కొడుకులు, తాతలు, మేనమామలు, [2]బిడ్డనిచ్చిన మామలు, మనమలు, మరదులు, తక్కిన [3]సంబంధు లున్ను అటువలె [4]తెగువతో నున్నారు.

1 E కొడుకులు, ఆ తీరుననే తాతలు, 2 BFG బిడ్డలనిచ్చిన 3 AEF సంబంధులు BCD బంధువులున్ను 4 E తెగువతో డట్టు ఉన్నారు.

## 35

ఏతా న్న హంతు మిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే॥

[1]యింతవట్టువారున్నూ, వారైనా నన్ను వారు చంపినాను, వారిని నే జంప [2]నిచ్ఛయింపను. యీరీతిని త్రైలోక్యరాజ్యమున్నూ వచ్చినాను వల్లను. భూమి మాత్రానకు మరేమివున్నది గనుక?

1 AC యింతవట్టువారినిన్ని వారు చంపినాను B యింతవట్టువారున్నూ వారైవొచ్చి నన్ను జంపినాను DFG యింతవట్టువార్నిన్ని వారు చంపినాను 2 ABCFG నిశ్చయింపను.

E పూర్తిపాఠం—యింతవట్టువారినిన్ని వారు చంపినాను నేను చంప నిచ్ఛయింపను. వోయి మధుసూదనుడా! త్రైలోక్యరాజ్యలక్ష్మినిమిత్తమైనా నేను యుద్ధంశాయను. భూమినిమిత్తానికి యేమి వున్నది గనక?

## 36

నిహత్య ధార్తరాష్ట్రా న్నః కా ప్రీతి స్స్యా జ్జనార్దన
పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః॥

వోయి జనార్దనా! ధృతరాష్ట్రపుత్రుల [1]జంపితేను మన కేమిసంతోష మయ్యీని? [2]వీరల జంపితేను పాపమే [3]మనముల [4]నాశ్రయించీని.

1 A జంపితే మన కేమి CDF జంపి మన కేమి E జంపినందువల్ల యేమి G జంప మన కేమి 2 ADFG యీ ఆతతాయుల జంపితేను C యీ ఆకతాయల చంపితేను G ఆతతాయీల జంపితేను 3 D మనకు 4 ACDEFG నాశ్రయించును.

37

తస్మాన్నార్హా వయం హంతుం ధార్తరాష్ట్రాన్ సబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ॥

అదిగారణానబట్టుంది [1]బంధు[స]హితులైన యీ ధృతరాష్ట్ర [2]పుత్రులను చంప నర్హులముగాము. వో మాధవుడా! [3]తనవారిని జంపి యెటువలెను [4]సుఖుల మయ్యేము?

1 A బంధుసమేతులైన BCDEFG బంధుసహితులైన 2 E కుమారులను మేము చంప 3 A తనవారి జంపి C తనవారల జంపి 4 E సుఖంగలవార మయ్యేము?

38

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః
కులక్షయకృతం దోషం మిత్రద్రోహేచ పాతకమ్॥

యీ కౌరవులు లోభంచాతను, చెదరిన మనస్సుగలవారై, కులక్షయకృతమైన [1]దోషమున్నూ, [2]మిత్రద్రోహమందలి పాతకమున్నూ, వీరు చూడకుండినాను,

1 ABC దోషమునున్ను 2 E మిత్రద్రోహమైన పాతకం

39

కథం న జ్ఞేయ మస్మాభిః పాపాదస్మా న్నివర్తితుమ్
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భి ర్జనార్దన॥

కులక్షయకృతమైన దోషమున్నూ, మిత్రద్రోహమందలి పాతకమున్నూ, వీరు చూడ కుండినాను, యెరిగినటువంటి మనచాతను, యీ పాపంవల్లన నివర్తించెడి కొరకు యేరీతిన్నీ యెరుగబడదు?

ABCDFG లలో పూర్తిపాఠం—కులక్షయకృతమైన దోషమును యెరిగినటువంటి మనచాతను, [1]యీ పాపమువల్లను నివర్తించేటికొరకు నేరీతి యెరగబడదు?
1 E యీ పాపంవల్ల నుండిన్ని నివ

40

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా స్సనాతనాః
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభి భవత్యుత॥

[1]కులక్షయకృతదోషము [2]పూర్వమందుండి వొచ్చేటటువంటి [3]కులధర్మా లెల్లాను [4]నాశనం బొందును. ధర్మము నష్ట మైతేను [5]సమ_స్తమైన కులమునున్నూ అధర్మము వొచ్చి [6]కప్పుకొనును.

1 ABCDEFG కులక్షయ మయితేను 2 E పూర్వానుండి 3 ACDE కులధర్మా అల్లాను F కులధర్మాల నల్లాను G కులధర్మా అల్లా 4 ABCDFG నాశం 5 D సమ_స్తకులమునున్నూ 6 F చుట్టుకొనును. G కట్టుకొనును.

## 41

అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః
స్త్రీషుదుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥

1 ........................................లు [2]దూషింపబడుదురు. [3]స్త్రీలు [4]దుష్టలైతేను వర్ణసంకర మౌను.

1 ABCDFG వోయి కృష్ణుడా! అధర్మం వచ్చి కులమును జెరిస్తేను కులస్త్రీ 2 A దూషించబడుదురు. 3 G కులస్త్రీలు 4 A దూషిత మయితేను

E పూ_ర్తిపాఠం—వోయి కృష్ణస్వామి! కులమును అధర్మమువచ్చి కప్పుకొన్నందువల్లను కులస్త్రీలు దూషింపబడుదురు. వోయి వృష్ణినందనా! స్త్రీలు దుష్టులైతేను వర్ణసంకర మౌను.

## 42

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః॥

1 ..............................—చినవార్లకున్నూ, కులానకున్నూ, నరకాన బడేటందుకు కారణ మౌను. [2]వీరలయొక్కపితాళ్లు పిండోదక[3]క్రియలులేక [4]అధోగతి బడుదురు.

1 ABCDEFG ఆవర్ణసంకరము కులముచెరి 2 D వీరలపితాళ్లు 3 E క్రియాదులు 4 EF అధోగతిని.

## 43

దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥

యీ కులము [1]చెరిచెడి [2]వార్లయొక్క వర్ణసంకరము చే[శె]డి యీ దోషాల చాతను [3]శాశ్వితమైన కులధర్మాలు, [4]……………

1 D చెడిన 2 C వాండ్లయొక్క 3 C శాశ్వతమైన 4 ABCEFG జాతి ధర్మాలున్ను, చెడిపోవును.

44

ఉత్పన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దన
నరకే నియతంవాసో భవతీ త్యనుశుశ్రుమ ॥

వోయి జనార్దనుడః [1]కులధ *………………………………………………………….త వింటుము.

1 G సకలధర్మాలు *A ర్మాలు [2]చెడినయటువంటి మనుష్యులకు [3]నరక మందున [4]తా[సదా] వుండవలె నని వేదశాస్త్రాలచా 2 CDF చెడినటువంటి చెరిచినటువంటి 3 BCDEFG నరకమందు 4 BCDFG సదావుండ

E పూర్తిపాఠం — వోయి జనార్దనా! చెడిన కులధర్మాలుగల మనుష్యులకు నరకమందు యెప్పుడున్ను వుండవలె నని వేదశాస్త్రాలచేతను వింటుము.

45

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజన ముద్యతాః॥

[1]…………………………………………………………………… భం చాతను, తమవార్ల నెల్లాను చంప నుద్యోగించిన [2]వార్లై [3]మహాపాపము [4]శాయ నుద్యోగిస్తిమి.

1 A వోహో! కటకటా! [5]యేమికారణాన బట్టుండి అయినా నేమి రాజ్య సుఖ [6]మందేటిలో 2 ABCDEF వార్లమై 3 D మహాపాతకం 4 E శాయను మేము ఉద్యుక్తుల మైనాము. 5 BCE యేదికారణాన D యేదేని కారణాన 6 BDEF మందలి

G లో ఈ శ్లోక తాత్పర్యాలు లేవు.

## 46

యది మా మప్రతీకార మశస్త్రం శస్త్రపాణయః
ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్॥

[1] ...............దురు [2]పడకయుండెడి [3]నన్ను ఆయుధ[హ]స్తులైన [4]ధృతరాష్ట్రపుత్రులైన ఆసేనవారలు [5]రణమందు చంపినాను [6]అది నాకు మి[7] .... .... .... .... .... .... ....

1 A ఆయుధం విడిచి యె 2 B నడపక 3 A తన్ను B నన్నును CDF తన్నును 4 AG ధృతరాష్ట్రుని సేనవార్లు B ధృతరాష్ట్రిపుత్రులైన ఆసేనవార్లు CD ధృతరాష్ట్రిసేనవార్లు E ధృతరాష్ట్రిసేన F ధృతరాష్ట్రిసేనలవార్లు 5 E రణమందువార్లు 6 D లో–అది నాకు–లేదు. 7 A మిక్కిలిన్ని వోర్వదగినది అవును. B మిక్కిలి వొప్పదగిందే అవును. C మిక్కిలి వోర్చదగింది అవును. D మిక్కిలిన్ని వోర్పుదగిలింది. అప్పుడు, E మిక్కిలి క్షేమ మయినది అవును. FG మిక్కిలిన్ని వోర్వదగింది అవును.

## 47

సంజయ ఉవాచ

ఏవ ముక్త్వార్జున స్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥

ర

[1]యిటని పలికి అర్జునుడు విల్లున్ను, [2]అమ్ములున్ను విడిచి శోకంచేత
*.... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... .... కెల బడెను.

ర D సంజయుని వాక్యం B ఇతి

1 D అటని 2 D అంబులున్ను * A ను కలగిన మనస్సువాడై, యుద్ధరంగ మందు రథమువిూద చతికెలబడెను. B ను కలగిన మనస్సుగలవాడై, యుద్ధరంగ మందు రథమువిూద చతికలబడెను. C ను గలిగిన మనస్సుగలవాడై, యుద్ధరంగమందు రథంవిూదను చదికెలబడెను. D ను గలిగిన మనస్సుగలవాడై, యుద్ధరంగమందు రథంమ్మీద చతికెలబడెను. F ను కలగిన మనస్సుగలిగినవాడై, యుద్ధరంగమందు రథంవిూద జదికిలబడెను. G ను కలగిన మనస్సుగలవాడై, యుద్ధరంగమందు రథము విూద చదికిలెబడెను.

E పూర్తిపాఠం—అని సంజయుడు చెప్పుచున్నాడు "అర్జునుడు విల్లు, బాణాలున్న విడ్చి శోకంచాతను కలిగిన మనస్సువాడై, యుద్ధరంగమందు రథం మీద కూర్చుండవాడాయెను" అని ధృతరాష్ట్రునికి చెప్పినవాడాయెను.

ఇది శ్రీమత్తాళపాక అన్నమాచార్యుల కొమారుడు పెద్ద తిరుమలయ్యంగారు తెనుగుచేశి వ్రాయించినది భగవద్గీత.... .... ........ .... .... .... ....

A ఓం తత్చ(త్స)దితి శ్రీమహాభారతే శతసస్యాస్రిం సంహితాయాం వైయ్యాశిక్యాం శ్రీభీష్మపర్వణి భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగోనామ ప్రథయోఽధ్యాయః. యిది తాళ్ల పాక అన్నమయగారు భగవద్గీతలు తెనుగు చేశెను.

శ్రీకృష్ణ వేదవ్యాస శుకావధూత పరమహంస సద్గురవేనమః

B హరిః ఓం తత్సదితి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయ్యాసక్యాం శ్రీభీష్మపర్వణి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.

C మొదలి అధ్యాయం సంపూర్ణం. ఇది శ్రీమత్తాళపాక అన్నమాచార్యుల పుత్రు...లయ్యంగారు భగవద్గీతార్థము తెలుంగు శేశి వ్రాయించె నందు అర్జునవిషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.

D హరి(ః)(ఓం)పోం ఓం తత్సదితి శ్రీమహాభారతే శతసహస్రసంహితాయాం వయ్యాసక్యాం శ్రీభిష్మపర్వణిశ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.

E హరిః ఓం తత్సదితి శ్రీమహాభారతే శతసహస్త్రాం సంహితాయాం వైయ్యాశిక్యాం శ్రీభీష్మపర్వణి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే అర్జునవిషాదయోగోనామ ప్రథమోఽధ్యాయః.

F ఇటని శ్రీమద్రామానుజ విరచితమైన శ్రీగీతాభాష్యక్రమాన శ్రీమత్తాళ్ల పాక అన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెలుగుచేశి వ్రాయించినాను అందు ప్రథమోఽధ్యాయం. శ్రీశౌరిరాజాయనమః శ్రీమతే రామచంద్రాయనమః శ్రీకణ్ణపురనాయకిసహిత శ్రీశౌరిరాజాయనమః

G ఇది శ్రీమత్తాళపాక అన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయంగారు భగవద్గీతార్థము తెనుగుచేశి వ్రాయించిన మొదటి అధ్యాయము సంపూర్ణము. శ్రీకృష్ణార్పణమస్తు.

## రెండవ అధ్యాయం

# సాంఖ్యయోగం

## 1

సంజయ ఉవాచ

తం తథా కృపయావిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః॥

ర

యీరీతిని కృపగల చిత్తంగలవాడై కన్నుల నీళ్ల నింపుచున్నూ వ్యాకుల పడుచున్నూ వున్నటువంటి అర్జునున్ని జూచి కృష్ణమ్మ ఆనతిచ్చిన క్రమ మెట్లన్నను.

ర D శ్రీకృష్ణుని వాక్యం

A పూర్తిపాఠం—యీరీతిని వ్యాకులపడుచున్న అర్జునుని జూచి శ్రీకృష్ణుండు ఆనతిచ్చినక్రమ మెట్లన్నను.

B పూర్తిపాఠం—యీరీతిని కృపగల చిత్తంగలవాడై కన్నుల నీళ్లునింపుచును, వ్యాకులపడుచున్నటువంటి అర్జునున్నిగూర్చి శ్రీకృష్ణులు ఆనతిచ్చినక్రమ మెట్లన్నను.

C పూర్తిపాఠం—యీరీతిని వ్యాకులపడుచున్న అర్జునునిజూచి కృష్ణమ్మ ఆనతిచ్చినక్రమ మెట్లన్నను.

D పూర్తిపాఠం—యీరీతిని వ్యాకులపడుచున్న అర్జుని జూచి శ్రీకృష్ణుడు ఆనతిచ్చినక్రమం.

E పూర్తిపాఠం—అని ఆతీరున దయతోకూడి కన్నీళ్లచాతను పూర్ణమై వ్యాకులమైన దృష్టిగలవాడై విచారబడుతావుండే అర్జునునిగూర్చి శ్రీకృష్ణస్వామి వొకమాట పల్కినవాడాయెను.

F పూర్తిపాఠం—యీరీతిని వ్యాకులపడుచున్న అర్జును నిల జూచి కృష్ణమ్మ ఆనతిచ్చినక్రమ మెట్లన్నను.

G పూర్తిపాఠం—యీరీతిని వ్యాకులపడుచు న్నర్జునిని జూచి కృష్ణమ్మ ఆనతిచ్చెను.

F లో—

అస్థాన స్నేహకారుణ్య ధర్మాధర్మ ధియాకులమ్
పార్థం ప్రపన్నముద్దిశ్య శాస్త్రావతరణం కృతమ్॥

మొదటి శ్లోకం తర్వాత శ్రీయామునాచార్యుల గీతార్థసంగ్రహంలోని పై 5 వ శ్లోకం ఉంది.

2

శ్రీ భగవానువాచ

కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున॥

[1]శ్రీకృష్ణుని వాక్యం

ఓయి అర్జునుడా! "అల్పులకు [2]ప్రాప్తమైనదిన్నీ, స్వర్గవిరోధమై, [3]అపకీర్తికరమై, కశ్మలమైన [4]యీ శోకము [5]విడువుము. యీ విషమమైన [6]యుద్ధమందు [7]నిన్నెటు [8]పొందెను?

1 ACDF లలో లేదు. B శ్రీభగవానులు ఆనతిచ్చిన వివరం G ఆనతిచ్చిన క్రమము 2 AD ప్రాప్తమైనస్వర్గ- BCFG ప్రాప్తమైనదై,స్వర్గ- 3 C అపకీర్తిపదమై F అపకీర్తికరమైన 4 A యీశోకమును 5 ABCDFG లలో-విడువుము యీ—లేదు. 6 ABCDFG యుద్ధభూమియందు 7 AFG నిన్నెట్లు B నిన్నెట్టు D నిన్నెటువలె 8 G వాలెను?

E పూర్తిపాఠం-కృష్ణస్వామి-ఓయి అర్జునా! అల్పులకు ప్రాప్తమైనదై, స్వర్గవిరోధమైన, అపకీర్తికరమైన, కశ్మలమైన యీశాక, విషమమైన యుద్ధభూమియందు యేమిటివల్ల బొందినది?

3

క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥

[1]కుంతిదేవి[2]కొడుకవై యుండీన్ని [3]కొంచదనమును [4]బొందకు. యిది నీయందు యుక్తముగాదు. [5]ఓయి శత్రుసంహారకుడైనవాడవు [6]క్షుద్రమైన [7]పేదమనస్సు విడిచి [8]లెమ్ము" అని కృష్ణుడు [9]ఆనతిచ్చేను.

1 ABF గొంతిదేవి G కుంతిదేవికి 2 ADF కొడకవైయుండి 3 BG కొంచపు చెనమును 4 ABD బొందకుము. G జొందకుమా. 5 ABCF వోయి శతృసంహార కుడైనవాడా D శతృసంహారకుడైనవాడు G వోయీ శతృసంహారకుడవైన వాడవైయుండిన్ని 6 A క్షుద్రమైనమనస్సున్ను పే– CD క్షుద్రమైన మనస్సుపే– 7 AB పేదమనస్సున్ను G పేదతనమును 8 D లెమ్ము. –అని...ఆనతిస్తేను–లేదు. 9 G ఆనతిచ్చెను.

E పూర్తిపాఠం–కుంతీదేవి కుమారుడవైయుండి కొంచపుతనమున పొందవద్దు. ఇది నీయందు యుక్తముగాదు. వోయి శత్రుసంహారకా! క్షుద్రమైన మనస్సున పేద తనమువిడిచి లెమ్మని శ్రీకృష్ణస్వామి ఆనతిచ్చెను.

4

అర్జున ఉవాచ

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ॥

[1] అర్జునుని వాక్యం

వోయి మధుసూదనుడ! పూజార్హులైనటువంటి [2] భీష్మునున్ని, ద్రోణునున్ని యీ సంగ్రామమందు బాణాలచాతను [3] యెదురుగా నెటుల పోట్లాదేను?

1 AD లలో లేదు BCF అర్జునుడు అంచున్నాడు G అర్జునవాక్యం 2 A భీష్మునిన్ని, ద్రోణులనున్ను B భీష్మున్నినీ, ద్రోణున్నిన్ని C భీష్మునిన్ని, ద్రోణునిన్ని చూచి బాణాలచా DFG భీష్మునిన్ని, ద్రోణునిన్ని 3 F యెదురుగా యెట్టు G యెదురుగా యెటువలె

E పూర్తిపాఠం–అర్జునుడు పల్కుచున్నాడు వోయి మధుసూదనా! శత్రు సంహారకా! సమరమందు పూజార్హులయిన భీష్ములను, ద్రోణాచార్యులను బాణాల చాతను యెదురుగా నిలిచి యేతీరు పోట్లాడుదును?

5

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్షమపీహ లోకే
హత్వార్థకామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥

మహానుభావులైన గురువులజంపక, యీలోకమందు [1]భిక్షము యెత్తుకొని [2]భోజనము చేసినాను మంచిది. [3]అర్థకాముడనై గురువుల జంపి [4]వారినెత్తుటి [5]దోగిన [6]వారకప్పడ (వారాశపడ్డ) భోగాలను నేను యెటువలె అనుభవించేను?

1 AD భిక్ష మెత్తుకని B భిక్షం యెత్తుక FG భిక్ష మెత్తుక 2 BC భోజనం చేసినా మంచిది. D తిన్నా మంచిది. F తిన్నాను మంచిది. 3 BCDFG అర్థకాములైన 4 D వారినెత్తురు 5 ABCDFG దోగి 6 ACFG వారాసపడిన B వా రాసపడ్డ D వారు ఆశపడిన

E పూర్తిపాఠం–మహానుభావులైన గురువులను, పెద్దలను చంపక యీలోకమందు భిక్షాన్నమును భోజనంచేసినాను మంచిది. అర్థకాములై[న] గురువులను పెద్దలను వారినెత్తురున భూమిగైకొని వా రాసపడిన భోగా లనుభవించి యిక్కడ యెటువలె నుండేను?

## 6

న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నోజయేయుః
యానేవ హత్వా న జిజీవిషామః
తేవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥

[1]అయినా వారుగెల్తురో? మనము గెల్తుమో? [2]రెంటిలో యేది [3]మంచిదియో యెరుగ[0]? యెవ్వరినైనా నేమి చంపి [4]మరీ బ్రతుకుట [5]ఆశపుట్టదు. అటువంటి [6]ధృతరాష్ట్రిపుత్రులు యెదుటనే వున్నారు.

1 ABCDG అయినాను F అటుగాన 2 A రెంటిలోను 3 ABCDF మంచిదో G మంచిది 4 A వారిబ్రతుకుమీద 5 A ఆసపుట్టేదు. 6 ACDFG ధృతరాష్ట్రినివారు

E పూర్తిపాఠం–వారే మనములను గెల్తురో? లేక మనమే వారల గెలుతుమో? యెరగము. ఈరెంటిలో [యేది మించిదియో] యెరగను? యెవ్వరినైనా నేమి చంపి మరి బ్రతుకుమీది ఆశ లేక వుండునో అటువంటి ధృతరాష్ట్రిని వారు యెదుట నే వున్నారు.

## 7

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసంమ్మూఢచేతాః

యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

నేను కార్పణ్యదోషం చాతను [1]చెరుపబడ్డ స్వభావము గలవాడనై [2]ధర్మం వివేకించలేని [3]బుద్ధిగలవాడనై నిన్ను అడుగుచున్నాడను యేది మేలు [4]అది నాకు నిశ్చయించి [5]ఆనతిమ్ము. నేను [6]నీకు శిష్యుడను. [7]నీకు శరణుజొచ్చిన [8]నన్నును [9]నిరీక్షింపుము (రక్షింపుము).

[1] ACG చెరుపబడిన B చెరిపబడ్డ D చెరపబడిన E చెరబడిన 2 ABD ధర్మం వివేకింపలేని E ధర్మమంగు వివేకించలేని 3 E మనస్సు 4 B నాకు నిశ్చయించి C అని నిశ్చయించి E అని నిశ్చయంగా FG అది నిశ్చయించి 5 BCEF నాకానతిమ్ము G అది నాకు ఆనతిమ్మా 6 AD మీకు 7 A మీకు EG నిన్ను 8 ABCDEFG నన్ను 9 ABCE రక్షింపుము.

8

నహి ప్రపశ్యామి మమాపనుద్యాత్
యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్
అవాప్య భూమావసపత్నమృద్ధమ్
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్॥

[1]నిష్కంటకమై సమృద్ధమైన రాజ్యమున్ను [2]దేవతాధిపత్యమునున్ను పొందిన్ని సమస్తమైన యింద్రియాలను శోషింప[3]జేస్తున్నట్టి [4]నాయొక్క శోకమున్ను [5]తొలగదొబ్బే [6]వుపాయం [7]గానను.

1 ACDFG నిష్కంటకమైన 2 AC దేవాధిపత్యమును D దేవాధి పత్యము 3 ABC జేస్తున్నటువంటి 4 F నాశోకమును 5 C తొలగదొబ్బ D తొలగదొబ్బి (బ్బీ) 6 A టుపాయము D యుపాయమును 7 A కానను అని అన్నవాడాయను. B గాన ననీ. F గానను అని.

E పూర్తిపాఠం—నిష్కంటకమైన సమృద్ధమైన రాజ్యమున్ను దేవతలున్ను యొక్క ఆధిపత్యమునున్ను పొందినను భూమియందు యింద్రియాలను శోషింప జేస్తున్న నాయొక్క శోకమును యేది తొలగదొబ్బునో అటువంటి ఉపాయమును గానను.

9

సంజయ ఉవాచ

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతపః
న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవహ॥

గీ

గుడాకేశుడైన అర్జునుడు [1]అనెను హృషీకేశునితోటి "హోహో గోవిందుడా! నేను పోట్లాడను" అని [2]వూరకుండెను.

గీ AD సంజయుని వాక్యం

1 B హృషీకేశుడైన శ్రీకృష్ణునితోడను అనెను హోహో CD హృషీకేశునితో హోహో F హృషీకేశునితోను హోహో G హృషీకేశునితో గోవిందుడా! 2 BG వూరికేవుండెను F వూరకవుండెను.

A పూర్తిపాఠం – గుడాకేశుడైన అర్జునుండు హృషీకేశునితో హోహో గోవిందుడా! "పోట్లాడ" నని వూరకుండెను.

E పూర్తిపాఠం–సంజయుడు చెప్పుచున్నాడు శత్రుసంహారకుడైన అర్జునుడు కృష్ణస్వామినిహూర్చి యీతీరున మందలించి "నేను యుద్ధము చేయను" అని మందలించి వూరికే ఉండెను.

10

త ముటవాచ హృషీకేశః ప్రహసన్నివ భారత
సేనయో రుభయో ర్మధ్యే విషీదంత మిదంవచః॥

అందుకు హృషీకేశుడు వుభయసేనా మధ్యమందు దుఃఖింపుచున్న [1]అర్జునునిన్ని జూచి [2]అనెను. "భరతవంశమందు బుట్టిన నీకు యిది తగునా" అని నవ్వు[3]చున్నవాడుబలె బలికెను.

1 DG అర్జుని 2 ACDFG లలో లేదు. 3 A చున్నవాడునుంబలె B చున్నవాడైప C చున్నవార్వలెనె D చున్నవాడుబలెను F చున్నాడుబలె

E పూర్తిపాఠం–అని శ్రీకృష్ణస్వామియైన హృషీకేశుడు వుభయసేనామధ్యమందు దుఃఖింపుచున్న అర్జునుని గూర్చి "భరతవంశమందు బుట్టినవాడా! యిది నీకు తగునా" యని నవ్వుచున్నవాడును బలెనే వొకమాట పలికెను.

## 11

శ్రీ భగవానువాచ

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూ నగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥

[1]శ్రీకృష్ణ వాక్యం

శోకింపదగిన[2]వారిగూర్చి [3]శోకిస్తున్నాడవు. ప్రజ్ఞావాదాలున్నూ పలుకుచున్నాడవు. [4]వివేకులయినవార్లు [5]చచ్చే అటువంటి శరీరాల గూర్చిన్ని. చావనటువంటి [6]ఆత్మల గూర్చిన్నీ శోకింపరు.

1 ABFG అందుకు కృష్ణవాక్యం C అందుకు కృష్ణునిమాట D కృష్ణునివాక్యం 2 G దానిగూర్చి 3 B శోకిస్తున్నావు G శోకింపుచున్నాడవు 4 C వివేకులైనటువంటివారు G వివేకులైనవారలు 5 BG చచ్చేటటువంటి 6 G శరీరాల గూర్చిన్ని

E పూర్తిపాఠం-కృష్ణస్వామి పలుకుచున్నాడు - నీవు శోకింపతగనివారిని గూర్చి శోకిస్తున్నాడవు. ప్రజ్ఞావాదాలున్ను పలుకుచున్నాడవు. వచ్చేటటువంటి శరీరాలగూర్చిన్ని, వోపనటువంటి ఆత్మలగూర్చిన్ని పెద్దలైనవారు శోకింపరు.

## 12

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతః పరమ్॥

నేనున్నూ, నీవున్నూ, యీ రాజులున్నూ, [1]వెనకకు లేనివారముగాము. [2]ముందరికిన్నీ లేనివారము కాము. యిందుకు[3]తాత్పర్యం [4]పరమాత్మనైన [5]నేను యెటువలె నిత్యుడను, మీరున్నూ అటువలెనే నిత్యులు.

1 B వెనకటికి 2 G ముందరికి 3 C తాత్పర్యార్థం 4 D పరమాత్ముడనైన 5 DFG నేనెటువలె

E పూర్తిపాఠం-నేనున్ను వెనకకు లేనివాడనుగాను. నీవున్ను వెనకకు లేనివాడవుగావు. ఇందరురాజులున్ను వెనకకు లేనివారుగారు. మనమందరమున్ను ముందరికి లేనివారలుగారు. అటుగనక నిత్యులము. ఇందుకు తాత్పర్యార్థం పరమాత్మనైన నేను యటువలె నిత్యుడను. మీరలున్ను అటువలెనే నిత్యులు.

13

దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా
తథా దేహాంతర ప్రాప్తి ర్ధీరస్తత్ర న ముహ్యతి॥

"[1]దేహికి దేహమందు [2]కౌమార యవ్వనవయస్సు [3]జరా ముదిమిన్ని యెటువలె [4]వొచ్చునో పోవునో అటువలెనే దేహం విడిచి [5]మరివక [6]దేహాంత[ర]ప్రాప్తిని (న్ని)" అని [7]ధీరుడైనవాడు ఆయర్థమందు భ్రమయడు.

1 ABCFG దేహికి యీదేహమందు D యీదేహికి యీదేహామందు 2 ABCFG కౌమారవయస్సు యవ్వనవయస్సు D కౌమారవయస్సున్ను యవ్వనవయస్సున్ను 3 ABCDFG లలో లేదు. 4 CDFG లలో-వొచ్చునోపోవునో-లేదు B వొచ్చిపోవును 5 B మరొక్క C మరొక DG మరివొఖ F మరొకమరొక 6 D దేహాంతరప్రాప్తి అని 7 G అధిపడైనవాడు

E పూర్తిపాఠం-"దేహికి యీదేహమందు కౌమారయౌవనవయస్సులు ముదిమిన్ని యెటువలెను అటువలెనే దేహంవిడిచి మరొకదేహాంతరప్రాప్తిన్ని" అని ధీరుడైనవాడు ఆయర్థమందు భ్రమయడు.

14

మాత్రా స్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః
ఆగమాపాయినోఽనిత్యా స్తాం స్తితిక్షస్వ భారత॥

వోయి [1]అర్జునుడా: పంచతన్మాత్రలవలన బుట్టిన శబ్దాదివిషయాలకు పంచేంద్రియాల[2]తోటి [3]స్పర్శలనే [4]విషయాను †భవాలు శీతోష్ణసుఖదుఃఖాల [5]జేసి అవి[6] వచ్చునూ పోవును గనుక [7]అనిత్యాలు అని తెలిసి అవి వోర్చు కొమ్ము. యిటనగా యేమను టంటేను? [8]కన్నుల చూచే పదార్థాలల్లాను విషయాలు. *చెవులకు విన వచ్చే శబ్దాలల్లాను విషయాలు. ముక్కుకు [9]పరిమెళాలల్లాను విషయాలు. [10]నాలుకకు చౌ లల్లాను విషయాలు. [11]తోలుకు అంటే[12]పదార్థాలన్నీ విషయాలూ. యిటువంటి విషయానుభవాలు [13]వచ్చేదీన్ని పొయ్యేదీన్ని [14]గనుక [15]యుద్ధమందు [16]క్రూరమైన ఆయుధాలు [17]తాకినవి [18]విచారించక వోర్చుకొమ్మనుట.

1 E అర్జునా 2 ABCDEFG తోడి 3 ABCDF స్పర్శాలనే 4 A విషయాల ననుభవాలు B విషయాల అనుభవాలు C విషయాలకు చెవులకు † C లో-నుభవాలు శీతోష్ణ సుఖదుఃఖాలజేసి అవి వచ్చునూ పోవును గనుక

అనిత్యాలు అని తెలిసి అవి వోర్చుకొమ్ము. యిటనగా యేమనుటంటేను కన్నుల చూచే పదార్థాలల్లాను విషయాలు_అన్న భాగంలేదు. 5 DEF జేశేవి D నుచేశేవి 6 AE వచ్చుబోవు గనక B వచ్చుబోవులు గనుక 7 ADEFG అనిత్యాలు వానిని వోర్చుకొమ్ము B అనిత్యాలని తెలిసి వానిని తెలుసుకొమ్ము. 8 AD కన్నులకు చూచెడి పదార్థాలు * Dలో_చెవులకు వినవచ్చే శబ్దాలల్లాను విషయాలు ముక్కు_కు పరిమెళాలల్లాను విషయాలు నాలుకకు చౌలల్లాను విషయాలు తోలుకు అంటే పదార్థాలన్ని విషయాలు_అన్న భాగంలేదు. 9 A పరిమెళాదు లల్లాను B పరిమళాదు లెల్లా CF పరిమెళా లల్లా G పరిమళమయిన వల్లా 10 C నాలికకు EF నాలికెకు 11 C తోలుకు అందే E నాలుకకంటే G తోలునంటిన 12 A పదార్థా లల్లాను BC పదార్థా లెల్లాను E పదార్థా లల్లా 13 ADF వచ్చేవిన్ని పొయ్యేవిన్ని BE వచ్చేదిన్ని పొయ్యేదిన్ని C వచ్చేవింబొయ్యేవి G వచ్చేదిన్ని పోయేది 14 A అనిత్యాలుగనుక CE గనక అనిత్యాలు F కనక అనిత్యాలు గనక G గన్కా_ను అనిత్యాలు గన్కా_ను 15 B నీయుద్ధమందు D యుద్ధరంగమందు 16 ADG క్రూరులైన CF క్రూరాలైన 17 A తాకే నని BCEFG దాకీ నని D దాకినా 18 B విచారింపక E వారించక

## 15

యం హి న వ్యథయంత్యేతే పురుషం పురుషర్షభ
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥

వోయి [1]పురుషశ్రేష్ఠుడవైన [2]అర్జునుడా! [3]క్షత్రియుడు యుద్ధమందు[4]వచ్చే [5]సుఖదుఃఖాలు సమముగా దలచి ధీరుడై వుంటేను, వాన్ని యీ శీతోష్ణాలు సుఖదుఃఖాలు వెధబెట్టవు. [6]అతడు మోక్షానకు అర్హు డౌను.

1 ACDF పురుషశ్రేష్ఠు డైన 2 E అర్జునా! 3 G క్షత్రియుడవైయుండి 4 D లో_వచ్చే_లేదు. 5 CD సుఖదుఃఖాలను 6 BFG అతడు

## 16

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టోఽంతస్త్వనయో స్తత్త్వదర్శిభిః॥

అసత్తైన దేహానకు నిత్యత్వము లేదు. అని యీరెంటికిన్నీ నిర్ణయము [1]తత్త్వవేత్తలచాత [2]కానబడినది.

1 D తత్త్వవేదులైనవారిచాత 2 F నాభావం కానబడినది

G లో ఈ శ్లోకం లేదు.

A పూర్తిపాఠం_అసత్తైన యీదేహానకు నిత్యత్వము లేదు. సత్తైన యీఆత్మకు అనిత్యత్వము లేదు. అయినా రెంటికిన్ని నిర్ణయం తత్త్వవేత్తలచాత గానంబడునది.

E పూర్తిపాఠం_"తనదేహానకు నిత్యత్వము లేదు. సత్తైన ఆత్మకు అనిత్యత్వము లేదు" అని ఈరెంటికిన్ని నిర్ణయము తత్త్వవేత్తలచాత గానబడినది.

## 17

అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి॥

[1]యే ఆత్మతత్త్వంచాతను [2]యీప్రకృతీన్ని ప్రకృతివలన బుట్టిన[3]దేహమున్నూ [4]సర్వమున్ను వ్యాపింప[5]బడెను. అటువంటి ఆత్మతత్త్వం వినాశం [6]లేదని యెరుగుము. [7]చేటులేని ఆత్మతత్త్వానకు ప్రకృతివలన బుట్టిన [8]వకపదార్థమున్నూ వినాశం బొందింప [9]లేవు.

1 E యీ G లో_యే ఆత్మతత్త్వంచాతను యీప్రకృతీన్ని_అన్న భాగం లేదు. 2 E యీప్రకృతినిన్ని 3 E దేహమునున్ను 4 AG లలో_సర్వమున్ను_లేదు. 5 B బడును. 6 ABF లేని దని 7 A లో_చేటులేని_లేదు. 8 A దేహమున్ను వినాశం బొందింప B దేహమున్ను సర్వమున్ను వ్యాపింపబడెను. వొక పదార్థమున్ను వినాశాల బొందింప 9 ACDFG లలో_లేవు_లేదు.

G లో ఈ శ్లోకతాత్పర్యం 16 వ శ్లోకతాత్పర్యంతో కలిపి వ్రాయబడింది.

## 18

అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥

"[1]నాశరహితుడై [2]యిటువంటివాడ" నని ప్రకృతివలన బుట్టిన [3]మనస్సుచాతను, యింద్రియాలు మొదలయిన [4]వాటిచాతను యెరుగబడనివాడై, [5]నిత్యుడైన శరీరికి యీ దేహాలు అనిత్యాలు.అదిగారణానబట్టుండి వో భారతుడా! [6]వగవకయుద్ధము శేయుము.

1 D నాశరహితులై 2 ACE అటువంటివా డని BFG యిటువంటివా డని 3 E వొకపదార్థమున్ను మనస్సు యింద్రియాలు 4 ABEFG వానిచాత 5 A లో-నిత్యుడైన శరీరికి-లేదు. 6 D లో-వగవక-లేదు.

## 19

యఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥

టీ

[1]యెవ్వడేమి యీయాత్మను జంపిత(తి) నని యెరుగును, [2]యెవ్వడేనేమి [3]యీయాత్మ చచ్చె నని యెరుగును. ఆ యిద్దరున్నూ యెరిగినవారు కారు. [4]అది యెట్లంటేను నిత్యుడైన ఆత్మను వాడు [5]చంపినవాడున్నూ కాడు*

టీ A కృష్ణవాక్యం

1 ACEF యెవ్వడైనా నేమి BD యెవ్వడాయ నేమి 2 AEF యెవ్వడైనా నేమి, BD యెవ్వడాయ నేమి C లో-యెవ్వడే నేమి యీయాత్మ చచ్చెనని యెరుగును- అన్న భాగంలేదు. 3 A యీఆత్మచాత చంపబడినవాడ నని యెరుగునో E యీఆత్మ చచ్చినవాణ్ణిగా యెరుగుము. 4 A అది యెటువలె నంటేను B అది యట్లానంటేను C అది యట్టంటేను D అదే మంటేను G అ దెట్లంటేను 5 ABCEFG చంపిన వాడుగాడు. D చంపేవాడుగాడు. * A ఆయాత్మ చంపబడినవాడున్ను కాడు. అని యెరిగినవాడే యరుగును. CF ఆయాత్మను చంపబడినవాడుగాడు. D ఆయాత్మ చంపబడ్డదిగాదు. E ఆయాత్మ చంపబడేవాడున్ను గాడు. G ఆయాత్మ చంపబడిన వాడుగాడు.

## 20

న జాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥

[1]యీయాత్మ పుట్టుచున్న[2]వాడున్నూ కాడు. [3]చస్తున్న వాడున్ను కాడు, [4]వెనకకు అయ్నివాడున్నూ కాడు, [5]ముందరికిన్ని అయ్యేవాడు గాడు, [6]వెనకకు పుట్టినవాడున్నూ కాడు, [7]చచ్చినవాడున్ను కాడు, [8]ముందర పుట్టెడివాడున్ను గాడు.

అజుడై, నిత్యుడై, శాశ్వతుడై, [9]పురాణుడైన యీఆత్మ [10]శరీరం చంపబడుచుండగానున్ను, [11]తాను చచ్చేడివాడున్నూ గాడు.

1 A లో–యీ–లేదు. 2 ABCFG వాడుగాడు (ఈవచనంలో అన్ని ప్రతులలో అన్నిచోట్ల వాడుగాడు) అనే ఉంది. 3 A చచ్చుచున్న 4 B లో–వెనకకు అయ్యెవాడున్నూకాడు–అన్న భాగంలేదు. 5 ABCDFG ముందరికి 6 C వెనకపుట్టిన G లో–వెనకకు పుట్టినవాడున్నూకాడు చచ్చినవాడున్నుకాడు–అన్న భాగంలేదు. 7 A లో–చచ్చినవాడున్నుకాడు–అన్న భాగంలేదు. 8 A ముందర పుట్టగల వాడుగాడు ముందరికిన్ని పుట్టివచ్చేవాడుగాడు. అజుడై, CDFG ముందరికిన్ని పుట్టెడి చచ్చేవాడుగాడు. అజుడై, 9 B పురాణపురుషోత్తముడైన DG పురాణుడై, 10 G లో–శరీరం–లేదు. 11 A ఆయాత్మ చచ్చినవాడుగాడు. B తా చచ్చేటి వాడుగాడు. CDFG లలో–తాను–లేదు.

E పూర్తిపాఠం–యీఆత్మ పుట్టుచున్నవాడున్ను గాడు, చస్తున్నవాడుగాడు, వెనకకు అయ్యేవాడుగాడు, ముందరికి అయ్యేవాడుగాడు. అజుడై, నిత్యుడై, శాశ్వతుడై, పూర్ణుడైన యీయాత్మ, శరీరం చంపబడుచుండగాను చచ్చేవాడుకాడు.

## 21

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్॥

[1]యెవ్వడేనేమి [2]యీ జీవున్ని [3]వినాశరహితునిగాను, [4]నిత్యునిగాను, [5]అజునిగాను, [6]అవ్యయునిగాను యెరుగును. అటువంటి పురుషుడు [7]యెవ్వని జంపీని? [8]యెవ్వనిచాత జచ్చీని?

1 ADE యెవ్వడైనా నేమి 2 A లో–యీజీవున్ని–లేదు CDFG యీజీవుని E యీజీవుణ్ణి 3 A వినాశంలేనివానిగా BCDFG వినాశరహితునిగా E నాశరహితుణ్ణిగా 4 AE లలో లేదు. B నిత్యున్నిగా CDFG నిత్యునిగా 5 ABCDEFG అజునిగా 6 ADFG అవ్యయునిగా B అవ్యయున్నిగాను C అవ్యయుగా 7 ADEFG యెవ్వని జంపించీని C యెవ్వరి జంపించీని 8 ADEFG లలో–యెవ్వనిచాత జచ్చీని–అన్న భాగంలేదు. C యెవ్వని జంపీని

22

వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ॥

మనుష్యుడు [1]పాతకోకలు విడిచి. [2]కొత్త కోకలు యెటువలెనైనా నేమి [3]కట్టుకొనునో, అటువలెనే [4]దేహిన్ని [5]జీర్ణమైన శరీరాలు విడిచి. వేరే [6]కొత్త శరీరాలు ధరియించును.

1 ABCDEFG ప్రాత 2 ABCDEFG క్రొత్త 3 ABCDEFG కట్టుకొనును. 4 ACDEFG దేహి జీ...5 A జీర్ణాదులు అయిన BCEFG జీర్ణాలైన 6 ABCDEF క్రొత్త

23

నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయం త్యాపో న శోషయతి మారుతః॥

[1]అటువంటి యీ ఆత్మను [2]శస్త్రాలున్ను [3]ఛేదింపలేవు. [4]అగ్నిన్ని కాల్ప లేవు. [5]వుదకాలున్ను [6]తడపలేవు. [7]వాయువున్ను [8]శోషింప జాయలేదు.

1 ABDEF యిటువంటి 2 ACDEFG శస్త్రాలు 3 BDF ఛేదింప 4 ACDFG అగ్ని కాల్పలేదు. B అగ్నిన్ని కాల్పలేదు. E అగ్ని కాల్పలేవు. 5 ACDEFG ఉదకాలు 6 ABDEFG తడుపలేవు. C తడుపలేదు. 7 ADEF వాయువు C లో–వాయువు... లేదు–లేదు. 8 A శోషింపలేదు. F శోషింపజాయలేవు.

24

అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవ చ
నిత్య స్సర్వగతః స్థాణు రచలోఽయం సనాతనః॥

[1]ఛేదింపరానివాడై, [2]తడుపరానివాడై, [3]యెండింపరానివాడై, [4]నిత్యుడై, [5]సర్వశరీరాలయందున్ను వున్నవాడై, [6]స్థితస్వభావుడై, అచలుడై, సనాతనుడైనవాడు.

1 E యీ జీవుడు ఛేదింపరాని వాడునై 2 ABCDEFG దహింపరానివాడై తడుప 3 C లో–యెండింపరానివాడై–లేదు. 4 A లో లేదు. 5 AE సర్వశరీరాల యందు 6 ABCDEFG స్థిరస్వభా

25

అవ్యక్తోఽయ మచింత్యోఽయ మవికార్యోఽయ ముచ్యతే
తస్మా దేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥

[1]యీఆత్మ ప్రపంచం గానవచ్చినట్టు [2]వ్యక్తముగాను కానరానివాడు, [3]అటువంటివాడు యిటువంటివాడు అని చింతింపరానివాడు. అటుగనుక వికారము లేనివాడు. అదిగారణానబట్టుండి యీప్రకారాన యీయాత్మను యెరిగి, యీ యాత్మ తత్త్వము గూర్చి [4]శోకింపదగదు.

1 A యీయాసర్వాత్మ ప్రపంచం 2 ACDEFG వ్యక్తముగా 3 ACDEFG లలో_అటువంటివాడు_లేదు. 4 ABCDEFG దుఃఖింపదగదు.

26

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి॥

అథవా "నిత్యమున్ను పుట్టుచున్ను. [1]చస్తున్ను వుండెడి యీ దేహమే [2]ఆత్మ" యని తలస్తివా॰అటువలెనైనాను ఘనుడవైయుండి యింత దుఃఖింపదగినవాడవు కావు.

1 AC నిత్యమున్ను చస్తున్నుండెడి D నిత్యమున్ను చస్తు వుండెడి 2 CDE ఆత్మని

F లో ఈ శ్లోక తాత్పర్యం లేదు.

27

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మ మృతస్య చ
తస్మాదపరిహార్యేర్థే న త్వం శోచితు మర్హసి॥

పుట్టినవానికి చావు తప్పదు. చచ్చినవానికి [1]పుట్టుగు దప్పదు. [2]అటుగాన [3]పరిహరింపరాని అర్థమందు నీవు శోకింప కుండుము.

1 AE పుట్టుకా తప్పదు. CD పుట్టువ తప్పదు. G పుట్టువు దప్పదు. E పుట్టు తప్పదు. 2 CD అటు గనక 3 ACEFG పరిహరించరాని

G లో ఈ శ్లోకం లేదు.

## 28

శ్రీ భగవానువాచ

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత
అవ్యక్తనిధనాన్యేవ తత్రకా పరిదేవనా॥

[1]సమస్తమైనప్రాణా(ణు)లున్ను ఆదికాలమందు యేమైవుండిరో [2]యెరుగము. చచ్చిన వెనక యేమైవుండిరో [3]యెరుగము. [4]యిప్పుడు నడుమను వ్యక్తముగాను మనుష్యాదిదేహాలుతో టట్టు కానవస్తున్నారు. ఆయర్థమందు వగవ నేలా?

1 ABE సమస్తప్రాణు 2, 3 C యెరగం. E యెరగము. 4 AE ఇప్పుడు నడుమను వ్యక్తమై మనుష్యాదిదేహాలతో కానవస్తున్నారు. B యిపుడు నడుము మనుష్యవ్యక్తముగాను మనుష్యాది దేహాలతో కానవస్తున్నారు. C ఇప్పుడు నడుమను వ్యక్తాదిదేహాలతో మనుష్యులతో కానవస్తున్నారు. D యిప్పుడు నడ్మ వ్యక్తమైన మనుష్యాదిదేహాలతోను కానవస్తున్నారు. G ఇప్పుడు నడుమను వ్యక్తమై మనుష్యాది దేహాలతో కానవస్తున్నారు.

## 29

ఆశ్చర్యవత్పశ్యతి కశ్చి దేనం
ఆశ్చర్యవద్వదతి తథైవ చాన్యః
ఆశ్చర్యవచ్చైన మన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్॥

వకానొకడు [1]పుణ్యవిశేషాన [2]పాపరహితుడై ఆశ్చర్యం[3]వలెనుండి యీ యాత్మను చూచును. అటువంటివాడే [4]మాకొకడు (మరొకడు) యీ ఆత్మను [5]మరివకరికి [6]చెప్పుచూన్ను వుండును. [7]అటువంటివాడే [8]మరివకడు యీరీతిని [9]వినుచుండును. [10]యీరీతిని వినీన్ని, [11]కనీన్ని, పలికీన్ని, [12]వకడున్ను యీ యాత్మను యెరుగడు.

1 D పుణ్యవిశేషణం చాత 2 ACG పాపరహితుడైన వాడై 3 D వలెవుండే F వలె నుండే 4 BE లలో–మాకొకడు–లేదు. 5 A మరి వొకడికి G మరి వొకరీతి 6 A చెప్పుచుండును. B చెప్పుచు నుండును. E ఆశ్చర్యంవలె చెప్పుచుండును. 7 A అటువంటివాడై E లో–అటువంటివాడే మరివకడు–అన్న భాగంలేదు. 8 B లో

మరి వకడు_లేదు. C మరొకడు D మరివొఖడు E మరొకరు ఆశ్చర్యం వలెనే G మరియొకడు 9 BG వినుచు న్నుండును. 10 ACEFG లలో_యీ రీతిని_లేదు. 11 E లో_కనీన్ని_లేదు. 12 A యీ ఆత్మను వొకడున్ను యెరుగడె. BG వొకడున్ను యీ ఆత్మను నెరుగడు. D వొఖడున్ను యీ ఆత్మను యెరుగడె. E యీ ఆత్మను వొకడున్ను యెరగడు.

## 30

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి॥

దేహీ [1]నిత్యమున్ను [2]అవధ్యుడై సర్వదేహ(వా)దిదేహాలందున్నువున్నాడు. అదిగారణానబట్టుండి దుఃఖింప [3]నర్హుడవు.

1 A నిత్యమునకు BCDEG నిత్యమును 2 B లో లేదు. 3 ABCDEG నర్హుడవు గావు.

## 31

స్వధర్మమపి చావేక్ష్య న వికంపితు మర్హసి
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్య త్క్షత్రియస్య న విద్యతే॥

క్షత్రియుడవైన [1]నీ స్వధర్మం విచారించుకొని హింస యని వెరవవద్దు. [2]క్షత్రియునకు [3]ధర్మందప్పని యుద్ధముకంటేను [4]అన్యమైన శ్రేయస్సు మరిలేదు.

1 B నీవు 2 ABDEF క్షత్రియునికి 3 E ధర్మమైన యుద్ధానకంటేను 4 E అవ్యయమైన

## 32

యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధ మీదృశమ్॥

[1]తనంతనే యెరుగగా (యెదురుగా) [2]వచ్చినదై, తెరచిన స్వర్గద్వారమున్ను అయినటువంటి యుద్ధమును, [3]పుణ్యులైనటువంటి క్షత్రియులు పొందుదురు.

1 D అంతనే E తనంతినే తానే 2 AC వచ్చిన దైన్నై F వచ్చినదిన్నియై 3 ABCDEFG పుణ్యులైన క్షత్రియులు

33

అథ చేత్త్వం ధర్మ్య మిమం సంగ్రామం న కరిష్యసి
తత స్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాప మవాప్స్యసి॥

[1]అటుగాక, [2]యీ ధర్మందప్పని [3]యీదుకొన్న (యీదొరకొన్న) [4]యుద్ధమందున్ను శాయకుండితివా? క్షత్రియధర్మమున్ను, కీర్తిన్ని [5]విడిచి [6]పాపము బొందేవు.

1 E యిట్లాగాక 2 E యీ దొరకొన్న ధర్మముదప్పని యుద్ధమును 3 ABD యీ దొరకొన్న 4 ADF యుద్ధము BCEG యుద్ధమును 5 F వీడి 6 AB పాపమును

34

అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్
సంభావితస్య చాకీర్తి ర్మరణా దతిరిచ్యతే॥

అంతమాత్రమేకాదు; [1]సమస్తభూతాలున్ను చడనటువంటి [2]నీయొక్క అప కీర్తి [3]చెప్పుకొనియెదరు, అపకీర్తి చెప్పుకొంటేను [4]నా కే మంటివా? [5]అందరి లోపలాను పూజ్యుడైనవానికి వచ్చిన అపకీర్తి [6]మరణముకంటేను అధికమైనది.

1 C సమస్తమైన భూతాలు 2 AE నీయొక్క అపకీర్తిన్ని B నీ యపకీర్తి GF నీయొక్క అపకీర్తిని 3 C చెప్పుకొనెదరు, DE చెప్పుకునేరు. 4 AEF నాకేమి యంటివా? 5 G అందరిలోనా 6 ABCDEFG మరణాన

35

భయాద్రణాదుపరతం మన్యంతే త్వాం మహారథాః
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥

[1]మహారథులైనవారు [2]నిన్నును భయంవల్లను రణము శాయక మానినవానిగా దలతురు. యేమహారథికులచాత* [3]బహుమానం బొందినవాడై యుండి [4]యిటమీద య(ట) లాఘవం బొందేవు.

1 B మహారథు లయినవారున్ను 2 ADE నిన్ను B లో లేదు. 3 A అవ మానము బొందనివాడై యుండి E నీవు బహుమానము పొందినవాడవై యుండి 4 ACE యిటమీదట లాఘవం DF యిటమీదను లాఘవం *B లో_అరీతిని

ఆడించుకునేటందుకంటేను ఘనమైన దుఃఖము మరేమున్నది? అని తాత్పర్యం పూర్తి చేయబడింది. ఇది 36వ శ్లోకతాత్పర్య భాగం.

36

అవాచ్యవాదాంశ్చ బహూ న్వదిష్యంతి తవాహితాః
నిందంత స్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥

నీయొక్క శత్రువులు [1]నీ సామర్థ్యము నిందిస్తున్నవారై ఆడరాని[2]మాట లాడుదురు. [3]శత్రువులచాతను [4]ఆడించుకొనేదానికన్నాను ఘనమైన దు[ః]ఖం మరే మున్నది?

1 A నీ సామర్థ్యమును D నీ సామార్థ్యం 2 D మాటలు ఆడుకుందురు. 3 E ఆ రీతిని నీ శత్రువులచాత D శత్రువులు ఆడగాను వారిచాత 4 A ఆరీతిని ఆడించుకొనేయందుకంటేను ఘనమైనదుఃఖము మరి యేమివున్నది గనక? B ఆరీతున ఆడించుకునేటంత కంటేను ఘనమైన దుఃఖము మరేమున్నది? C ఆరీతిని ఆడించుకొనే అందుకంటేను ఘనమైన దుఃఖము మరేమున్నది? లేదు. D ఆడించుకునే అంతకంటేను ఘనమైన దుఃఖం మరియేమివున్నది? E నాడించు కొనేటంగుకంటేను ఘనమైన దుఃఖము మరేమున్నది? F ఆరీతిని ఆడించుకొనే అంతకంటేను ఘనమైన దుఃఖము మరే మున్నది? G ఆరీతిని ఆడించుకుని అంతకంటేను ఖనమైన దుఃఖము మరేమి?

37

హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్
తస్మా దుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః॥

[1]యుద్ధముచేః [2]చస్తేను స్వర్గం బొందేవు. [3]గెలిస్తివా భూమి యేలేవు. అటుగనుక. క్షత్రియుడవైన నీస్వధర్మమైన [4]యుద్ధానకు [5]నిశ్చయించుకొని [6]లెమ్ము.

1 ABCDEFG లలో–యుద్ధము చేశి–లేదు. 2 BD చస్తే 3 AC గెలిస్తేను 4 B యుద్ధము కొరకు 5 B యుద్యోగింపుము 6 B లో లేదు.

E పూర్తిపాఠం—చస్తేను స్వర్గం పొందేవు. గెలిస్తివా భూమి యేలేవు. అటుగనుక, కుంతీపుత్రుడైన నీకు[వు] క్షత్రియ ధర్మమైన యుద్ధానకు నిశ్చయించుకుని లెమ్ము.

38

సుఖదుఃఖౌ సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి॥

ఆత్మజ్ఞానం[1] గలిగి, సుఖదుఃఖాలున్ను, లాభాలాభాలున్ను, జయాపజయాలున్ను సమంచేసుకొని, [2]అంతమీదటను యుద్ధముకొరకు [3]వుద్యోగింపుము. [4]యిట్లైతేను [5]పాపం బొందే(ద)వు.

1 E కలిగిన వాడవై 2 A అంత మీదట C అట మీదట D అటు మీదట F అంతట మీదట G అంతె మీదను 3 AD వుద్యోగించుము. CF వుద్యోగించు. G ఉద్యోగించి 4 A యిటువలెనైతేను CF యిట్లైతే G న ట్లైతేను 5 E పాపమును బొందవు C పాపము బొందదు.

B లో ఈ శ్లోక తాత్పర్యం లేదు.

39

ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాం శృణు
బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి॥

యీబుద్ధి యింతవట్టున్ను [1]జ్ఞానయోగనిమిత్తమై చెప్పబడెను. కర్మయోగ మందలి బుద్ధి వినుము. [2]యేదైనానేమి [3]నే జెప్పిన బుద్ధిని వుండినవాడవైతివా కర్మబంధమును విడిచేవు.

1 B జ్ఞానము యొరగే నిమిత్తమై E జ్ఞానం యోగనిమిత్యమై G జ్ఞాన యోగమె 2 ABCDFG లలో-యేదైనానేమి-లేదు. B యేదేనేమి 3 A యీ నే జెప్పిన DF యే నే జెప్పెడి E యీ నే జెప్పే బుద్ధితో కూడినవాడవైతివా వోయి అర్జునా! కర్మ బంధమును విడిచేవు.

B లో ఈ శ్లోకం లేదు.

40

నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

యిటువంటి కర్మయోగమందు [1]దొరకొని కడముట్టా జాయలే దనే దోష మున్ను లేదు. [2]ప్రత్యవాయమున్ను లేదు. యిందులోను [3]ఆ త త్త్వమైన [4]అను ష్ఠానమున్ను, మహాభయమును [5]దాటించును.

1 C లో లేదు. D దొరక్కొని E దొరకొనేవాని 2 E చేసినకర్మానకు నాశన మున్ను లేదు. G లో లేదు. 3 ACDFG అల్పమైన E స్వల్పమైన 4 G అనుష్ఠానం వల్లను 5 C వే దాటించును. E రక్షించును.

B లో ఈ తాత్పర్యం లేదు.

## 41

వ్యవసాయాత్మికా బుద్ధి రేకేహ కురునందన
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

ఫలము[1]గోరక మోక్షార్థియైనవాడు చేశే [2]యోగానకు నిశ్చయరూపమైన బుద్ధి [3]వక్కటి. కామ్యకర్మాలు చేశే నిశ్చయ[4]రహితులైన [5]*వార్ల బుద్ధులు అనంతాలున్ను [6]బహుశాఖా(ఖ)లున్ను నై వుండును.

1 E గోరకే 2 AEF కర్మయోగానకు B కర్మయోగంకొరకు CG కర్మయోగానను 3 AE వొక్కటే B యొక్కటి CG యొక్కటే 4 B రహితమైన 5 Dవారు* తర్వాతిభాగం లేదు. తర్వాత 42 వ శ్లోకతాత్పర్యం వ్రాసినాడు. 6 ABEFG బహుశాఖలునై౨

B లో ఈ శ్లోకం లేదు.

## 42

యామిమాం పుష్పితాం వాచం ప్రవదం త్యవిపశ్చితః
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతి వాదినః॥

[1]అ(అ)నిశ్చయరహితులైన [2]కామ్యకర్మలు యెటువంటివా రంటేను॥ పుష్పిత [3]వాక్యాల [4]జెప్పుచున్నవారై రి, [5]పరహితులై వేదాలందు జెప్పే [6]కామ్యకర్మాలే మంచి [7]దని [8]వాదిస్తున్నవారై, యింతకంటే [9]అన్యము [10]లేదంటున్నవారై.

1 D లో_అనిశ్చయరహితులైన_లేదు. 2 ACDFG కామ్యకర్మపరులు B కామ్యపరులు 3 BCF వాక్యాలు G వాక్కులు 4 ABDG చెప్పుచున్నవారై 5

ABCDG వివేకరహితులై 6 C కామ్యకర్మలే 7 ABCDFG వని 8 A పాటిస్తున్న వారై 9 C పుణ్యము 10 G లేదనుచున్నవారై

E పూర్తిపాఠం—నిశ్చయరహితులై, వేదాలందు చెప్పే కామ్యకర్మాలే మంచి మంచి దని వాదిస్తున్నవారై, యింతకంటె మరి వొకటి లేదని మందలిస్తున్న వారై.

D లో ఈ శ్లోకతాత్పర్యం వెనుకటి శ్లోకతాత్పర్యంతో కలిపి వ్రాసినాడు.

## 43

కామాత్మాన స్స్వర్గపరా జన్మకర్మ ఫలప్రదామ్
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥

[1]కోరికలందే [2]మనస్సుగలవారై, స్వర్గపరులై, [3]ఆ స్వర్గఫలానుభవంబు దీరిన వెనుకను, [4]పుట్టుగులున్ను, కామ్యకర్మాలున్ను, [5]అనెడి ఫలము నిచ్చెడిదై, భోగైశ్వర్యగతింగూర్చి చెప్పెడి క్రియావిశేషాలచాతను, బహుళమైనటువంటి [6]పుష్పిత వాక్యములున్ను [7]పలుకుచుందురు.

1 A కోరిక లంటే 2 ACFG మనస్సుదగిలినవారై 3 ADEG ఆస్వర్గానుభవము C త్రైస్వర్గాదిభేదం 4 C పుట్టుకలున్ను D పుట్టువులున్ను 5 B అనెడి ఫలాల నిచ్చెడిదిన్నై E అనేకఫల మిచ్చేటిదై 6 ADF పుష్పితవాక్కును BG పుష్పిత వాక్కులు C పుష్పితవాక్కుచాతను E పుష్పితవాక్యాలు 7 ABEF పలుకు చుండుదురు C పలుకుచు నుండుదురు G పలుకుచున్నుందురు.

D లో ఈతాత్పర్యం వెనుకటి శ్లోకంక్రింద వ్రాయబడింది.

## 44

భోగైశ్వర్య ప్రసక్తానాం తయాపహృతచేతసామ్
వ్యవసాయాత్మికాబుద్ధి స్సమాధౌ న విధీయతే॥

[1]భోగాలందున్ను, [2]అయిశ్వర్యాలందున్ను, [3]తగులుపడి, [4]స్వర్గఫలముగా జెప్పి, [5]పుష్పితవాక్కులచాతను [6]మనస్సు [7]గలిగి, ఆత్మజ్ఞాన [8]మెల్లాను చెడివుండు గనుక, వారికి [9]నిశ్చయమైన [10]బుద్ధి, ఫలముగోరని [11]కర్మానుష్ఠానమందు వక్కప్పుడున్ను వుండదు.

1 AE భోగాలయందున్ను 2 AE అయిశ్వర్యాలయందున్ను, 3 AEFG తగులువడి 4 ABCDEFG స్వర్గమే ఫల 5 ACDE పుష్పితవాక్కు_చేత 6 E అపహరించబడ్డ మనస్సు 7 ABCF కలిగి, E గలవారికి 8 CDG మల్లాను 9 ADEF నిశ్చయరూపమైన 10 F లో_బుద్ధి_లేదు. 11 AG కర్మానుష్ఠానమందున్ను, D కర్మానుష్ఠానజ్ఞానమందు

D లో ఈతాత్పర్యం వెనుకటి శ్లోకంక్రింద వ్రాయబడింది.

45

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

యీ [1]కామ్యకర్మాలున్ను వేదాలే [2]చెప్పే నంటివా? వేదాలు త్రైగుణ్య విషయాలు. యిటనగా [3]యేమనుట అంటేను? [4]సాత్వికులకు, రాజసులకు, తామసులకున్నూ తగిన [5]ధర్మాలను [6]వేదాలు చెప్పుచుండు ననుట. యీ [7]త్రిగుణాలకున్నూ లోనుగాక, శుద్ధసాత్వికుడవై, [8]వోయి [9]అర్జునుడా! ద్వంద్వా లనే పేరుగల చలువ కున్నూ, వేడికిన్నీ, సుఖానకున్ను, దుఃఖానకున్ను [10]లోను గానివాడై, యోగక్షేమ మనే పేరగల [11]ద్రవ్యార్జనమున్ను చేశే ననక, [12]ఆత్మజ్ఞానవాను(ను) డవు గమ్ము.

1 ACEFG కామ్యకర్మాలను D కామ్యకర్మాలు 2 F చెప్పిన దంటివా? 3 D యేమంటేను? 4 ACDFG సాత్వికులకు, రాజసులకు, తామసులకు E సాత్వికరాజసతామసులకు 5 CDG ధర్మాలు 6 D లో_వేదాలు_లేదు. 7 CDG త్రిగుణాలకు లోను 8 ACEFG లలో_వోయి_లేదు. 9 A అర్జునుండా! E అర్జునా! 10 ACDEFG లోను గానివాడవై 11 ABCDEFG ద్రవ్యరక్షణమున్ను సేసే 12 A ఆత్మజ్ఞానము గలవాడవు

B పూర్తిపాఠం_యీకామ్యకర్మాలను వేదాలే చెప్పే నంటివా? వేదాలు త్రైగుణ్యవిషయాలు. యిటనగా యేమనుటా అంటేను? సాత్వికులకు, రాజసులకు, తామసులకున్ను తగిన ధర్మాలను వేదాలు చెప్పాచునుండును. యీత్రైగుణ్యాలకున్న లోను గానివాడవై, యోగక్షేమ మను పేరగల ద్రవ్యార్జనమున్నూ, ద్రవ్యరక్షణమున్నూ చేసే ననక ఆత్మజ్ఞానవాను(ను)డవు గమ్ము.

D లో ఈతాత్పర్యం వెనుకటి శ్లోకంక్రింద వ్రాయబడింది.

46

యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే
తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః॥

[1]అయితేను [2]వేదోక్తం [3]విడువ వచ్చునా? అంటివా? [4]నిండానీ ళ్లుండే [5]మడుగులోను దప్పిగొన్నవాడు [6]తగినన్నే [7]పుచ్చుకొనును. అటువలెనే జ్ఞానియైన [8]బ్రాహ్మణుడు [9]సర్వవేదాలందున్ను [10]తనకు [11]మోక్షవిరోధముగాక తనకు దగిన [12]పుణ్యమే [13]పుచ్చుకొనుట.

1 BF అయితే D అయితేనేమి G యిటయితేను 2 E వేదోక్త మార్గాలను 3 D విడువరా దంటివా? F విడువవచ్చునా అంటే? 4 A నిండా నీళ్లువున్న B నిండా వుండే D నీళ్లు వుండే G నిండానీళ్లు వుండెడి 5 E మడుగులోపలను 6 E నీళ్లు తాగేనిమిత్తం ఎంతమాత్రం నీళ్లను 7 ACDEFG తీసుకొనును. 8 ADFG బ్రాహ్మణునికి 9 C సర్వవేదాలున్ను E సమస్తమైన వేదాలందును 10 EG లలో లేదు. 11 E మోక్షధర్మముకావలసింది. అందుకు విరోధములేకుండా జేసి తనకు దగిన G మోక్షవిరోధముగాక వుండి 12 ABDG అర్థమే C ధర్మమే E ధర్మమునే F సర్థమే 13 B పుచ్చుకొనేది. CDF పుచ్చుకొంట. G పుచ్చుకొను నునుట.

D లో ఈ తాత్పర్యం వెనుకటి శ్లోకం క్రింద వ్రాయబడింది.

47

కర్మణ్యేవాధికార స్తే మా ఫలేషు కదాచన
మా కర్మఫలహేతుర్భూ ర్మా తే సంగోఽ స్త్వకర్మణి॥

అటువలెనే [1]మోక్షాధికారియైన నీకు, [2]మోక్షవిరోధముగా[ని] [3]కర్మమందు అధికారం గలుగని [4]ఫలమందు వకప్పుడున్ను అధికారం వద్దు. కర్మము చేశేవాడేను [5]ఫలం అనుభవించేవాడు గనుక, [6]ఆరెంటికి [7]కారణ మనే [8]బుద్ధి వద్దు.యింతకంటే ఆ కర్మమే [9]మానుమంటివా? [10]కర్మము [11]మానరాదు.

1 ABDEF మోక్షాధికారివైన G మోక్షకారివైన 2 CF మోక్షవిరోధిగాని DG మోక్షవిరోధంగాని 3 ABCDEF కర్మమందే G ధర్మమందే 4 E ఫలాలందే 5 ABCE ఫలము ననుభవించేవాడ D సుఫల మనుభవించే వాడు E ఫలము లనుభవించే వాడ G ఫల మనుభవించేవాడు 6 ABCDEF ఆరెంటికిన్ని G ఆరొంటికిన్ని

7 ABCDEG నేనే కారణ 8 A మనిబుద్ధి 9 ABCG మానుదునంటివా? F మాను మనంటివా? 10 C కర్మమున్ను 11 G మానదా.

D లో ఈశ్లోక తాత్పర్యం పూర్వశ్లోకం క్రింద వ్రాయబడింది.

48

యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే॥

యోగనిష్ఠుడవై, ఫలసంగం [1]విడిచి, వోయి [2]అర్జునుడా: [3]ఫలం శి(సి)ద్ధించి నప్పుడున్నూ సముడవై [4]కర్మములు శేయుము. [5]యోగ మనగా [6]యెద్ది అంటివా: ఆ చేశేది (చేసెడి) కర్మఫలముయొక్క పిద్ధియందున్ను సముడవై [7]యుండుటే యోగము.

1 E వీడి 2 E అర్జునా! 3 AF ఫలము శిద్ధించినప్పుడున్ను, శిద్ధించనియప్పుడున్ను BE ఫలం సిద్ధించినపుడున్ను, సిద్ధించనపుడున్ను C ఫలము సిద్ధించునప్పుడున్ను సముడవై G ఫలము సిద్ధించనప్పుడున్ను, శిద్ధించినప్పుడున్ను 4 AE కర్మము శేయుము C కర్మములు శేయి. F కర్మములు సేశేయి. 5 C యోగ మనగాను 6 BF యేది అంటివా? G న్యేంది అంటివా? 7 E యుండుట F యుందేదే

D లో ఈతాత్పర్యం లేదు.

49

దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగా ద్ధనంజయ
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః॥

[1]యీ ఫలమందు దేవుడే అనే అటువంటి బుద్ధియోగాన జేశి కర్మముకంటె [2]అన్యమైనటువంటి కామ్యకర్మము [3]అధమమైనది. అటుగనుక, యీ చెప్పిన బుద్ధి యందే నిలుకడై వుండుము. కామ్యకర్మాలు చేశేవారు [4]కృపణులు. [5]కృపణులనగా [6]అధమసంసారు లనుట.

1 A యీఫలంవాడు దేవుడు అనేది యీబుద్ధియోగాన జేసి కర్మము కంటేను B యీఫలమువాడు దేవుడే అనేటటువంటి బుద్ధియోగాన శేశే కర్మముకంటేను CF యీఫలమువాడు దేవుడు అనే యీబుద్ధియోగానం జేశి కర్మముకంటేను D యీఫలమువాడు దేము డనే బుద్ధియోగాన కర్మము చేసు

ఆశారహితుడై చిత్తమున్ను యింద్రియాల నియమించి, ప్రకృతి [1]పదార్థాల వలన [2]మమతలేనివాడై, [3]కేవలమైన, శరీరసంబంధమైన [4]కర్మము చేస్తున్నా, ఆమహాత్ముడు కిల్బిషం బొందడు.

1 ACDEF పదార్థాలయందు 2 D మమత లేక 3 E కేవలశరీర 4 A కర్మముసే

22

యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే॥

తనంతనే వచ్చిన లాభాన సంతోషించుకొని, వుచితమైన [1]కర్మమును [2]చేశి యప్పుడు [3]శీతోష్ణాలను సహించినవాడై, సుఖదుఃఖాలు వస్తేను, [4]తన కర్మాలను [5]వచ్చె నింతే అని, [6]వకరితోను [7]మచ్చరములేనివాడై, కర్మానుష్ఠానఫలం సిద్ధించు నప్పుడున్నూ, [8]సముడైనవాడై కర్మము చేశిన్ని [9]కట్టుపడడు.

1 ABCDEF కర్మము 2 BD చేశేటప్పుడు 3 ACDF వచ్చిన శీతోష్ణాలను B శీతోష్ణాలకు 4 DE తన కర్మాన 5 C వచ్చి నింతే అని D వచ్చె నని 6 AEF వొకరితో D వకరిమీద 7 ABCDF మత్సరము లేనివాడై 8 AE శిద్ధించని యప్పుడున్ను సముడైనవాడు BCD శిద్ధించ నప్పుడున్ను సముడైనవాడు 9 ACEF కట్టువడడు.

23

గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే॥

[1]ఆత్మజ్ఞానం మనస్సుగలవాడై, యితరసంగం విడిచి, [2]రాగద్వేషాదినిర్ముక్తు [డై], యజ్ఞానుష్ఠానంకొరకు ద్రవ్యార్జనాదికర్మము చేశినవానికి, సర్వమైన పూర్వ కర్మమున్నూ క్షీణించి పోవును.

1 A ఆత్మజ్ఞానంతోటి మఃసు BCDF ఆత్మజ్ఞానంతోడి మనస్సు E ఆత్మజ్ఞానముతో మనస్సు 2 ABCDF రాగద్వేషాదివినిర్ముక్తుడై E రాగద్వేషాదులు లేక

24

బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా॥

యజ్ఞసాధనమున్నూ [1]బ్రహ్మవలన బుట్టినది గనుక బ్రహ్మమే. [2]హవిస్సున్ను [3]బ్రహ్మమున బుట్టింది గనుక బ్రహ్మమే. [4]బ్రహ్మయ(భూ)తమైన [5]యందు పరమకర్తయైన [6]బ్రహ్మముచాతను వేల్వబడెను అని చేశినకర్మము బ్రహ్మ [7]కర్మమే. [8]ఆబ్రహ్మకర్మసమాధిచాతను పొందదగిందీన్ని బ్రహ్మమే.

1 AB బ్రహ్మమువల్ల DEF బ్రహ్మవల్ల 2 B లో-హవిస్సున్ను బ్రహ్మమున బుట్టింది గనుక బ్రహ్మమే-అన్న భాగం లేదు. 3 A బ్రహ్మమువల్న C బ్రహ్మవల్న EF బ్రహ్మవల్ల 4 ABCDEF బ్రహ్మభూతమైన 5 ABCDEF అగ్నియందు 6 BCDEF బ్రహ్మచాత 7 A కర్మము BD కర్మ CEF కర్మం 8 BD లలో-ఆ-లేదు.

25

దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే
బ్రహ్మాగ్నా వపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥

కొందరు [1]యోగీశ్వరులు దైవమే యజ్ఞముగా నుపాస్తి శేయుదురు. [2]యిటనగా [3]దేవతాపరాయణు [4]లౌదు రనుట. [5]మరీకొందరైతేను,

1 F యోగీశ్వరులై 2 A యిటనంగాను B యిట్లనగా 3 A యజ్ఞపరాయణు 4 A లౌదు రంటేను. ఈప్రతిలో ఇంతవరకే ఉంది. B లౌదు రంట. C లౌదురంట. ఈప్రతిలో ఇంతవరకే ఉంది. D లనుట. E లౌదురు అనుట. F లౌదు రంట. 5 B మరికొందరు బ్రహ్మమాసమైన అగ్నియందు యజ్ఞరూపమైన హరి(హవిస్సు)చాత హోమం శేయుదురు. యిటనగా యజ్ఞపరాయణు లౌదు రంట. మరికొంద రైతేను, D మరికొంద రైతేను, బ్రహ్మరూపమైన అగ్నియందు యజ్ఞరూపమైన హవిస్సుచాతను హోమం శేయుదురు. యిటనగా యజ్ఞపరాయణు లనుట. E మరికొంద రైతేను బ్రహ్మరూపమైన అగ్నియందు యజ్ఞరూపమైన హవిస్సుచాతను హోమం శేయుదురు. యిటనగాను యింద్రియవిరక్తులై వుందు రనుట. యజ్ఞపరాయణు లౌదు రనుట. F మఱికొంద రైతేను బ్రహ్మరూపమైన అగ్నియందు యజ్ఞరూపమైన హవిస్సుచేతను హోమం శేయుదురు. యిటనగా దేవతాపరాయణమైన యజ్ఞపరాయణు లౌదు రనుట. G మరికొంద రైతేను బ్రహ్మరూపమైన అగ్నియందు యజ్ఞరూపమైన హవిస్సుచాతను యజ్ఞం శేయుదురు. యిటనగా యజ్ఞపరాయణు లనుట.

26

శ్రోత్రాదీ నింద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి
శబ్దాదీ న్విషయా న్యన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి॥

[1]శ్రోత్రాదియింద్రియాలను సంయమ మనే అగ్నియందు హోమం శేయుదురు. [2]యిటనగాను యింద్రియజయంతోను వుంద రనుటాను. [3]మరీకొందరు శబ్దాదివిషయాలను యింద్రియా లనే అగ్నియందు హోమం శేయుదురు. [4]యిటనగా [5]విషయావిషయవిరక్తులై [6]వుంద రనుట.

1 ACDE మరిన్ని కొందరు శ్రోత్రాదింద్రియాలను B శ్రోత్రాదియింద్రియాలనున్ను 2 AC యిటనంగాను 3 ABCDEF మరికొందరు 4 ABDEG యిటనంగా CF యిషనగాను 5 ABDE విషయవిరక్తులై C విషయవిరక్త లౌదురంట. F యింద్రియవిరక్తులై 6 AE వుండురు రనుట.

27

సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే॥

[1]మరీకొందరు సర్వమైన యింద్రియ[2]కర్మాలున్ను. [3]ప్రాణకర్మాలున్ను. జ్ఞానదీపితమైన [4]మనస్సంయమ[మ]నే [5]మనోయోగాగ్నియందు హోమం శేయుదురు. [6]యిటనగాను [7]మనస్సును [8]యింద్రియాలవెంట [9]బారకుండాను నిలుపుదురనుట.

1 A మరిన్ని కొందరు BCEF మరికొందరు 2 ACDEF కర్మాలనున్ను 3 AE లలో - ప్రాణకర్మాలున్ను - లేదు CDF ప్రాణకర్మాలనున్ను 4 AB సంయమ మనే CDF మనస్సంయమన మనే E ఆత్మసంయమన మనే 5 A యోగాగ్నియందును BCDEF యోగాగ్నియందు 6 AB యిటనంగాను D యిటనగా 7 C మనస్సు 8 ABC యింద్రియాదులవెంట 9 BCDE బారకుండా

28

ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః॥

[1]కొందరు [2]ద్రవ్యయజ్ఞాలు శేయుదురు. కొందరు [3]తపోయజ్ఞాలు శేయుదురు. కొందరు యోగ[4]యజ్ఞాలు శేయుదురు. కొందరు స్వాధ్యాయ[5]యజ్ఞాలు శేయుదురు. కొందరు జ్ఞాన[6]యజ్ఞాలు శేయుదురు. [7]వీరు దృఢవ్రతులైన యతులు.

1 DF కొందరు కొందరు 2 D లో - ద్రవ్యయజ్ఞాలు శేయుదురు కొందరు - అన్నభాగం లేదు. 3 B లో-తపోయజ్ఞాలు శేయుదురు కొందరు- అన్నభాగం లేదు. 4 ABCF యజ్ఞము 5 ABCDEF యజ్ఞములు 6 ABCDF యజ్ఞం 7 G వీర అల్లాను

29

అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః॥

మరికొందరు అపానమందు [1]ప్రాణములు వేల్తురు. [2]యిటనగాను పూరించుట. [3]ఆప్రాణమందు [4]ప్రాణములు (అపానం) వేల్తు రనగా రేచకము. మరికొందరు [5]ప్రాణాపానాలను [6]అడ్డబెట్టి [7]ప్రాణాయామపరాయణులై.

1 ABDE ప్రాణమును 2 DF అనగాను 3 ABD అపానమును C అపానమున్ను E ఆ తీరుననే అపానమును F ప్రాణము(న)ను 4 ABCDE ప్రాణమందు F అపానం 5 AEF ప్రాణాపానాల 6 ACDF రెంటినిన్ని అడ్డపెట్టి 7 D ప్రాణాయామపరాయణులై వుందురు. E ప్రాణాయామపరాయణులై యుందు రనుట.

30

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి
సర్వేప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః॥

అల్పాహారులై, ప్రాణాలను [1]ప్రాణాలందు హోమం చేశి, కుంభకపరులై [2]వుండుదురు. యీచెప్పిన యజ్ఞవేత్త [3]లిందరున్నూ యజ్ఞంచాతను [4]పాపరహితులై.

1 ABCDE ప్రాణాలందే 2 BCD వుందురు. E యుందు రనుట. 3 C లిందరును EF అందరున్ను 4 A పాపరహితులు E పాపరహితులై యుందు రనుట.

31

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ॥

యజ్ఞశేషమైన [1]అన్నం భోజనం చేశినవార్లే, సనాతనమైన [2]బ్రహ్మం పొందుదురు. యిటువంటి యజ్ఞానుష్ఠానం వకటిన్నీ లేనివానికి [3]యిహాలోకమే లేదు. [4]వో యర్జునుడా! [5]పరలోక మెక్కడది?

1 A అన్నమును B లో లేదు. 2 B బ్రహ్మమును E బ్రహ్మన్ని 3 A యిహాలోకమున్ను E యిహాలోకము 4 B లో లేదు. E వోయి అర్జునా! 5 A పరలోకం లేదు వానికి. C పరలోకమున్ను యెక్కడిది? DG పరలోకము యెక్కడిది?

32

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే
కర్మజా న్విద్ధి తా న్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే॥

[1]యీరీతి బహుప్రకారాలైన, కర్మయోగాలైన యజ్ఞాలు, బ్రహ్మయొక్క ముఖమందు విస్తరింపబడినవై, ఆత్మజ్ఞానాన కది సాధనమై వుండును. యివి యిన్నీన్ని [2]నిత్యనైమిత్తికరూపమైన [3]కర్మజాలుగా నెరుగుము. [4]యీరీతిని యెరిగి కర్మానుష్ఠానము చేస్తివా [5]మోక్షమును [6]బొందేవు.

1 ACDEF ఈరీతిని 2 B నిత్యనైమిత్తిక కర్మరూపమైన 3 B కర్మాలుగా D కర్మంబులుగా 4 BCF యీరీతి 5 BCDEF మోక్షం 6 F బొందెదవు.

G లో ఈశ్లోకతాత్పర్యాలు లేవు.

33

శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరంతప
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే॥

[1]వో యర్జునుడా! ద్రవ్యమయమైన [2]యజ్ఞంకంటేను, [3]జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠము. సమస్తమైన కర్మానుష్ఠానమున్ను, జ్ఞానపూర్వకమై చాయబడుచున్నా జ్ఞానమందే పరిసమాప్తింపబడును.

1 E వోయి అర్జునా! 2 E యజ్ఞమునకంటేను 3 ABCDEF జ్ఞానయజ్ఞము

34

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥

[1]ఆయొక్క [2]జ్ఞానమును [3]తత్త్వదర్శనులైన జ్ఞానులు నీకు వుపదేశించేరు, గనుక వారికి దండం బెట్టుటచాతను, [4]సేవ చేసుటచాతను, [5]అడుగుటచాతను యెరుగుకొమ్ము.

1 ACDEF లలో– ఆయొక్క– లేదు. 2 E అజ్ఞానముచు F అజ్ఞానము 3 CD తత్త్వదర్శులైన F తత్త్వదర్శనులైనటువంటివారు జ్ఞా 4 B లో– సేవచేసుటచాతను– లేదు. 5 A లో– అడుగుటచాతను– లేదు. 6 B యెరుగుము.

35

యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్య స్యాత్మన్యథో మయి॥

[1]యేజ్ఞానమునేమి యెరిగి యిటువంటి [2][అ]జ్ఞానము [3]మరిపొందే(ద)వు; [4]ఆతర్వాతను యేజ్ఞానముచాతను [5]సమస్త భూతాలను [6]నీవంటివారిగానే నీయందే తెలిశేవు; [7]ఆ తరువాతను నాయందున్ను నావంటివారిగానే తెలిశేవు.

1 A యేజ్ఞానమును యెరిగి D యేజ్ఞానమును అయినానేమి నెరిగి E యీజ్ఞానమునేమి యెరిగి F యేజ్ఞానమునేని యెరిగి 2 ABCD అజ్ఞానమును 3 ABCD మరిపొందవు; 4 A లో–ఆతర్వాతను–లేదు. BCE ఆతరవాతను 5 A సమస్తమైన భూతాలను 6 A నీవంటివారిగాను BD నీవంటివారినిగాను 7 ADE ఆతర్వాతను BC ఆతరవాతను

36

అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి॥

యిటువంటిజ్ఞానం గల్గితేను [1]యింతపాపకర్ములకంటె [2]కర్మడ వైను,నా సర్వమైన [3]పాపమున్ను అనెడి [4]సముద్రమును [5]జ్ఞాన మనెడి తెప్పచాతను దాటేవు.

1 ABCDEF యంత 2 ACDEF కంటేను 3 A పాపమనియెడి D పాతకమనేటి 4 C సముద్రమున్ను 5 ACE జ్ఞానమనే B జ్ఞానమనెడు D జ్ఞానమనేటి

37

యథైధాంసి సమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా॥

ఓ యర్జునుడా! [1]ప్రజ్వరిల్లేఽగ్ని [2]సమిదెల [3]నేరీతి భస్మం చేసును; అటువలెనే [4]జ్ఞానమనే అగ్నిచాతను సర్వకర్మములను భస్మం చేసును.

1 ADE ప్రజ్వలించెడి B ప్రజ్వరించేటి CF ప్రజ్వలించే 2 ABDE సమిథల C సమిధెలను F సమిధ 3 ABDEF నేరీతిని C యెటువలెనె 4 A జ్ఞానాగ్ని సర్వకర్మములాను B జ్ఞానమనెడి అగ్ని దాను సర్వకర్మములాను C జ్ఞానాగ్ని సర్వకర్మాలున్ను DF జ్ఞానాగ్ని సర్వకర్మములా E జ్ఞానాగ్ని సర్వకర్మాలా

38

న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే
తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి॥

జ్ఞానముతో [1]సరై [2]పవిత్రమైన వస్తువు యీలోకమందు [3][లేదు]. నీవే కర్మయోగము సిద్ధించిన [4]వెనకను కాలంచాతను [5]నీయందే యెరిగేవు.

1 ABD సరియైన CEF సరియై 2 BCDEF పవిత్రకరమైన 3 ABCDEF లేదు నీవే 4 ADEF వెనుక C వెనక 5 D నీచే యెరిగేవు. G నీయందే తెలిశేవు.

39

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః
జ్ఞానంలబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి॥

[1]శ్రద్ధావంతుడైన తత్పరుడే [2]యింద్రియనియమాదులుగలవాడు జ్ఞానం బొందును.*

1 ABCEFG శ్రద్ధావంతుడై తత్పరుడై D శ్రద్ధావంతుడై తత్త్వపరుడై 2 B యింద్రియనియమంగలవాడు D యింద్రియ నిగ్రహం కలవాడు E యింద్రియ నియమమునుగలవాడు

* A లో సంశయాత్మునికి యిహాలోకమున్ను లేదు; పరలోకమున్ను లేదు; సుఖమున్ను లేదు– అన్న భాగం ఎక్కువగా ఉంది. ఇది 40వ శ్లోక తాత్పర్యం లోని భాగం. BCDFG జ్ఞానం బొందితేను పరమమైనశాంతి బొందును. E జ్ఞానం జెందితేను పరమమైనశాంతి జెందును.

40

అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః॥

అటువలెగాక [1]అజ్ఞుడైన(నా) భక్తిలేక సంశయచిత్తుడై వుండెనా వినాశం [2]బొందును. సంశయాత్మునికి యిహలోకమున్నూ లేదు; పరలోకమున్నూ లేదు; సుఖమున్నూ లేదు.

1 E అజ్ఞానుడై 2 E జెందును.

A పూర్తిపాఠం– అజ్ఞానియై, *శ్రద్దలేనివాడై, దానములేనివాడై, సంశయాత్ముడైనవానికి యిహలోకమున్ను లేదు; పరలోకమున్ను లేదు; సుఖమున్ను లేదు సంశయాత్మునికి.

*"అశ్రద్దధానశ్చ" అన్నభాగానికి "శ్రద్దలేనివాడై దానములేనివాడై" అనేది పొరబాటు.

41

యోగసన్న్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్న సంశయమ్
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ॥

[1]జ్ఞానమందున్నూ పెట్టబడిన కర్మాలుగలవాడై, జ్ఞానంచాతను [2]సంశయాల నెల్లాను [3]ఛేదించి, [4]అనుభవ[వ]ంతుడై వున్నవానికి [5]వో యర్జునుడా! కర్మాలు [6]వాన్ని [7]కట్టివేయవు.

1 ABDEF జ్ఞానయోగమందు బెట్టబడిన CG జ్ఞానయోగమందు జెప్పబడిన 2 AE సంశయాలల్లాను B సంశయాలెల్లా D సంశయాలు అన్నీ 3 B భేదించి 4 ABCDEF ఆత్మవంతుడై 5 D లో–వో యర్జునుడా– లేదు. E వోయి అర్జునా! 6 EF వానిని 7 BG కట్టివేయలేవు. D కట్టివెయ్యలేవు.

42

తస్మా దజ్ఞాన సంభూతం హృత్స్థం జ్ఞానాసి నాత్మనః
ఛి త్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత॥

[1] వో యర్జునుడా: [2] అదిగారణానబట్టుండి [3] నీహృదయమందుండేటటువంటి అజ్ఞానసంభూతమైన సంశయమును జ్ఞాన మనే [4] పట్టాచాతను [5] నరికివేశి [6] కర్మ యోగరూపమైన యుద్ధమును [7] ఆశ్రయింపు మనుటను.

1 E వోయి అర్జునా! 2 A లో లేదు. 3 AE నీ హృదయమందు అజ్ఞాన సంభూత CDF నీహృదయమందుండే అజ్ఞానసంభూత 4 ACE పట్టెముచేతను B పట్టెంచాత G పట్టిసంచాతను 5 CF నరికివేశి 6 C Fకర్మయోగమైన D కర్మ యోగరూప మనే 7 ACDF ఆశ్రయింపుము లెమ్ము అంటేను. E నాశ్రయింపుము అంటేను.

శ్రీమత్తాళపాకఅన్నమాచార్యుల కొమారుడు పెదతిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెనుగుచేశి వ్రాయించిన విజ్ఞానయోగ మన్నది నాలుగో అధ్యాయము.

A నాలుగో అధ్యాయం సంపూర్ణం.

శ్రీరామకృష్ణ వేదవ్యాసశుకావధూత పరమహంస సద్గురవేనమః. శ్రీఅవధూత గురవేనమః.

B హరిః వోం తత్సదితి శ్రీభగవద్గీతావుపనిషత్సు పరబ్రహ్మావిద్యాయాం శత సహస్రికాయాం సంహితాయాం వైయాసక్యాం యోగశాస్త్రనిర్ణయే శ్రీమన్మహా భారతే శ్రీభీష్మపర్వణి శ్రీకృష్ణార్జునసంవాదే సకలవేదాంతశాస్త్రార్థమృతే జ్ఞాన యోగోనామ చతుర్థోఽధ్యాయః.

C ఇది శ్రీమత్తాళపాక అన్నమాచార్యపుత్రుడు తిరుమలయ్యంగారు భగవద్గీ తార్థము తెలుగుచేశి వ్రాయించె నందు నాలుగోఅధ్యాయం సంపూర్ణం. జ్ఞాన యోగోనామ చతుర్థోఽధ్యాయః.

D ఇతి శ్రీమద్రామానుజవిరచితమైె శ్రీగీతాభాష్యక్రమాన శ్రీమత్తాళ్లపాక అన్నమాచార్యుల పుత్రులు తిరుమలయ్యగారు తెనుగుచేశినది నాలుగో అధ్యాయము

E హరిః ఓం తత్సదితి శ్రీమహాభారతే శతసహస్ర్యాం సంహితాయాం వైయా సిక్యాం శ్రీభీష్మపర్వణి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మావిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞానయోగోనామ చతుర్థోఽధ్యాయః.

F ఇటని శ్రీమద్రామానుజవిరచితంబైన శ్రీగీతాభాష్యక్రమాన శ్రీమత్తాళ్ల పాక అన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెలుగుచేశి వ్రాయించె నందు నాలుగో అధ్యాయం.

*ప్రసంగాత్ స్వస్వభావోక్తిః కర్మణోఽ కర్మతాస్య చ
భేదా జ్ఞానస్య మాహాత్మ్యం చతుర్థాధ్యాయ ఉచ్యతే॥

శ్రీ కణ్ణపుర నాయకిసహిత శ్రీశౌరిరాజాయనమః.

*ఇది యామునాచార్యుల గీతార్థసంగ్రహంలోని ఎనిమిదవ శ్లోకం.

అయిదో అధ్యాయం

# కర్మసన్న్యాస యోగం

1

అర్జున ఉవాచ

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥

ర

[1]వోయి కృష్ణుడా! [2]కర్మసన్న్యాసరూపమైన [3]యోగమున్నూ [4]కర్మయోగము జెప్పేవు. [5]యీరెంటిలోనున్నూ యేది మంచిది? [6]దాని నిశ్చయించి [7]చెప్పుము.

ర B అర్జుని వాక్యం C అర్జునవాక్యం EF అర్జునుని వాక్యం

1 E వోయి శ్రీకృష్ణస్వామి! 2 B లో-కర్మసన్న్యాసరూపమైన-లేదు. 3 AC EF జ్ఞానయోగమును B జ్ఞానయోగమున్ను 4 A జెప్పేవు. కర్మయోగమునున్ను BC చెప్పేవు. కర్మయోగమున్ను F జెప్పేవు. కర్మయోగమును E లో-కర్మయోగము జెప్పేవు- లేదు. 5 EF యీ రెంటిలోను 6 ACE దానిని B దాన్ని 7 ABCEF చెప్పుమంటేను.

D లో ఈ తాత్పర్యం లేదు.

2

శ్రీ భగవానువాచ

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ
తయోస్తు కర్మసన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే॥

ర

జ్ఞానమున్నూ, కర్మమున్నూ [1]యీరెండున్నూ మోక్షకారణాలు. [2]ఆయొక్క కర్మయోగజ్ఞానయోగాలలోను [3]జ్ఞానయోగంకంటేను కర్మయోగం [4]విశేషము.

ర BE శ్రీకృష్ణవాక్యం C క్రిష్ణుడు ఆనతిస్తున్నాడు D శ్రీకృష్ణునివాక్య F కృష్ణుడు ఆనతిస్తావున్నాడు

1 A రెండు మోక్ష D లో-యీ రెండున్నూ-లేదు 2 ACDE ఆ కర్మయోగ జ్ఞానయోగాలలోను B ఆయొక్క జ్ఞానకర్మయోగాలలోను F ఆ కర్మయోగ జ్ఞా యోగములలోను 3 D లో - జ్ఞానయోగంకంటేను-లేదు 4 G మంచిది.

3

జ్ఞేయః స నిత్యసన్న్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి
నిర్ద్వంద్వో హి మహాబాహో సుఖంబంధాత్ప్రముచ్యతే॥

[1]ఆయొక్క [2]యేకర్మయోగమైనా నేమి ఆత్మజ్ఞానముచాతను తృప్తిబొంది ద్వేషింపక, కాంక్షింపక, శీతోష్ణసుఖదుఃఖాలకు [3]లోనుగా కుండెనా. [4]ఆకర్మయో నిత్యసన్న్యాపి. [5]నిత్యసన్న్యాపి అనగాను నిత్యజ్ఞాననిష్ఠ డనుట, [6]వో యర్జునుడా [7]సుఖాననే బంధముక్తు డవును.

1 ABCDEFG లలో- ఆయొక్క--లేదు 2 AB యేకర్మయోగియైనా నేవి C యేకర్మయోగానసైనా నేమి D కర్మయోగమైనా నేమి E యేకర్మముసైనా నేవి F యేకర్మయోగమైనా నేమి 3 A లోనుగాక వుంటేను 4 ABCD ఆకర్మయో 5 DEF లలో-నిత్యసన్న్యాసి- లేదు. 6 E వోయి మహానుభావుడా! 7 A మవ సుఖంచాతను బంధ-

4

సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః
ఏకమప్యాస్థితః సమ్య గుభయోర్విందతే ఫలమ్॥

జ్ఞానయోగమున్ను [1]వేరే అని యెరుగనివారు చెప్పుదురు. వివేకంగలవార [2]అటు అనరు. [3]కర్మయోగంగాని, [4]జ్ఞానయోగముగాని [5]వక్కటిన్నీ [6]అనుష్ఠిం చెనా, రెంటియొక్క [7]ఫలమున్నూ పొందును.

1 ABCF కర్మయోగమున్ను వేరే అని E కర్మయోగమున్ను వేరే యెరుగని వారు చెప్పుదురుగాని వివేకం 2 E చెప్పరు. 3 ABCEF కర్మయోగమునుగాని 4 ABCEF జ్ఞానయోగమునుగాని 5 F లో లేదు 6 ABC లెస్సగాను అనుష్ఠించెనా E లెస్సగాను అనుష్ఠించి యీ- 7 AF ఫలమునున్ను బొందును. B ఫలమున్ను కర్మ యోగమునే పొందును. E ఫలమును పొందును.

D పూర్తిపాఠం—కర్మయోగమున్ను, జ్ఞానయోగమున్ను యరగనివారు వేరే వేరే అని చెప్పుదురు. వివేకులైనవారు యీ రెండింటిలోను నొకటి లెస్సగాను అనుష్ఠించిరా, రెంటియొక్క ఫలమున్ను పొందును.

5

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥

జ్ఞానయోగ[1]నిష్ఠులు యీ(యే) ఆత్మజ్ఞాన మనే [2]ఫలమును బొందుదురు; [3]అది కర్మయోగనిష్ఠులచాతను బొందబడును, అటుగనుక [4]జ్ఞానమున్నూ, [5]కర్మమున్నూ [6]వక్కటే అని [7]యెవ్వడు [8]దలచునో వాడు [9]యెరుకగలవాడు.

1 AD నిష్ఠులు యేఆత్మజ్ఞాన C నిష్ఠులే ఆత్మజ్ఞాన 2 B ఫలమున్ను 3 E అంటేను కర్మ 4 C జ్ఞానయోగమున్ను DE లలో లేదు. 5 C కర్మయోగమున్ను D కర్మయోగము E కర్మమును 6 ADE వొకటి అని C వొకటేని F లో లేదు. 7 D లో లేదు. 8 ABEF తలచును D తల్చును 9 C లో లేదు.

6

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి॥

[1]అట్లైతేను రెంటిలోను సులభమేదంటేను [2]వో మహాత్ముడా! [3]కర్మయోగం బాసినటువంటి జ్ఞానయోగం బొందేది [4]మహాప్రయాస. [5]కర్మయోగనిష్ఠుడైనన్ను [6]దలచినవాడు శీఘ్రమే ఆత్మను బొందును.

1 A యిందు రెంటి BDE యిట్లైతేను CF యిట్లైతే 2 B వోయి మహాబాహుడా! E వోయి మహాత్మా! 3 ABE కర్మయోగమును బాసి F కర్మయోగం బాశి జ్ఞాన 4 AEF మహాప్రయాసము. BCD మహాప్రయాసం. 5 C సర్వయోగనిష్ఠుడై F కర్మయోగముచేతనిష్ఠుడై 6 D తల్చినవాడు

7

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥

కర్మయోగయుక్తుడై, [1]మనోజయంగలవాడై, [2]సర్వభూతాలందు [3]ఆత్మల వలెనే [4]తన ఆత్మనున్నూ తలస్తున్నవాడై, కర్మయోగం [5]చేశినవాడున్నూ ఆత్మ [6]జ్ఞానమునే [7]పొందునుగాని, [8]కర్మఫలం [9]బొందెడివాడు కాడు.

1 ABCF విశుద్ధచిత్తుడై, జితేంద్రియుడై, మనోజయం D విశుద్ధచిత్తుడై, విజితేంద్రియుడై, మనోజయం 2 A సర్వభూతాలందుల BF సర్వభూతాల అందలి CE సర్వభూతాలందలి 3 A ఆత్మలీలవలెనే CD ఆత్మవలెనే F యాత్మల తన 4 B తన్ను దలస్తున్నవాడై C తన ఆత్మనున్ను తలస్తున్నన్నవాడై D తన ఆత్మను తలస్తున్నవాడై F తన యాత్మగా తలస్తున్ను వున్నవాడై 5 ACDEF చేశినాను ఆత్మ 6 D జ్ఞానమే 7 BCDEF పొందుగాని 8 AE కర్మఫలమును D కర్మయోగమును 9 D పొందేవాడు గాడు. E బొందేటివాడు గాడు.

8

నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్ర న్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥

తత్త్వవేత్తలై(యై)నయోగి చూస్తున్న, వించున్న, అంటున్న, ఆఘ్రాణిస్తున్న, భోజనంచేస్తున్న, [1]పోవుచున్న, నిద్రబోవుచున్న,

1 G నడచి పోవుచున్న, నిద్రపోవుచున్న.

A పూర్తిపాఠం– వూర్పుస్తున్న, మాటలాడుచున్న, విడుస్తున్న, పట్టుచున్న, కన్నుదెరుస్తున్న, మూయుచున్న వుండి, తత్త్వవేత్త అయిన యోగి చూస్తున్న, వించున్న, అంటుచున్న, ఆఘ్రాణముచేస్తున్న, భోజనముచేస్తున్న, పోచున్న, నిద్రపోచున్న,

B పూర్తిపాఠం– తత్త్వవేత్త అయినయోగి చూస్తున్న, అంటుచున్న, ఆఘ్రాణంశేస్తున్న, భోజనంశేస్తున్న, పోవుచున్న, నిద్రబోవుచున్న,

C పూర్తిపాఠం–తత్త్వవేత్తైనయోగి చూస్తున్న, వించున్న, అంటుచున్న, ఆఘ్రాణంచేస్తున్న, భోజనంచేస్తున్న, పోచున్న, నిద్రవోచున్న,

D పూర్తిపాఠం– తత్త్వవేత్తలైన యోగులు చూస్తున్న, వించున్న, అంటు(చు)న్న, ఆఘ్రాణముచేస్తున్న, భోజనంచేస్తున్న, పోచున్న, నిద్రబోవుచున్న,

E పూర్తిపాఠం– తత్త్వవేత్తయైన భో(యో)గి యీ రీతివుండిన్ని, నేను యించుకంతాచేసిన వాడని తలచును. యేరీతివుంచును అంటేను? చూస్తున్న,

వించున్ను, అంటుచున్ను, ఆఘ్రాణంశేస్తున్ను, భోజనంశేస్తున్ను, పోచున్ను, నిద్ర బోచున్ను, నిట్టూర్పువిడుస్తును,

F పూర్తిపాఠం- తత్త్వవేత్త అయినయోగి చూస్తున్ను, వించున్ను, అంటుచున్ను, ఆఘ్రాణంచేస్తున్ను, భోజనంచేస్తున్ను, పోవుచున్ను, నిద్రపోవుచున్ను,

9

ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిష న్నిమిష న్నపి
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥

[1]వూర్పువ(వు)స్తున్నూ, మాటలాడుచున్ను, [2]విడుస్తున్ను, పట్టుచున్ను, కన్నుదెరుస్తున్ను, మూయుచున్నూ, [3]యీరీతిన [4]నుండిన్నీ నేను [5]యించుకంతాను జేశినవాడనుగా నని తలస్తున్ను, యింద్రియాలు విషయాలందు [6]వాని ధరిస్తున్నవాడై,

1 AD వూర్పుస్తున్న B వూర్పుపుస్తున్న CF వూర్పు ఉస్తున్న E లో లేదు. 2 A లో లేదు. 3 ACDEF లలో-యీరీతిన-లేదు. B యీరీతిని 4 E లో -నుండిన్నీ-లేదు. 5 A యించుకంత చేశినవాడనుగానని B యించుకంత జేశినవాడగా నని C యించికంతచేశినవాడా గాను అని D యించుకంతా జేశినవాడుగా నని E యించుకంతాను జేశినవాడగా నని F యించుకంతా శేశినవాడగా నని 6 A వర్తిస్తున్నావి అని BDEF వర్తిస్తున్న వని

10

బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా॥

[1]బ్రహ్మ మని [2]పేరగల [3]ప్రకృతివలననే సర్వమైన యింద్రియాలున్ను బుట్టెగనుక, యింద్రియాల[4]చాతను జేసే [5]అందు కర్మాల నెల్లాను, ప్రకృతి [6]యందే పెట్టి, ఫలసంగం [7]విడిచి, [8]కర్మయోగం [9]జేశినవాడు [10]తామరపాకు గదా నీళ్ల అంటనట్టె వాడున్నూ పాపాల నంటడు.

1 ABCDE బ్రహ్మ మనే 2 A పేరంగల B పేరప్రకృతి D పేరుగల E పేరుకు 3 ADE ప్రకృతివల్లనే 4 ACE చేతజేశి 5 CE యందు కర్మాల నల్లాను D కర్మాలల్లాను 6 AD యందుపెట్టి B వల్లనే పెట్టి 7 B వీడి 8 F బ్రహ్మయోగం

9 AE చేసును వాడు C చేసుకొనువాడు D చేసును తామర 10 AC తామరపాకు నీళ్లను B తామరపాకుమీది నీళ్లు D తామరపాకు నీళ్ల E తామెరపాకు నీళ్లను F తామెరపాకునీళ్ల

## 11

కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి
యోగినః కర్మకుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే॥

[1]శరీరంచాతను, [2]మనస్సుచాతను, [3]కేవలమైన యింద్రియాలచాతను ఆత్మనిష్ఠులు ఫలసంగం [4]విడిచి, చిత్తశుద్ధికొరకు కర్మమును శేయుదు[రు.]

1 D శరీరమున్ను 2 D మనస్సున్ను 3 ABCEF బుద్ధిచేతను కేవల D బుద్ధిన్ని 4 F వీడి

## 12

యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతి మాప్నోతి నైష్ఠికీమ్
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥

[1]ఆత్మయోగనిష్ఠుడై కర్మఫలం విడిచినవాడు [2]ఆత్మనిష్ఠరూపమైన శాంతి బొందును. ఆత్మయోగనిష్ఠుడుగాక ఫలంగోరి కర్మానుష్ఠానం చేశెనా ఆత్మజ్ఞానం లేక [3]కర్మబద్ధు డౌను.

1 D యోగనిష్ఠుడై 2 BCDEF ఆత్మనిష్ఠా 3 CE కర్మబంధు డౌను.

## 13

సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్నకారయన్॥

[1]యింద్రియజయంగలవాడు [2]వివేకవంతం [చిత్తము] చాతను [3]సమస్త కర్మాలనున్ను [4]నవద్వారమైన దేహం [5]ధరియించగా బుట్టినవి అని, ఆకర్మాలను [6]దేహమందలిగానే తలచి, [7]తాను చేశినవాడుగాక, [8]చేయించినవాడుగాక సుఖాన వుండును.

1 B సమర్థుడు యింద్రియజయం గలవాడై 2 ABE వివేకచిత్తముచాతను C వివేకచిత్తంచాత 3 BC సమస్తమైన కర్మాలున్ను D సకలమైన కర్మాలనున్ను E సమస్తమైన కర్మాలచాతను 4 ABCDE నవద్వారపురమైన 5 AE ధరించగా

CD ధరింపగా 6 AB దేహమందలవిగానే CD దేహమందలివిగానే E దేహ మందలిదిగానే 7 ACE తా జేశినవాడు 8 BE లలో – చేయించినవాడుగాక – లేదు.

F పూర్తిపాఠం—యింద్రియజయంగలవాడు వివేకచిత్తముచాతను సమస్తమైన కర్మాలనున్ను నవద్వారపురమైన దేహము ధరియింపగా బుట్టినవిగాని స్వరూపప్రయుక్తమైనవి గావు అని, కర్తృత్వమును దేహమందుబెట్టి, దేహాధిష్ఠాన ప్రయత్నమును శాయక, దేహమును పనిగొనక సుఖాన వుండును.

## 14

న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥

యీయాత్మస్వరూపము [1]యెట్టి దంటేను? యీయాత్మ లోకమువారికి ప్రకృతి సంబంధాన వచ్చిన [2]కర్తృత్వ(మున్ను కర్మాలనున్ను) కర్మఫల[3]సంయోగాల [4]వల్లనున్ను [5]స్పృశింపదు. [6]మరో అంటేను? [7]అనాదికాలంనుండీ వొచ్చిన ప్రకృతియొక్క స్వభావమై [8]ప్రవర్తిస్తున్నది.

1 AB తా నెటువంటిది అంటేను? C దా యెటువంటి దంటేను? G తా నెటువంటి దంటివా? 2 ACE కర్తృత్వమున్ను కర్మాలను B కర్తృత్వమున్ను కర్మాలనున్ను 3 ACE సంయోగాలను B సంయోగాలనున్ను 4 ABCE లలో లేదు. 5 AE సృజియింపడు. C సృజింపడు. 6 E మరేమి అంటేను? G మరో అంటివా? 7 AE అనాదికాలాననుండి వచ్చిన B ఆదికాలాన్నుండి వచ్చిన C అనాదికాలాన వుండి వచ్చిన 8 B అనువర్తిస్తున్నది.

D పూర్తిపాఠం—ఆత్మస్వరూపం దా యెటువంటి దంటేను? ఆత్మలోకం వార్కి దేహాద్యసాధారణకర్తృత్వమున్ను, తత్తర(ద)సాధారణాలైన కర్మాలున్ను ఆయా కర్మజన్యాలైన ఫలసంయోగమున్ను, ఆకర్మవశ్యుడైన స్వస్వరూపాపన్నుడైన ఆత్మ పుట్టించదు. మరో అంటేను? అనాదికాలాననుండిన్ని వచ్చిన ప్రకృతి యొక్క స్వభావమై వర్తిస్తున్నది.

F పూర్తిపాఠం—యీలోకానవు దేహస్య(ద్య)సాధారణకర్తృత్వమున్ను, తత్త[ద]సాధారణాలైన కర్మాలున్ను, ఆయాకర్మజన్యాలైన ఫలసంయోగమున్ను ఆకర్మవశ్యుడై స్వస్వరూపాపన్నుడైన ఆత్మ పుట్టించదు. మరో అంటేను?

స్వభావమే పుట్టించును. స్వభావ మనగా ప్రకృతివాసన. ఆప్రకృతి వాసన అనాది [కా]ల ప్రయుక్తమైన కర్మముచాత బుట్టింపబడిన దేవాద్యాకారప్రకృతిసంసర్గ తత్తదాత్మాభిమానజనితవాసనవల్ల వచ్చినది గాదు.

15

నా దత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః॥

[1]సమర్థుడైన [2]ఆత్మ [3]వక పాపమున్నూ [4]అంటదు. [5]వకరి సుకృతమున్ను. ప్రకృతిసంబంధమైన అజ్ఞానంచాతను [6]జ్ఞానమెల్లాను [7]ఆవృతమై నేను జంతువులు [8]మోహిస్తుందును.

1 A సమర్థుడై 2 D లో-ఆత్మ-లేదు. 3 C వొకటి పాపమున్ను DE వొకరి పాపమును 4 BDG అంటడు. 5 E వొకరి పుణ్యమును 6 ABDE జ్ఞాన మల్లాను 7 BCE ఆవృతమై తేను జంతువులు 8 A మోహిస్తు న్నుందురు. B మోహిస్తుందును. C మోహిస్తున్నువుండును. D మోహిస్తు వుండును. E మోహిస్తుందురు. G మోహింప జేయుచున్నుండును.

F పూర్తి పాఠం- ఆకర్మవశ్యుడైన ఆత్మనిష్ఠమైన వారియొక్క దుఃఖమున నిన్ను బోమొత్తడు. అనిష్టమైన వారియొక్క సుఖమునున్ను పోమొత్తడు. జంతువులయొక్క జ్ఞానము అజ్ఞానముచాత రక్షింపబడివుండు గనక వారు మోహింతురు. అదెట్టు అంటేను? జ్ఞానమును కప్పే కర్మముచాతను దేహాదిదేహా (దేవాది దేహా) సంయోగమున్ను, తత్తదాత్మాభిమానరూపమైన రూపమును అయిన మోహామున్ను బుట్టును. దానివల్ల ఆత్మాభిమాన వాస[న]యందు ఉచితమైన కర్మవాసన; అందువల్ల విపరీతాభిమానమున్ను, కర్మమున్ను అనెడి యీ వాసనాచక్రము నడుస్తూ వుండును.

16

జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః
తేషా మాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥

[1]యెవ్వరైనా నేమి సంతతమున్ను అభ్యసింపబడిన జ్ఞానముచాతను తమ [2]అజ్ఞానం నశింపజేయుదురు. వారికి ఆతరువాతను ఆదిత్యునివలెనే జ్ఞానం ప్రకాశించును.

1 A యెవ్వడైనా 5 BCE అజ్ఞానమును

D పూర్తిపాఠం- యెవ్వరైనా నేమి వుపదేశంవల్ల బుట్టిన ఆత్మవిషయజ్ఞానం చాతను, అనాదికాలాననుండి వచ్చే కర్మరూపాజ్ఞానం నశించును. వార్కి స్వభావిక మైన, ఉత్కృష్టమైన జ్ఞానము ఆదిత్యునింబలెను ప్రకాశించును. సర్వమున్ను వున్న దున్నట్టు తోపించును.

F పూర్తిపాఠము- యెవ్వరికైనా నేమి వుపదేశంవల్ల బుట్టిన ఆత్మవిషయ జ్ఞానముచాతను, అనాదికాలాననుండి వచ్చే కర్మరూపాజ్ఞానము నశియించును. వారికి స్వాభావికమై, వుత్కృష్టమై జ్ఞానము ఆదిత్యుడు బలెను, సర్వమున్ను వున్నది వున్నట్టు వలె తోపించును. వినష్టాజ్ఞానులైన జీవులయొక్క బహుత్వం చెప్పగానే యేకజీవవాదం యెత్తిపోయెను. ఆదిత్యదృష్టాంతంవల్లను జ్ఞానమున్ను ఆత్మవ స్వాభావికమైన ధర్మమని అథర్మమాయను (అర్థమాయెను).

## 17

తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః
గచ్ఛం త్యపునరావృత్తిం జ్ఞాన నిర్ధూతకల్మషాః॥

అటువంటి [1]ఆత్మయందే బుద్ధిగలవారై, [2]ఆయాత్మాభ్యాసమందే నిరతులై, ఆప్రయోజనముకా గలవారై. యీరీతి నభ్యసించిన జ్ఞానంచాతను [3]నిర్ధా(ర్ధూ)త మైన పాపం గలవారై మరీ తిరుగులేని ఆత్మస్వరూపం బొందుదురు.

1 BE ఆత్మందే 2 B లో- ఆయాత్మాభ్యాసమందే నిరతులై ఆప్రయోజనము కాగలవారై - అన్న భాగం లేదు. D ఆయాత్మజ్ఞానమందే 3 B నిర్ధూతపాపం గలవారై CDE నిర్ధూతమైన పాపంగలవారై

F పూర్తిపాఠం- "తద్బుద్ధయః" ఆయాత్మాను సాక్షాత్కారరూపాన జాయవలెనని అధ్యవసాయం గలవారున్నై, ఆత్మవిషయమైన మనస్సుగలవారునై, ఆయాత్మ విషయజ్ఞానాభ్యాసమందు నిరతులై, ఆయాత్మ పరమప్రయోజన మని తలచుకొంటే (నే) వారున్నై, యిటువంటి ఆత్మజ్ఞానముచాత నిర్ధూతమైన పూర్వపాపవాసనల గలవారు అటువంటి ఆత్మను పునరావృత్తిలేకుండాను పొందుదురు. యిటనగాను స్వస్వరూపాపన్నులై వుందు రనుట.

18

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని
శునిచైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః॥

[1]అటువంటి [2]సమదర్శితులయిన [3]పండితులు విద్యావినయసంపన్నుడైన [4]బ్రాహ్మణు నందున్నూ, [5]ఆవుల యందున్నూ, [6]యేనుగుల యందున్ను, [7]కుక్కల యందున్ను, [8]కుక్కల వండుకొని తినేవాని యందున్నూ వుండే ఆత్మను, [9]జ్ఞానస్వరూపుడైన [10]ఆత్మను తమ సమముగానే చూతురు. [11]యిటనగా యేమి అనుట అంటేనుః వారి వారి శరీరాలే [12]కర్మం వలననే [13]హీనులున్ను, అధికాలున్ను అయగాని, ఆత్మలెల్లాను వక్కరీతివారే అనుట,

1 DF యిటువంటి 2 ABC సమదర్శనులైన D పండితులైనటువంటి 3 D సమదర్శనులకు 4 AEF బ్రాహ్మణుని యందున్ను 5 ACD ఆవు యందున్ను E ఆవు నందును F లో లేదు. 6 AD యేనుగ యందున్ను CF యేను గందున్ను E యేను గందును 7 B లో లేదు. CF కుక్కందున్ను D కుక్క యందును E కుక్కందును 8 CF కుక్కల వండుక తినేవా నందున్ను 9 B జ్ఞానస్వరూపముగానే D జ్ఞాన స్వరూపు డని 10 ACF ఆత్మసమముగా జూతురు. B లో–ఆత్మను తమ సమముగానే– అన్న భాగం లేదు. D లో– ఆత్మను తమ–లేదు. 11 D లో–అనగా వారివారి శరీరాలు కర్మరూపమైనవిగాని వాటియందు వుండీ ఆత్మ సమమే అనుట–అని తాత్పర్యం పూర్తి చేయబడింది. 12 A కర్మమువల్లను B కర్మాలవల్ల CEF కర్మంవల్ల G కర్మము వల్ను 13 BE హీనా లాయ గాని ఆత్మలెల్లాను

19

ఇహైవ తైర్జితస్సర్గో యేషాం సామ్యే స్థితం మనః
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

యిటువలె సమస్తమైన ఆత్మలున్ను సరి అనే బుద్ధి యెవ్వరికి వుండును; వారిచాతను [1]స్వరూపము సమమైనది, [2]అటుగనుక అటువంటి వివేకులు బ్రహ్మ మందు వున్నవార్లే.

1 A ఆత్మజ్ఞానము సాధింపబడి దొరకొన్నప్పుడే, యీ సృష్టి గెలువబడిన అటువలెనె కదా ప్రకృతి దోషరహితమైన ఆత్మస్వరూ BF ఆత్మజ్ఞానం సాధింప దొరకొన్నప్పుడే యీ సృష్టి గెలువబడినది; అటువలెనెకదా ఆప్రకృతి దోషరహిత

మైన ఆత్మస్వరూ D ఆత్మజ్ఞానము సాధింపబడి యీసృష్టి గెల్వబడ్డది; అటువలెనే కదా ప్రకృతిదోషరహితమైన ఆత్మస్వరూ E ఆత్మజ్ఞానము సాధింపబడి దొరకొన్నప్పుడే యీసృష్టి గెలువబడినది; అటువలేగదా ప్రకృతిదోషరహితమైన ఆత్మస్వరూ 2 A బ్రహ్మమం దున్నవార్లే అనుట. E బ్రహ్మమందున్నవార్లై. F బ్రహ్మమందున్నవార్లే.

C పూర్తిపాఠం—ఇటువలెనే సమస్తమైన ఆత్మస్వరూపము సమస్తమైనది గనక అటువంటి వివేకులు బ్రహ్మమం దున్నవార్లే.

## 20

న ప్రహృష్యే త్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్
స్థిరబుద్ధి రసమ్మూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః॥

[1]బ్రహ్మవేత్త, బ్రహ్మమందు నిష్ఠుడైనవాడు ప్రియంబొంది సంతోషింప [2]వల్దు. [3]అప్రియం బొంది దుఃఖింప వలదు. స్థిరబుద్ధియై, [4]మోహరహితుడై [5]వుండెడిది.

1 BCDEF బ్రహ్మవేత్తై 2 E వద్దు. 3 B లో–అప్రియంబొంది దుఃఖింప వలదు–అన్నభాగం లేదు. 4 A లో లేదు. 5 A వుండేటిది అనుట. E ఉండేది.

## 21

బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా వింద త్యాత్మని యత్సుఖమ్
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే॥

యీచెప్పినప్రకారాన ఆత్మానుభవంచేసుకొని. బాహ్యమైన [1]విషయస్పర్శలందు [2]తలపు బెట్టక. [3]ఆత్మయందే యెవ్వడు సుఖం బొందును; బ్రహ్మయోగం [4]చాతను, చిత్తంగలవార్లై(డై) అతడు [5]అక్షయమైన సుఖము బొందును.

1 ACF విషయస్పర్శాలయందు BD విషయస్పర్శాలందు E విషయస్పర్శాదులందు 2 ACDEF తలంపు పెట్టక 3 BDEF ఆత్మందే 4 BC చాతను తగిలిన చిత్తంగలవాడై DEF చాత తగిలిన చిత్తంగలవాడై 5 ABCDEF అక్షయసుఖము

## 22

యే హి సంస్పర్శజా భోగా దుఃఖ యోనయ ఏవ తే
ఆద్యంతవంతః కౌంతేయ న తేషు రమతే బుధః॥

విషయ[1]సంస్పర్శలవలన [2]బుట్టెడి భోగాలు [3]యేమి గలవు. [4]అవి [అ]స్థిరాలై . దుఃఖకారణా లయ్యే వుండును. [5]వానియందు వివేకంగలవాడు రమింపడు.

1 AG స్పర్శాలవల్న BD స్పర్శాలవల్ల 2 E బుట్టిన 3 E యేమిగలుగు. 4 ACEF అవి అస్థిరాలై 5 D వాటియందు

23

శక్నోతీహైవ య స్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః॥

[1]యెవ్వడేనేమి శరీరంబు విడువక[2]తొల్లే. ఆత్మానుభవముచాతను. కామ క్రోధాలవలన బుట్టిన వేగమును సహింపనోపును; అమనుష్యుడు యోగి. వాడే సుఖి.

1 ABEF యెవ్వడాయెనేమి C లో లేదు. 2 A తొల్లి E మునుపే

D పూర్తిపాఠం—యెవ్వడాయనేమి కామక్రోధాలవల్ల బుట్టిన వేగము శరీరం విడువకతొల్లే, ఆత్మానుభవముచాతను సహింపనోపును. ఆ మనుష్యుడుయోగి. వాడు సుఖి.

24

యోఽంతః సుఖోఽంతరారామ స్తథాంతర్జ్యోతిరేవ యః
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥

[1]యెవ్వడయనేమి [2]అంతరాత్మానుభవమందే సుఖంగలవాడై. [3]అంత రాత్మందే [4]ఆరామమందే [5]గ్రీడించినట్టే గ్రీడిస్తున్నా. [6]అంతర్జానజ్యో[తి](స్సు) సుఖంగలవాడై వుండును. [7]అటువలెనే బ్రహ్మభూతుడైన [8]ఆయోగీంద్రుడు బ్రహ్మ[9]నిర్వాణం బొందును.

1 B యెవ్వడైనా నేమి D యెవ్వడైనాను E బ్రహ్మభూతుడైన యెవ్వడాయ నేమి 2 E అంత ఆత్మానుభవంగలవాడై యుండును, అంతరాత్మందే 3 B అంత రాత్మందే 4 ABCF ఆరామమందు D లో లేదు. 5 AC గ్రీడించునట్లు BEF క్రీడించి నట్టు D లో లేదు. 6 ABCFG అంతర్జ్ఞాన జ్యోతిస్సుగలవాడై D అంతఃజ్ఞానర్జ్యోతి స్సుఖంగలవాడై E ఆతీరుననే అంతర్జ్ఞాన మనే జ్యోతిస్సుగలవాడై 7 ACDEF లలో లేదు. B అటువంటి 8 ADF యోగి BCE ఆ యోగి 9 E బ్రహ్మసుఖం బొందును.

## 25

లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః
ఛిన్నద్వైధాయతాత్మానః సర్వభూతహితే రతాః॥

[1]ద్వంద్వాతీతుడై(లై), [2]ఆత్మందే తలపు [3]నిలిపి, [4]సర్వభూతహితులయిన [5]జ్ఞానులు, [6]ఋషులు నిలుపు (అనిపించు) కొందురు; వారు క్షీణ[7]కల్మషులయి [8]బ్రహ్మనిర్వాణం [9]బొందుచుందురు.

1 A ద్వంద్వాతీతులైన BCDEF ద్వంద్వాతీతులై 2 AB ఆత్మతలంపు 3 A నిలిపే 4 B సర్వభూతహితజ్ఞులు DG సర్వభూతహితరతులైన F సర్వభూతరతులైన 5 B లో లేదు. 6 ACDE ఋషులు అనిపించుకొందురు. B ఋషు లనిపించుకుందురు. F ఋుషు లనిపించుకొందురు. 7 ABCDE కల్మషులై F కర్మలై గతకల్మషులై 8 E పరబ్రహ్మనిర్వాణము 9 B బొందుచు న్నందురు. CE బొందు చుండుదురు. G బొందుచు న్నండుదురు.

## 26

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విజితాత్మనామ్॥

కామక్రోధాలను [1]విడిచి, ఆత్మజ్ఞానమందు ప్రయత్నంచేసి, మనస్సు [2]వశముగాను చేసుకున్న [3]విజితేంద్రియులకు, బ్రహ్మనిర్వాణం [4]దగ్గరవున్నది. [5]యిటనగాను యేమనుట [6] అంటేను? యిటువంటిజ్ఞానులకు [7]బ్రహ్మసులభ మనుట.

1 A లో లేదు. 2 ABCDF వశముచేసుకున్న 3 A విజితేంద్రియుండు BCDF జితేంద్రియులకు 4 A బొందును. CG దగ్గరనున్నది. 5 BC యిటనంగా D లో–యిటనగాను యేమనుట అంటేను– అన్నభాగం లేదు. 6 G అంటివా? 7 ACDF బ్రహ్మము

E పూర్తిపాఠం– కామక్రోధాలను [విడిచి] ఆత్మజ్ఞానమందు ప్రయత్నం చేశే మనస్సుగలవారై, జితేంద్రియులైన జ్ఞానులు యతు లనిపించుకుందురు. వారికి బ్రహ్మనిర్వాణము అంతటను ఉండును. ఇటనగా ఏమనుటా అంటేను? ఇటువంటి జ్ఞానులకు బ్రహ్మము సులభమనుట.

27

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ॥

[1]బాహ్యవిషయ [2]స్పర్శలను వెలుపలగా జేసి, [3]యోగాసనమందు గూర్చుండి, దృష్టిని భ్రూమధ్యమందు బెట్టి, ముక్కులోను సదాచరించెడి [4]ప్రాణాపానా లనే వుశ్వా(చ్ఛ్వా)సనిశ్వాసాలను సమాలుగా [5]చేసుకునేది.

1 E యోగాసనమందే కూర్చుండి బాహ్య 2 ACDEF స్పర్శాలను 3 A యోగాసనమున గూర్చుండి E లో లేదు. 4 B ప్రాణాపానా లనెడి 5 ABCDF జేసుకొని E చేసుకొని

28

యతేంద్రియమనోబుద్ధి ర్మని ర్మోక్షపరాయణః
విగతేచ్ఛా భయక్రోధో యః సదాముక్త ఏవ సః॥

[1]యింద్రియాలను, [2]మనస్సును, [3]బుద్ధిని నియమించినవాడై, [4]ఆత్మనే [5]తలపోశినవాడై, [6]మోక్షపరాయణుడైనవాడు సదా ముక్తుడే.

1 B యింద్రియాలనున్ను C యింద్రియాల E యెవడు యింద్రియాలను 2 BE మనస్సునున్ను 3 DE బుద్ధినిన్ని 4 ABCDF యిచ్ఛాను, భయమున్ను, క్రోధమున్ను మానినవాడై ఆత్మనే E యిచ్ఛనున్ను, భయమునున్ను, క్రోధమునున్ను, మానినవాడై ఆత్మనే 5 D తలపోశినవాడైనవాడు సదా ముక్తుడు–అని తాత్పర్యం పూర్తి చేయబడింది. 6 E మోక్షపరాయణుడైౌను వాడు.

29

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి॥

[1]అటువంటి ఆత్మజ్ఞాని [2]యేరీతి నుండవలె నంటేను? [3]యజ్ఞతపస్సుల యొక్క [4]భోక్తనై, సర్వలోకాలకున్నూ [5]పక్కడనే [6]స్వామినైన, సర్వభూతాలకున్నూ [7]చుట్టమైన నన్ను, [8]నెరిగేవాడు శాంతి బొందును.

1 A లో లేదు. 2 E లో–యేరీతి నుండవలె నంటేను–అన్న భాగం లేదు. 3 D యజ్ఞతపస్సులయందు E యజ్ఞతపస్సులకు 4 D లో–భోక్తనై సర్వలోకాల

కన్ను-అన్న భాగం లేదు. 5 E లో లేదు. 6 ABED యేలికనై F యేలికై 7 ABCD చుట్టమునైన E చుట్టమనై ఉన్న F సమమైన 8 ABCD యెరిగినవాడు F యెరిగెనా వాడు

ఇతి శ్రీమత్తాళపాకఅన్నమాచార్యుల కొమారుడు పెదతిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెనుగుచేశి వ్రాయించినది కర్మసన్న్యాసయోగ మన్నది అయిదో అధ్యాయము.

A పంచమోఽధ్యాయం.

B హరిః ఓం తత్సదితి శ్రీభగవద్గీతానూపనిషత్సుబ్రహ్మవిద్యాయాం శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం యోగశాస్త్రనిర్ణయే సకలవేదాంతశాస్త్రేస్మృతే శ్రీకృష్ణార్జునసంవాదే సన్న్యాసయోగో నామ పంచమోఽధ్యాయః.

C పంచమోఽధ్యాయః. ఇతి శ్రీమత్తాళపాకఅన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయ్యంగారు భగవద్గీతార్థం తెలుగుచేశి వ్రాయించి నందు అయిదో అధ్యాయం సంపూర్ణం.

D అయిదో అధ్యాయం సంపూర్నం.

E హరిః ఓం తత్సదితి శ్రీమహాభారతే శతస(సా)హస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం శ్రీభీష్మపర్వణి శ్రీభగవద్గీతానూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే సన్న్యాసయోగో నామపంచమోఽధ్యాయః.

F యిటని శ్రీమద్రామానుజవిరచితమైన శ్రీగీతాభాష్యక్రమాన శ్రీమత్తాళ్ల పాక అన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెలుగుచేశి వ్రాయించి నందులను అయిదో అధ్యాయం.

> * కర్మయోగస్య సౌకర్యం శైఘ్ర్యం కాశ్చన తద్విధాః
> బ్రహ్మజ్ఞానప్రకారశ్చ పంచమాధ్యాయ ఉచ్యతే.

శ్రీకణ్ణపురనాయకిసహిత శ్రీశౌరిరాజాయనమః.

G ఇతి [శ్రీమ]త్తాళ్లపాకఅన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెలుగుచేశి వ్రాయించి నందు సన్న్యాసయోగ మనే పంచమాధ్యాయము సంపూర్ణం.

* ఇది యామునాచార్యరచిత గీతార్థసంగ్రహంలోని తొమ్మిదవ శ్లోకం.

## ఆరో అధ్యాయం

# అభ్యాసయోగం

1

శ్రీ భగవానువాచ

అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః
స సన్న్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః॥

గ

కర్మఫలం [1]నాశ్రయించక కర్మంమాత్రమే నాకు శాయదగింది [2]అని [3]యెవ్వడు చేసును, వాడు [4]జ్ఞానయోగీన్నీ, కర్మయోగీన్నీ. వాడు కర్మాలందు [5]ప్రవర్తింపనివాడు గాడు, క్రియారహితుడున్నూ గాడు.

గ E శ్రీకృష్ణవాక్యం

1 A నాశ్రయింపక D అనుచరించక 2 ACDEF ఆకర్మము విష్ణుప్రీతికొరకు అని B కర్మము విష్ణుప్రీతిగాను యెవ్వడు 3 B యెవ్వడు చేసునో, వాడే C యెవ్వడు చేస్తున్నాడు, వాడు F యెవ్వడేనేమి శేయును, వాడు 4 A జ్ఞానయోగిన్ని వాడు BCG జ్ఞానయోగిన్నివాడే కర్మయోగిన్నివాడే E జ్ఞానమెరిగినవాడె కర్మయోగిన్ని వాడు DF జ్ఞానయోగిన్ని వాడు కర్మయోగిన్నివాడు. 5 ACDE ప్రవర్తింపని వాడున్ను కాడు.

2

యం సన్న్యాస ఇతి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ
న హ్యసన్న్యస్త సంకల్పో యోగీ భవతి కశ్చన॥

[1]వో యర్జునుడా! [2]యేమిటి [3]విజ్ఞానయోగ మందురు అదే కర్మయోగం అని యెరుగుము. కోరికె లుడుగనివాడు [4]వక్కడున్నూ [5]కర్మయోగి గాడు.

1 E వోయి అర్జునా! 2 ABCDEG యేమిటిని 3 ABCDEFG జ్ఞానయోగ 4 E లో లేదు. G యెవ్వడు గలడు 5 D .........డాత్మయోగి కాడు. G వాడే కర్మయోగి.

3

ఆరురుక్షో ర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥

[1]ఆత్మజ్ఞానై సాధకుడైన మోక్షార్థికి కర్మయోగమే [2]కారణం. ఆత్మా[వ]లోకనం సిద్ధమైనవెనకను శమమే [3]కారణం. [4]శమ మనగాను కర్మనివృత్తి. [5]యిటనగా [6]యేమనుట అంటేను? ఆత్మజ్ఞానము సాధించిన[7]దనుకాను కర్మానుష్ఠానము [8]శాయవలె ననుట.

1 ABCDEF ఆత్మజ్ఞాన 2 E కారణ మని చెప్పబడును. 3 E కారణమని చెప్పబడును. 4 C శమ మే మనగాను 5 D లో– యిటనగా యేమనుట అంటేను–అన్న భాగం లేదు. 6 F లో– యేమనుట అంటేను–అన్న భాగం లేదు. 7 A దాకాను F దనక 8 A అవశ్యం శేయవలె ననుట.

4

యదా హి నేంద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥

ఆత్మజ్ఞానము సిద్ధించుటకు గురుతు యేది? అంటేను [1]యెప్పుడైనానేమి విషయాలందు [2]విషయని*మిత్తాల [3]కర్మాలయందున్నూ తగులకుండును, వాడు సర్వసంకల్పసన్యాసి; [4]అప్పుడు [5]యోగాతీతు డనిపించుకొనును.

1 BCG యెవ్వడైనానేమి D లో లేదు. 2 ABCEF విషయనిమిత్తాలైన 3 BC కర్మాలందున్ను 4 C లో– అప్పుడు–లేదు. G అతడు 5 ABCEF యోగారూఢు డనిపించుకొనును.

*D ప్రతి ఇంతటితో పూర్తి. ఇక పై గ్రంథభాగం లేదు. అందువల్ల D ప్రతి అసమగ్రమైంది.

5

ఉద్ధరే దాత్మనాత్మానం నాత్మాన మవసాదయేత్
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః॥

[1]విషయాలదగులని చిత్తంచాతను, ఆత్మను [2]ధరించెడి విపరీతచిత్తం చాతను, [3]ఆత్మ నాశనం [4]చేసుకోవద్దు. [5]తన మనస్సే తనకు [6]బంధువు.

1 B విషయాలందు తగులని 2 A వుద్ధరించెడిని B ధరించేటిది CEF ఉద్ధరించెడిది G ధరించే 3 AC తన ఆత్మనాశనము B తన ఆత్మను నాశం 4 E శాయవద్దు. 5 AEF తన మనసే 6 A బంధువు. తన మనసే తనకు శత్రువు B బంధువుడు F బంధువు. తన మనస్సే తనకు శత్రువు.

6

బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్॥

[1]అ దేదంటేను? [2]యెవ్వడాయనేమి తానే తన [3]మనస్సు జయించెనా వానికి తన మనస్సే [4]తనకు [5]బంధువు. యెవ్వడు ఆత్మజ్ఞానము లేక [6]మనస్సు జయింపలేడు. వానికి తన మనస్సే శత్రువు.

1 B అది యెట్టంటేను? F అ దెట్లానంటేను? G అది యెట్టిదంటేను? 2 AB యెవ్వడైనా నేమి G యెవ్వడైనా నేమి 3 ABCF మనస్సును 4 ABCFG అలో లేదు. 5 B బంధువుడు 6 ABC మనస్సును F తన మనస్సును

E పూర్తిపాఠం— అది యెట్లంటేను? యెవనిచాతనాయనేమి తన మనస్సు జయింపబడెనో వాని ఆత్మకు తన మనస్సే బంధువు. యెవ్వడు ఆత్మజ్ఞానము లేక తన మనస్సును జయింపలేడు, వానికి తన మనస్సు శత్రువువలెనే శత్రుత్వమందు వుండును.

7

జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః
శీతోష్ణ సుఖదుఃఖేషు తథా మానావమానయోః॥

చలి అయినప్పుడున్నూ, యెండ అయినప్పుడున్నూ, దుఃఖమైనప్పుడున్నూ, సుఖమైనప్పుడున్నూ, బహుమానం చేశినప్పుడున్నూ, అవమానం చేశినప్పుడున్నూ, [1]జితచిత్తుడై శాంతుడైనవానికి [2]ఆత్మ మిక్కిలిన్నీ తన స్వభావాన [3]వుండినవాడవును.

1 C జితచిత్తుడైనవానికి ఆత్మ 2 G మిక్కిలిన్ని పరమాత్మ సమాహితుడై వుండును—ఇంతటితో తాత్పర్యం పూర్తి. 3 F వున్నదో నుండినవాడౌను.

E పూర్తిపాఠం—చలియందు, ఉష్ణమందు, సుఖమందున్ను, దుఃఖమందున్ను, బహుమానమందున్ను, అవమానమందున్ను, జితచిత్తుడై శాంతుడైనవానికి ఆత్మ మిక్కిలిన్ని తన స్వభావాన వుండును.

8

జ్ఞాన విజ్ఞాన తృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః॥

జ్ఞాన మనగాను [1]జ్ఞానము. [2]ప్రకృతికంటేను [3]విశేషమైనవా డనే జ్ఞానం. యీరెంటిచాతను సంతోషించుకొన్న చిత్తం గలవాడై, [4]కొండవలెనే నిర్వికారుడై, [5]జితేంద్రియుడై, [6]మంటియందున్నూ, [7]రాయియందున్నూ, [8]బంగారమందున్నూ [9]సమబుద్ధిగలవాడై, కర్మయోగయుక్తు డనిపించుకొనును. యుక్తు డనగాను ఆత్మజ్ఞానార్హు డనుట.

1 A ఆత్మజ్ఞానము BE ఆత్మజ్ఞానం F లో లేదు. 2 ACEF విజ్ఞాన మనగాను ప్రకృతికంటే 3 AF విశేషమైనవాడు అనే జ్ఞానము E విశేషమైన జ్ఞానము G విశేషమైనది విజ్ఞానం 4 E పర్వతశిఖరంవలె నిర్వికారుడై 5 AE లలో లేదు. 6 A మంటిపెళ్లయందున్ను C మంటి పిట్టందున్ను E లో లేదు. G మంటి బెడ్డందున్ను 7 ACF రాయందున్ను B రాతియందున్ను E లో లేదు. 8 E లో లేదు. 9 B సమ బుద్ధి గలవాడైనవాడు E లో లేదు. F సమమైనబుద్ధి గలవాడై

9

సుహృన్మిత్రా ర్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥

చుట్టాలయందున్నూ, స్నేహితులయందున్నూ, [1]శత్రువులయందున్నూ, వుదాశీనులయందున్నూ, మధ్యస్థులందున్నూ, ద్వేషులందున్నూ, బంధువులందున్నూ, [2]పాపాత్ముడైనవానియందున్నూ వుండేఆత్మ సమ మని [3]తలచి, వారి వారి శరీరాల వల్లనే వొచ్చే [4]స్నేహమున్ను, [5]ద్వేషమున్నూ యెంచనివాడు యోగాభ్యాసానకు [6]అర్హుడు.

1 B లో లేదు. CF శత్రువులందున్ను 2 A లో-పాపాత్ముడైన వానియందున్నూ అన్న భాగం లేదు. B పాపాత్ముని యందున్ను C సాధువులందున్ను పాపాత్ముడైన వానియందున్ను E పాపాత్ములయందున్ను 3 BE తలచిన 4 A స్నేహమందున్ను

E స్నేహద్వేషాలు యెంచని F స్నేహాలున్ను 5 A ద్వేషమందున్ను 6 G అర్హుడు అవును.

## 10

యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥

యీచెప్పిన కర్మయోగి [1]యెప్పుడున్ను [2]యోగమందు [3]రహస్యమం దుండినవాడై, వక్కడే నియతమైన చిత్తమున్నూ [4]ఆత్మ గలవాడై, [5]ఆశరహితుడై, ఆత్మవ్యతిరిక్తమందు [6]తగులమి లేనివాడై, ఆత్మనిష్ఠుడై [7]వుండేది. ఆ [8]యేకాంతాన యెటువలె [9]గూర్చుండవలె నంటేను?

1 E యెల్లప్పుడును 2 ABCF యోగకాలమందు E లో లేదు. 3 రహస్యమందు ఉన్నవాడై, 4 AE ఆత్మజ్ఞానము గలవాడై, 5 AEF ఆశారహితుడై, B ఆచార సహితుడై C ఆకారరహితుడై 6 BE తగులులేనివాడై 7 ABC వుండేడిది 8 G యేకాంతమందు 9 C గూచుండవలె నంటేను? E ఉండును అంటేను? G గూర్చుండేది అంటేను?

## 11

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసన మాత్మనః
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥

మిక్కిలిన్నీ పాడవుగాక, మిక్కిలిన్నీ పొట్టిగాకుండాను, దర్భపరచి, అందుమీదను కోక వేసి, అందుమీదను పద్మాసనం బెట్టుకొని,

A పూర్తిపాఠం___ [1]శుచియైనదేశమందు మిక్కిలిన్ని [2]పొడచూపక, మిక్కిలిన్ని [3]పొట్టిగాక, దర్భ పరచి, [4]కృష్ణాజినం. పులితోలుగాని, పరచి అందుమీద కోకపరచి, అందుమీద పద్మాసనము పెట్టుకొని,

1 BCF శుచైన E శుచిగల 2 BCEF పొడవుగాక 3 B పొట్టిగాకుండు 4 BCEF కృష్ణాజినంగాని పులితోలుగాని

## 12

తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మ విశుద్ధయే॥

ఆయాసనమందు గూర్చుండి ఆత్మసిద్ధికొరకు యోగం సాధించెడిది.

A పూర్తిపాఠం—ఆయాసన [1] మందు [2] మనస్సు యేకచిత్తము చేసుకొని, [3] చిత్తమును క్రియలనున్ను, యింద్రియాలనున్ను నియమించి, అటువంటి పూర్వోక్తమైన [4] ఆసనమందు గూర్చుండి, ఆత్మశుద్ధికొరకు యోగము [5] సాధించేది.

1 E మందున 2 E మనస్సున F మనస్సును 3 BE చిత్తమున్ను F చిత్తమునున్ను 4 C ఆసనమందుండి ఆత్మ 5 AFG సాధించెడిది.

B పూర్తిపాఠం—ఆయాసనమందు గూర్చుండి ఆత్మశుద్ధికొరకు యోగము సాధించెడిది.

## 13

సమం కాయ శిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్॥

శరీరమున్నూ. శిరస్సున్నూ. మెడాను చెలింపక. [1] సమముగాను [2] ధరింపుచున్నూ. దిక్కులు చూడక, [3] నాసాగ్రమందు [4] ద్రిష్టి బెట్టుకొన్నవాడై.

1 ABE స్థిరముగాను సమముగాను C స్థిరముగా సమముగాను F స్థిరముగాను సమముగా 2 ACF ధరింపుచున్నవాడై E ధరియింపుచున్నవాడై 3 ACE తన నాసాగ్రమందు 4 AE దృష్టిపెట్టు.

## 14

ప్రశాంతాత్మా విగతభీః బ్రహ్మచారివ్రతే స్థితః
మనః సంయమ్య మచ్చిత్తో యుక్తఆసీత మత్పరః॥

శాంతచిత్తుడై. [1] భయరహితుడై. బ్రహ్మచారియై. వ్రతస్తు(స్థు)డై మనస్సు నియమించి. నా యందేపెట్టి. నేనే [2] పరమైనఫలముగా దలచుకొని. యిటువంటి [3] యోగముతో గూడినవాడై [4] వుండేది.

1 B బంధరహితుడై, 2 ABCF పరమమైన 3 ABC యోగముతోడ 4 AB వుండెడిది.

## 15

యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి॥

యీరీతి ధ్యానయోగి సర్వకాలమందున్నూ నాయందు [1] చిత్తం గూర్పుటవల నను మనస్సు నిల్పినవాడై, నాచాతను పవిత్రంగా జాయబడిన మనస్సుగలవాడై, నాచాత బ్రవేశింపబడినటువంటి మోక్ష [2] సమమయిన శాంతి బొందును.

1 AB చిత్తము గూర్చుటవల్లను 2 B సమానమైన

16

నాత్యశ్నతస్తు యోగోఽస్తి న చైకాంతమనశ్నతః
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున॥

మిక్కిలిన్నీ భోజనం చేశినవానికిన్ని [1] యోగం లేదు; మొదలికి భోజనం విడిచిన వానికిన్ని [2] యోగం లేదు. [3] మనస్సున్నూ వకటిన్నీగాదు; [4] అతినిద్ర పరునికిన్నీ [5] యోగం లేదు. [6] అతిజాగరపరునికిన్నీ [7] యోగంలేదు.

1 C లో-యోగంలేదు-లేదు. 2 ABCEF లలో-యోగంలేదు-లేదు. 3 ACEF మనస్సు వొకటిగాదు; B మనస్సు వొక్కటిగాదు గనక యోగం లేదు. 4 ABCEFG అతినిద్రాపరునికిన్ని 5 E లో-యోగంలేదు-లేదు. 6 A లో - అతిజాగర పరునికిన్ని-లేదు. B అతిజాగ్రపరునికిన్ని E అతిజాగ్రతపరుని కిన్ని F అతిజాగార పరునికిన్ని 7 A లో-యోగంలేదు-లేదు. F యోగం లేదు. వో యర్జునుడా! మరెటువలె నంటేను?

17

యుక్తాహార విహారస్య యుక్త చేష్టస్య కర్మసు
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా॥

[1] తగుమాత్రం [2] ఆహారమున్ను, [3] విహారమున్నూ చేసుకొని, [4] పనులయెడ మిక్కిలిన్నీ ప్రయాసపడక, తగుపాటి నిద్రాను, తగుపాటి [5] మేల్కాంచుటాను గల వానికి యోగం [6] సర్వదుఃఖాలా [7] గెల్చును.

1 E తగుమాత్రములు 2 E ఆహారవిహారములు చేసు 3 C లో-విహారమున్నూ చేసుకొని- అన్నభాగం లేదు. 4 A పనులు చేశేవేళనున్ను మిక్కిలిన్ని BCF పనుల యెడాటాన మిక్కిలిన్ని E పనులయెడ తాను మిక్కిలిన్ని 5 A మేలుకాంచుటాను కల B మేలుకొనుటాను గల E మేలుకాంచుట గల 6 E సర్వదుఃఖాలను F సర్వదుఃఖాల 7 ABCEF జెరుచును.

## 18

యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే
నిస్స్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥

[1]యెప్పుడైనానేమి [2]ప్రయోజనాలందు [3]తగులమిగల చిత్తమునకు ఆత్మందే నిలుకడగా జేసుకొనును, అప్పుడు సర్వమైన [4]కోరికెలవలనను తగులమిలేక యోగి [5]అనిపించుకొనును. అటనగాను వాడు యోగానకు [6]అర్హుడు.

1 B యెవ్వడైనానేమి 2 EF ప్రయోజనాలందలి 3 AC తగులముగల చిత్తమును B తగులమిచిత్తమును E తగులమిగలిగిన చిత్తమును FG తగులమిగల చిత్తమును 4 AG కోరికెలవల్నాను B కోరికలవల్లాను C కోరికలవల్లా 5 E లో–అనిపించుకొనును. ఆటనగాను వాడు యోగానకు అర్హుడు–అన్న భాగంలేదు. 6 AB అర్హాం డనుట. C అరుహుడౌట. FG అర్హు డంట.

## 19

యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః॥

గాలిచాటున [1]నుండేదీపము [2]యేలాగుననైనా చలింపదు, [3]ఆలాగే మనస్సుచాతను ఆత్మయోగం చేశేఅటువంటి [4]యోగియొక్క చిత్తానకు [5]ఆదీపం కదలనట్టె యోగిచిత్తమున్నూ చలింప[క] వుండవలె ననుట.

1 AC ఉండిన 2 A యేలాగున నేమి చలింపదు, C యే తీరున చలింపదు, 3 ABCF లలో–ఆలాగే–లేదు. 4 B యోగి చలింపదు. అని కదలనట్టె 5 ACFG ఆ దీపను ఉపమ. ఆదీపం కదలనట్టె

E లో ఈశ్లోక తాత్పర్యాలు లేవు.

## 20

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥

యోగసేవచాత నిలుపబడిన చిత్తం [1]యోగమందు నిలుచును. [2]యేయోగమందైనాను మనస్సుచాతను [3]ఆత్మను చూస్తున్నూ వున్నవాడై ఆయాత్మానుభవమందు సంతోషించును.

1 A ఆయోగమందు CF యేయోగమందు E యీ యోగమందు 2 A యోగమందైనాను C యేయోగమందైనా నేమి 3 ACE ఆత్మను చూస్తున్నవాడై B ఆత్మ చూస్తున్నవాడై F చూస్తున్నవాడై

## 21

సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్
వేత్తి యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః॥

[1] యిటని ఆత్మ అతీంద్రియమై తన బుద్ధిచాతను యెరుగదగినటువంటి ఘనమైన సుఖమును యేయోగమందు [2] యెరుగును; [3] యేయోగమందుండి యీపురుషుడు తత్త్వమార్గమందు చలింపడు.

1 A యిటనెడి ఆ జితేంద్రియమయిన బుద్ధి B యిటని అతీంద్రియమైన బుద్ధి C యిటనెడి అతీంద్రియమైనబుద్ధి E యిటనేటి అతీంద్రియమైన తనబుద్ధి F యిటనెడి అతీంద్రియమై తనబుద్ధి G యింద్రియాల నతిక్రమించి తనబుద్ధి 2 E యెరుగునో; 3 E ఆయోగమందుండె

## 22

యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥

యే యోగం బొంది [1] అంతకంటె [2] అన్యమైన లాభమును అధికముగా [3] దలచెడి [4] యోగమందుండే ఘనమైన దుఃఖం [5] వచ్చినా చలింపడు.

1 C అంతకంటేను 2 E అన్యలాభమున్ను 3 A దలచడు. E తలపడు. 4 A యేయోగమందుండి E యేయోగివరుడు 5 BC వచ్చినాను

## 23

తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా॥

దుఃఖసంయోగమును [1] వకమరి పొందనటువంటి [2] యోగము [3] యోగశబ్దానకు [4] అర్థం. [5] నిశ్చయచిత్తంతోడను [6] ఆ యోగం [7] సాధింపదగినది.

1 AG వొకమరిన్ని B వొకపరిన్ని E వొకమారన్ని F వొకమాటు 2 A యోగజ్ఞానముకు B యోగజ్ఞానము E ఆయోగమును G లో లేదు. 3 A లో_యోగశబ్దానకు_లేదు. E యోగశబ్దార్థంకలిగింది కాని తెలిసేది నిశ్చ_4. CEG లలో_అర్థం_లేదు. 5 A నిశ్చితముతోడను B నిశ్చయచిత్తంచాతను G నిశ్చయించిన చిత్తముతోడనున్ను 6 ABCEFG మరువని తలపుతోడను ఆ యోగం 7 G సాధింపబడేది.

## 24

సంకల్పప్రభవాన్కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః॥

[1] అటుగనుక [2] యింద్రియసంబంధము సంకల్పమువలన [3] బుట్టినటువంటి [4] సమస్త [5] కోరికెలున్నూ [6] విడిచి, యింద్రియ [7] సమూహాము [8] అన్నిదిక్కులకున్నూ పారకుండాను [9] మనస్సుచాతను నియమించి.

1 ABCEF లలో-అటుగనుక_లేదు. 2 ABEF యింద్రియసంబంధసంకల్పము 3 E బుట్టిన సమస్త 4 ABCEF సమస్తమైన 5 E కోరికెలను లెస్సగాను 6 E విడిచినవాడై F లో లేదు. 7 ABCEF సమూహామును 8 ACEF మనస్సుచాత నే అన్ని 9 ACEF లలో_మనస్సుచాతను_లేదు. B మనస్సుచాత

## 25

శనైః శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్॥

[1] మెల్లమెల్లనే ధైర్యంచాతను, వశంచేసుకోబడిన బుద్ధిచాతను. [2] మనస్సుచాతను ఆత్మందే నిలుకడ చేశి, మరి [3] కించిత్తున్నూ చింతింప [4] వలదు.

1 CF మెల్లనె మెల్లనె 2 ACF మనస్సును ఆత్మందే B మనస్సు ఆత్మందే E ఉపరమించేది. మనస్సును ఆత్మందే 3 A కించిత్తన్నా B కించిత్తైనను E కించిత్తూ G యించుకంతాను 4 BC వద్దు. E వద్దు.

## 26

యతో యతో నిశ్చరతి మనశ్చంచల మస్థిరమ్
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్॥

చంచల[1]స్వభావం గనక అస్థిరమైన మనస్సు [2]యే యే విషయాలందున్ను [3]బారక [4]నిశ్చయ మౌను, [5]ఆలాగున ఆత్మందే [6]ఆత్మను వశం [7]చేసుకునేది.

1 E స్వభావంగలిగిన 2 A యే విషయాలందున్ను B యే యే విషయాలందూ CFG యే యే విషయాలయందు E యేలాగున విషయాలందు 3 B బారనీక 4 ABCEFG నిశ్చల మవును, 5 C అటుగనక 6 ABCFG లలో–ఆత్మను–లేదు. E నియమించి 7 ACFG చేసుకొనేది. B శేసుకొని,

27

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమమ్
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్॥

[1]యీరీతి [2]రజోగుణము [3]నణచి [4]తన స్వరూపాననే వుండినటువంటి బ్రహ్మభూతుడై, ప్రశాంతచిత్తుడై, కల్మషరహితుడైన [5]యీ యోగిని [6]ఆత్మానుభవ రూపమైన [7]అపరిమితసుఖమును బొందును.

1 ACE యీరీతిని 2 B రజోగుణమున్ను 3 B లో–నణచి–లేదు. C నడచి 4 B వుచితస్వరూపాననే 5 B యోగి C యోగిన్ని F యీయోగిన్ని 6 E ఉత్తమమైన 7 ABCF వుత్తమసుఖమును పొందును. E ఆత్మానుభవరూప సుఖమును పొందును.

28

ఏవం యుంజన్ సదాత్మానం యోగీ విగతకల్మషః
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంత సుఖ మశ్నుతే॥

యీ చెప్పిన ప్రకారానను [1]ఆత్మానుభవముతో [2]నుండిన యోగి, ఆ యాత్మానుభవంవలననే [3]పూర్వకర్మంకల్మషాలల్లాను బాశి బ్రహ్మానుభవరూపమైన అపరిమిత సుఖమును బొందును.

1 A ఆత్మానుభవం F ఆత్మానుభవంతో 2 A బొందిన F వుండిన 3 ABCF పూర్వపుకల్మషాలల్లా పాశి G పూర్వకర్మాలనెల్లా బాశి

E పూర్తిపాఠం–యీచెప్పినప్రకారానను యెల్లప్పుడున్ను ఆత్మానుభవమును చేస్తున్న యోగి, పూర్వకల్మషాల నెల్లా బాసినవాడై, బ్రహ్మానుభవరూపమైన, అపరిమితమైన సుఖమును ప్రయాసంలేక సుఖాననే పొందును.

## 29

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥

[1]ఆతరువాతను [2]సర్వభూతాలం దుండెడి [3]ఆత్మనున్నూ [4]తన మనస్సం దున్నూ యోగయుక్తాత్ముడై [5]సర్వత్ర [6]వక్కరీతిగాను సమదర్శనుడై [7]చూచును.

1 C ఆతర్వాతనే E లో-ఆతరువాతను-లేదు. F ఆతరవాత 2 A సర్వభూతాలయందున్నా BCEFG సర్వభూతాలయందు వుండే 3 A లో లేదు. CEF ఆత్మనున్ను సర్వభూతాలనున్ను 4 ABEF తనమనస్సందు C తను మనస్సుయందు 5 E అంతట 6 ABCF వొక్క రీతివారిగాను E వొక్కరీతివారినిగాను 7 ABCEFG చూచును. యిది వొక దశ.

## 30

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥

[1]ఆ తరువాతను సర్వేశ్వరుడనైన నన్ను సర్వత్ర [2]వుండినవానిగానున్ను, [3]నాయందు [4]వున్నదిగానున్నూ. [5]యెవ్వడు చూచును, [6]వానికి జెడనివాడు నాకు జెడడు. యిటనగా యేమనుట [7]అంటేను? [8]యిట్లని ధ్యానపరునికి అవశ్యమున్నూ [9]ప్రసన్న మౌదును.

1 G ఆతర్వాతను CEF యీతరువాతను 2 E వుండినవాణ్ణిగాను, G వుండేవానిగానున్న, 3 A లో-నాయందువున్నదిగానున్నూ-అన్న భాగం లేదు. BG సర్వమున్న నాయందు E యెవ్వడు చూచును సర్వమున్న నాయందు 4 G వుండేవానిగానున్నను 5 G యెవ్వ డెవ్వడు 6 A వానిని నే చెడజూడను. వాడున్న BE వానికి నేను చడను. వాడు CFG వానికి నే జడను. వాడు 7 G అంటివా? 8 AE యీరీతిని BCFG యీరీతి 9 ABEF నేను ప్రసన్న మౌదు ననుట. G నేను ప్రసన్నుడ నౌదు నంట.

## 31

సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వ మాస్థితః
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే॥

ఆ తరువాతను సర్వభూతాలందున్నూ వుండెడి నన్ను వక్కనినే దృఢము గాను ఆశ్రయించి [1]యెవ్వడు [2]భజియించును. వాడు సర్వథా వుండినాను అటువంటి యోగి నాయందే తలపుగలవాడై [3]తలస్తుండును.

1 C లో లేదు. 2 AF భజించును, 3 AF తెలుస్తూ వుండును. BC తెలుస్తూ వుండును. యిది మూడో దళ.

G పూర్తిపాఠం-ఆతర్వాతను సర్వభూతాలయందున్ను వుండెడి నన్నును వొక్కనినే దృఢముగా నాశ్రయించి యెల్లప్పుడు స్మరిస్తు న్నుండును. యిది మూడో దళ.

E లో ఈశ్లోకానికి తాత్పర్యం లేదు. 32వ శ్లోక తాత్పర్యం ఇక్కడ వ్రాసినాడు.

## 32

ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమోమతః॥

P ప్రతిలో ఈశ్లోకానికి తాత్పర్యం లేదు.

A పూర్తిపాఠం—[1]సమస్త భూతాలయందున్ను సుఖమేకాని దుఃఖమేకాని తనవలెనె[2]కా అని సరిగా జూచును [3]వోయి అర్జునుండా! [4]ఆతడు పరమయోగి అంటేను.

1 E ఆతరవాతను సమస్తభూతాలందున్ను 2 C కా సరిగా జూచును E కద్దని సరిగా చూచును 3 E వోయి అర్జునా! 4 CE అతడు

## 33

అర్జున ఉవాచ

యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్స్థితిం స్థిరామ్॥

గ

[1]వో మధుసూదనుడా! [2]యీసమస్తాత్మలున్నూ జ్ఞానస్వరూపులు గనుక [3]సరి అనే సమదర్శనరూపమయిన [4]యే యోగం చెప్పితివి [5]యిందున మనస్సు చంచలము గనుక స్థిరమైన నిలుకడ గానను.

ని BCF అర్జునుని వాక్యం E అర్జున వాక్యం

1 AE వోయి మధుసూదనా! BC వోయి మధుసూదన! 2 E యీ సమస్తమైన ఆత్మలున్ను 3 AE సరి యని B సరి అయిన F సరి అని4 A యేయోగమును BC యీయోగము E యోగమును 5 ABCF యిందుకు E అందు

## 34

చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥

[1]వో కృష్ణః చంచలమౌటబట్టుండి బలవంతమైన మనస్సు [2]చంచలం గనుక యీయాత్మను మిక్కిలిన్ని [3]మదించి అన్యత్రాసక్తుని జేసును. యీ మనస్సు నిగ్రహించే [4]మనెడిది గాలి మూటగట్టినట్టే దుష్కర [5]మైనది అంటేను.

1 A వో కృష్ణా! B వోయి కృష్ణ! CEG వోయి కృష్ణమ్మా! 2 ABCEF లలో-చంచలంగనుక-లేదు. 3 E మదింప G మదింపజేసి 4 BE మానేది 5 G మవును.

## 35

శ్రీ భగవానువాచ

అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥

ని

[1]వో యర్జునుడాః మనస్సు చంచలమనిన్నీ [2] అంటివి, అందుకు సంశయం లేదు. తన [3]ఆత్మయందు అభ్యాసంచాతను [4]మనస్సు పట్టవచ్చును.

ని B శ్రీకృష్ణ వాక్యం CEF కృష్ణుడు ఆనతిస్తున్నాడు G కృష్ణమ్మ ఆనతిస్తున్నాడు

1 ACG వోయి అర్జునుండా! B లో లేదు. E వోయి అర్జునా! 2 A నిగ్రహించరాని దనిన్ని యీలాగున అంటివి BCEFG నిగ్రహించరా దనిన్ని అంటివే 3 A ఆత్మ దగిలి C ఆత్మందలి E ఆత్మయందలి F అందలి 4 ABCF లోకమందలి వైరాగ్యంచాతను మనస్సు

13

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్॥

[1] మహాత్ము లయినవార లయితేను, తమ పుణ్యవశానను నన్ను శరణు జొొచ్చి, [2] ప్రకృతి నాశ్రయించి, [3] యితరుల దలపక, [4] నా శేవ [5] ప్రయోజనముగా గలవారలు, ప్రకృతిమూల మయినటువంటివీన్ని, [6] [చే]టులేనటువంటివీన్ని నన్ను నెరిగి [7] భజియింతురు.

1 ABFG మహాత్ములై తేను E వోయి అర్జునా! మహాత్ములై తేను 2 ABFG దైవప్రకృతినాశ్రయించి E దైవీప్రకృతినాశ్రయించినవారై 3 ABEFG ఇతరము దలపక 4 A నేనే B నా కంటే G నాచేశెడి 5 B ప్రయోజనంగలుగ దనే వానికి 6 A లో—చేటులేనటువంటివీన్ని—అన్న భాగం లేదు. 7 ABEFG భజింతురు.

C లో ఈ తాత్పర్యం లేదు.

14

సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥

మరీన్ని న న్నేరీతిని శేవింతు రంటేను? [1] యెప్పుడూన్ను నామకీర్తన శేయుచున్నవారలై, [2] నాయొక్క [3] కైంకర్యాదులయందు [4] యత్నం శేయుచున్న [5] వారలై, [6] భక్తిచాతను నమస్కారం శేయుచున్నవారలై, [7] నాతోడిదె యోగమున్ను నిత్యమున్ను సాధిస్తున్నవారలై నన్ను నుపాస్తి శేయుదురు.

1 AE యెల్లప్పుడును BFG యెల్లప్పుడున్ను 2 ABEF లలో—నాయొక్క— లేదు. G లో—నాయొక్క కైంకర్యాదులయందు యత్నం శేయుచున్నవారలై భక్తి చాతను నమస్కారం శేయుచున్నవారలై—అన్న భాగం లేదు. 3 A ధర్మాలందు 4 E దృఢమతులై యత్నం 5 E వారై 6 A దృఢవ్రతులై భక్తిచాతను B లో— భక్తిచాతను నమస్కారం శేయుచున్నవారలై—అన్న భాగం లేదు. 7 AEFG నాతోటి నిత్యయోగం కాంక్షిస్తున్నవారై నన్నుపాస్తి శేయుదురు. B నాతో నిత్యయోగం కాంక్షిస్తున్నవారై నన్ను వుపాస్తి శేయుదురు.

C లో ఈ తాత్పర్యం లేదు. శ్లోకం మొదటిచరణంలో సగం వ్రాసినాడు.

15

జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మా ముపాసతే
ఏకత్వేన పృథ_క్త్వేన బహుధా విశ్వతో ముఖమ్॥

మరికొందరు మహాత్ములు [1]జ్ఞానయోగంచాతను [2]నన్ను పూజిస్తున్నవారలై. [3]అనేకప్రకారాలను [4]యేకత్వరూపానను్న, అంతర్యామి రూపాననూన్న. [5]విశ్వతోముఖై [6]వున్న నన్ను [7]వక్కన్నే [8]వుపాస్తి శేయుదురు.

1 ABCEFG జ్ఞానయజ్ఞం చాతను 2 C లో-నన్ను-లేదు. 3 G అనేక ప్రకారాలచాతను 4 ABCEFG యేర్పరుపబడి అంతర్యామి 5 ABFG విశ్వతోముఖమై C సర్వతోముఖమైన E విశ్వతోముఖమైన 6 ABCEF వున్ననన్నును 7 ACEFG వొక్కడ నని B వొక డని 8 ABCFG వుపాశింతురు. C లో ఈ శ్లోకం మొదటి చరణంలో సగం వ్రాసినాడు.

16

అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహ మహమౌషధమ్
మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్ని రహంహుతమ్॥

జ్యోతిష్టోమాది క్రతువులున్నూ నేనే. [1]పితాళ్ల సంతోషింప[2]జేశే [3]అటువంటి స్వధాకారమూన్న నేనే. [4]అజ్యమున్న నేనే. [5]అగ్నిన్ని నేనే. [6]హోమమున్నూ నేనే.

1 A మహాయజ్ఞాలు నేనే. పితాళ్ల B మహాయజ్ఞాలున్ను. పితాళ్ల CEF మహాయజ్ఞాలున్ను నేనే. పితాళ్ల 2 C లో-జేశే-లేదు. 3 ABCEFG లలో-అటువంటి-లేదు. 4 AF అవుషధమున్ను నేనే. మంత్రమున్ను నేనే. ఆజ్యమున్ను నేనే. BE ఔషధమున్ను నేనే మంత్రమున్ను నేనే ఆజ్యమున్ను నేనే C అవుషధమున్ను నేనే మంత్రమున్ను నేనే. అగ్ని న్నే నే. 5 B లో-అగ్నిన్ని నేనే హోమమున్ను నేనే-అన్నభాగం లేదు. 6 A హుతమున్ను నేనే C లో లేదు.

17

† పితామహస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజురేవ చ॥

† [అన్ని ప్రతుల్లో "పితామహస్య" అనే రూపమే ఉంది. ఇది "పితాహమస్య"కు వర్ణవ్యత్యయ రూపం]

యీ జగత్తుకు [1]తల్లీన్ని నేనే. [2]తండ్రీన్ని నేనే. [3]ధాతనూన్ను నేనే. వుత్పత్తి హేతువులయిన [4]మూర్తులున్నూ నేనే. [5]వేదవేద్యుఁడ నేనే. [6]ఋక్సామ యజుర్వేదాలున్నూ నేనే.

1 A తల్లీ నేనే B తల్లిని నేనే CF తల్లి న్నేనే E తల్లినిన్ని నేనే 2 ABE తండ్రినీ నేనే C తండ్రీ నేనే 3 AEF తాతనున్ను నేనే B లో-ధాతనూన్ను నేనే-లేదు. C తాతను న్నేనే 4 ABEF ముత్తాతలున్ను C ముత్తాతలు న్నేనే G ముత్తాతనున్ను 5 C వేదవేద్యుఁడు న్నేనే F వేదవేద్యుఁడనున్ను నేనే 6 A పవిత్ర మున్ను నేనే. ప్రణవస్వరూపమున్ను నేనే. ఋగ్వేదసామవేదయజుర్వేదమున్ను నేను. B పవిత్రమున్ను నేనే. పుణ్యస్వరూపమున్ను నేనే. ఋగ్వేదయజుర్వేద సామ వేదాలున్ను నేనే. C పవిత్రము న్నేనే. ప్రణవస్వరూపము న్నేనే. ఋగ్వేద యజుర్వేదసామవేదాలు న్నేనే. E పవిత్రమున్ను నేనే. ప్రణవస్వరూపమున్ను నేనే. ఋగ్వేదయజుర్వేదసామవేదాలు నేనే. FG పవిత్రమున్ను నేనే. ప్రణవస్వరూప మున్ను నేనే. ఋగ్వేదసామవేదయజుర్వేదాలున్ను నేనే.

C లో 17, 18 శ్లోకాలు కలిపి వ్రాయబడ్డాయి. ఆ తర్వాత ఆ శ్లోకాల తాత్పర్యాలు కలిపి వ్రాయబడ్డాయి.

## 18

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవప్రళయస్థానం నిధానం బీజ మవ్యయమ్॥

పొందదగినవాఁడా నేనే. [1]సర్వమున్ను [2]భరించేటివాఁడా నేనే. [3]అన్నిటికీన్ని సాక్షీన్ని నేనే. వునికిపట్టున్నూ నేనే. రక్షకుఁడా నేనే. [4]అందరికీన్నీ పుట్టుగుల కున్నూ కారణమున్నూ నేనే. [5]నిధానమున్నూ నేనే. చెడని కారణమున్నూ నేనే.

1 ABCFG సమస్తమున్ను E అన్నిటినిన్ని 2 AB భరించినవాఁడా CF భరించెడివాఁడా E భరించేవాఁడా G ధరించేవాఁడ 3 A ప్రభువునున్ను నేనే, అన్నిటికిన్ని సాక్షిని B అన్నిటికిన్ని సాక్షిన్ని CF ప్రభువు నేనే. అన్నిటికిన్ని సాక్షి EG ప్రభువనున్ను నేనే. అన్నిటికిన్ని సాక్షినిన్ని 4 A చుట్టమున్ను నేనే. అందరిపుట్టుగుల కున్ను B శిక్షకుఁడా నేనే. చుట్టమునున్ను నేనే. అందరి పుట్టుగులకు E చుట్టము

నేనే. అందరి పుట్టుగలవు F చుట్టమునున్ను నేనే. అందరి పుట్టుగులవు G చుట్టమునున్ను నేనే. అందరిపుట్టుగలవున్ను నేనే కారణము. 5 ABEFG ప్రళయమున్ను నేనే. స్థానమున్ను నేనే. నిధానమున్ను C ప్రళయమున్ను నేనే. స్థావరమున్నే నే విలాసమున్ను

## 19

తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున॥

[1] యెండ గాసేవాడా నేనే. [2] వర్షం గురియకుండా జేశేవాడా నేనే. [3] వర్షం గురియించేవాడా నేనే. అమృతమున్నూ నేనే. మృత్యువున్నూ నేనే. [4] యిప్పుడు వున్న వస్తువులున్నూ నేనే. వచ్చెడి వస్తువులున్నూ నేనే.

1 E వోయి అర్జునా! యెండ 2 AE వరుషమును BCF వరుషం 3 AE వరుషమును BCF వరుషం 4 A యిప్పుడు వుండినవస్తువులు నేనే. పోయిన వస్తువులు నేనే. వచ్చేటి వస్తువులు నేనే. B యిప్పుడు వుండిన వస్తువులున్ను నేనే. పోయిన వస్తువులున్ను నేనే. వచ్చిన వస్తువులున్ను నేనే. C యిప్పుడుండిన వస్తువులు న్నేనే. పోయిన వస్తువులున్ను వచ్చెడి వస్తువులు న్నేనే. E యిప్పుడు వుండినవస్తువులు నేనే. పోయిన వస్తువులు నేనే. వచ్చెడి వస్తువులున్ను నేనే. F యిప్పుడువుండినవస్తువులున్ను నేనే. పోయిన వస్తువులున్ను నేనే. వచ్చెడి వస్తువులున్ను నేనే. G యిప్పుడు వుండినవస్తువులున్ను నేనే. పోయిన వస్తువులున్ను నేనే. వచ్చేటి వస్తువులున్ను నేనే.

## 20

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే
తే పుణ్య మాసాద్య సురేంద్రలోక
మశ్నంతి దివ్యాన్ దివి దేవభోగాన్॥

[1] యీరీతిని [2] అంతా నేనే యని [3] జ్ఞాను లయినవారు వుపాప్తి సేయుదురు. కేవలకర్మపరాయణు లైనవారు దేవేంద్రాదుల గూర్చి యజ్ఞాలు చేశి, [4] సోమపానం చేశి,

[5]పాపాలెల్లా [6]కడుగుకొని [7]స్వర్గం గోరుదురు. వారు పుణ్యమయిన [8]స్వర్గమును బొంది, స్వర్గమందు [9]దివ్యాలైన [10]భోగా లనుభవింతురు.

1 G ఓయి అర్జునా! యీరీతిని 2 G అంతాను సమస్తమున్ను చేసే అని 3 E వేదాంతిజ్ఞానులైనవారు 4 E సోమపానము చేసినవారై 5 A పాపము లల్లాను CF పాపా లల్లాను E పాపాల నల్లా 6 ABFG కడుక్కొని E కడుక్కొన్నవారై 7 E స్వర్గమార్గమును పొందుదురు. 8 ACFG ఆ స్వర్గలోకము B స్వర్గలోకం E స్వర్గలోకమును 9 C దివ్యమైన 10 AC దేవభోగాలను అనుభవింతురు. BEF భోగాలను అనుభవింతురు. G దివ్యభోగాలను అనుభవింతురు.

## 21

తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే॥

[1]వారు [2]విశాల మయినటువంటి [3]ఆ స్వర్గలోకమును అనుభవించి, ఆ పుణ్య[ం] తీరిపోతేను భూలోకం ప్రవేశింతురు. యీ ప్రకారానను [4]వే[ద]ధర్మం బొందీన్ని, కోరికెలు గోరుచున్నవారలు స్వర్గానకున్నూ, భూలోకానకున్నూ, పోచున్నూ, [5]వాస్తున్ను వుందురు.

1 A లో-వారు-లేదు. G వారలు 2 E విశాలమైన 3 ఆ స్వర్గమునను బాగా అనుభవించి 4 ABCEF వేదధర్మమును పొందిన్ని 5 A వస్తూవుందురు. B వస్తును వుందురు. CE వస్తున్ను వుందురు. F వస్తున్ను వుండుదురు.

## 22

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

[1]యేజనులునైనానేమి యితర దేవతల [2]గొలువక, కోరికెలు [3]గోరక, నన్నే గతి యని గొల్తురు; [4]నిత్యమున్నూ నాతోడియోగమే [5]అపేక్షించేవారి [6]యోగక్షేమం [7]వహించుకొని [8]మోక్షము యిత్తును.

1 A యేజనుడాయనేమి BCEF యేజనులైనానేమి G యేజనుడైనానేమి 2 E గొలువనివారై 3 A లేక E కోరనివారై 4 E యీతీరున నిత్యమున్ను 5 A అపేక్షించినవారియొక్క BCEFG అపేక్షించేవారియొక్క 6 AG యోగక్షేమమున్ను B క్షేమము CEF యోగక్షేమమును 7 AG నేను వహించుకొని E నేను వహించి 8 ABCF మోక్షము నిత్తును. E మోక్ష మిత్తును. G మోక్షము నిత్తు ననుట.

## 23

యేఽప్యన్యదేవతా భక్తా యజంతే శ్రద్ధయాన్వితాః
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్॥

[1]మరి [2]యెవ్వరైనానేమి నన్నెరుగక యింద్రాదిదేవతాభక్తు లయినవారలు [3]ఆయాయా దేవతలను తాత్పర్యముతోగూడ గొలిచినాను. వారున్నూ ముఖ్య ప్రకారము విడిచి. [4]అధమప్రకారాన [5]నన్నే [6]భజియించిన[7]వా రౌదురు.

1 A లో-మరి-లేదు. G వోయీ కౌంతేయుడా! మరి 2 ACEFG యెవ్వరాయనేమి 3 AFG ఆదేవతలను B ఆదేవతను C అధిదేవతలను 4 BG అధమప్రకారానను 5 A లో-నన్నే-లేదు. CF నన్నునే E వోయి అర్జునా! నన్నే 6 A లో-భజియించిన-లేదు. BCFG యజించిన E భజనచేసిన 7 A వుందురు.

## 24

అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ
న తు మా మభిజానంతి తత్త్వే నాత శ్చ్యవంతి తే॥

సర్వయజ్ఞాలకున్నూ [1]భోక్తానూన్ను. [2]ప్రభువున్నూ నేనే అయివుండగా. యీదేవతాంతరపరు లయినవారు నన్ను యథార్థముగా నెరుగరు. [3]అందువలననే లోకాలబొంది [4]దిగుడై పోదురు.

1 AB లో-భోక్తానూన్ను-లేదు. CEFG భోక్తనున్ను 2 B ప్రభువను C లో-ప్రభువునున్నూ-లేదు. 3 AG అందువల్ననే అల్పలోకాల BCEF అందువల్లనే అల్పలోకాల 4 AB దిగ్గుడై

## 25

యాంతి దేవవ్రతా దేవాన్ పితౄన్యాంతి పితృవ్రతాః
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్॥

[1]సర్వాత్మకు డని యెరుగక [2]దేవతల గొలిచినవారు [3]దేవతలనే పొందుదురు. [4]పితాళ్లను గొలిచినవారు పితాళ్లనే పొందుదురు. యక్షరక్షపిశాచాల [5]గొలిచినవారు వారినే [6]పొందుదురు. [7]దేవతలలోనున్నూ. పితాళ్లలోనున్నూ. [8]యక్షరక్షపిశాచాలలోనున్నూ అంతర్యామిని నేనే నని [9]వారిని [10]బూజించినాగాని నన్నే పొందుదురు.

1 A సర్వాత్ముడ నే నని BCEG సర్వాత్మకుడ నే నని 2 E దేవతలను కొలిచేవారు 3 ABCFG దేవతల బొందుదురు. 4 AF పితాళ్ల గొలిచినవారు పితాళ్ల బొందుదురు. B లో లేదు. 5 E కొలిచేవారు 6 A లో_ పొందుదురు. తాత్పర్యం ఇంతటితో పూర్తి చేయబడింది. 7 BCF దేవతలలోను పితాళ్లలోను E పీరు అందరిలోను అంతర్యామి నేనని 8 B యక్షరాక్షసపిశాచులలోను CFG యక్షరక్షపిశాచాలలోను E లో లేదు. 9 BCFG యెరిగినవారిని E యెరిగి నన్నే 10 B బూజించినగాని E పూజించినవారు

## 26

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥

[1]యెవ్వరైనానేమి కేవలం నన్నే [2]కొలిచేవారు ఆకుగాని. [3]పుష్పముగాని. [4]ఫలంగాని. వుదకంగాని భక్తిచాతను నాకు [5]సమర్పించెనా. పరిశుద్ధచిత్తుడైన వాని యొక్క భక్తితో సమర్పింపబడిన పూజను నేను [6]అవధరింతును.

1 ABCEF యెవ్వడాయనేమి 2 AB కొలిచినవాడు CEF కొల్చేవాడు G ఆశ్రయించినవాడు 3 E లో-పుష్పముగాని_లేదు. 4 AB లలో_ఫలంగాని_లేదు. 5 ABCEF సమర్పించును 6 E లో_అవధరింతును_లేదు.

## 27

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్॥

[1]యేదైనానేమి [2]దేహమాత్రం [3]నిత్యనైమిత్తి[క] కర్మము శేయుదువు. [4]యేదైనానేమి [5]భోజనం శేయుదువు. యే హోమం శేయుదువు. [6]యే దానా లిత్తువు.

[7]యే తపస్సులు శేయుదువు వో యర్జునుడా! [8]అంతవట్టున్నూ నాకు [9]సమర్పణ శేయుము.

1 BF యేదే నేమి 2 ACF దేహయాత్ర B యీ దేహయాత్ర 3 A లో_నిత్యనైమిత్తి [క] కర్మము_లేదు. BCF మొదలైన కర్మము నిత్య- 4 AB లలో_యేదైనా నేమి_లేదు. CF యేదేనేమి 5 B లో_భోజనం శేయుదువు_లేదు. 6 A దానాలు శేయుదువు. 7 A లో_యే తపస్సులు శేయుదువు_లేదు. BCF యేతపస్సు సేయుదువు. 8 A యింతవట్టు తపస్సు మొదలైనవి మాకు 9 B సమర్పణము

E పూర్తిపాఠం—యేదాయ నేమి భోజనము శేయుదువు, హోమము శేయుదువు, యేదాయ నేమి దానాలు యిత్తువు, యేదాయ నేమి తపస్సు శేయుదువు. వోయి అర్జునా! అంతవట్టున్ను నాకు సమర్పణముగా శేయుము.

28

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబంధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి॥

యీ ప్రకారాన [1]జ్ఞానయోగముతోగూడిన తలపు గలవాడవై, [2]నాకు శరణు [3]జొచ్చి నడిస్తేను, [4]అశుభమును [5]యిచ్చే పుణ్యపాప[6]రూపమైన పూర్వకర్మ [7]బంధాలచాతను విడువ బడేవు. [8]యీరీతిని [9]పుణ్యపాపాలచాత విడువబడి నన్ను బొందేవు.

1 BG జ్ఞానయజ్ఞంతో 2 E నన్ను 3 E జొచ్చినట్టు లైతేను 4 ABCEFG శుభమున్ను అశుభమున్ను 5 ABFG యిచ్చేఅటువంటి E యిచ్చేటటువంటి 6 ACEFG రూపాలైన B రూపులైన 7 G సంబంధాలచేతను 8 A లో_యీరీతిని_లేదు. 9 A సర్వమైన పాపాలచాతను

29

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజంతి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥

అయితేను నీకు కొందరందు వైషమ్యమున్ను కొందరందు [1]దయలేకుండుటాను కలదా అంటివా? లేదు. సర్వభూతాలందున్నూ [2]సముడను. నాకు [3]పగవారున్ను లేరు. [4]ప్రియులున్ను లేరు. [5]యెవ్వరైనా నేమి భక్తిచాతను నన్ను

భజియింతురు, వారు యేజాతివారైనాను [6]నాయందే భక్తిగలవారు: వారందున్ను నేను [7]దయగలిగి వుండుదును.

1 A దయగలుగుటను గల దంటివా? B దయానులేకుండుటను కలదో అంటివా? C దయలేకుండుటాను కలదంటివా? E దయానుకల దంటివా? F దయ లేకుండుటను గల దంటివా? G తాత్పర్యమున్ను కలదా అంటివా? 2 B లో-సముడను_లేదు. E నేను సముడను. 3 AEFG పగవాడున్ను లేదు. C పగవాడున్ను లేదు. 4 ABCEFG ప్రియుడున్ను లేదు. 5 A యెవ్వరేమి BFG యెవ్వరేనేమి C యెవ్వడేనేమి E యెవ్వరాయనేమి 6 A నాయందు భక్తిగలట్టి వారియందు నేనున్ను BEF నాయందు భక్తిగలట్టివారియందున్ను నేను C నాయందు భక్తిగల వార్లై [న] వారియందున్ను G నాయందు భక్తిగలయట్టి వారలందున్ను నేను 7 BEF దయగలిగి వుందును. C భక్తిగలిగి వుండుదును.

## 30

అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధురేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః॥

[1]మిక్కిలీన్ని [2]దురాచారా లయిన[3]వారైనాగాని [4]అన్యుల [5]భజియించక యీ చెప్పిన ప్రకారాన [6]నన్నే భజియించెనా సాధువున్ను వాడే. బహుమానం శాయ దగిన వాడున్నూ వాడే.* [7]యెరుకగలవాడూన్ను వాడే. లెస్స నడకగలవాడున్నూ వాడే.

1 A మిక్కిలి 2 AB దురాచారులైన C దురాచారుడైనా EFG దురాచారైన 3 A వారుగాని B వాండ్లుగాని CG గాని E వాడైనాను F వాడైనాగాని 4 E అన్యదేవతల 5 ABF భజించక C భజింపక E భజనంశాయక 6 AF నన్నునే E నన్ను 7 C లో-యెరుకగలవాడూన్ను వాడే_లేదు.

*B లో తాత్పర్యం ఇంతవరకే ఉంది.

## 31

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥

యీరీతిని [1]నేనే ఫలముగా దలచి, నన్ను [2]దలచి, నన్ను [3]గొలిచెనా. [4]పాపాలన్నీ అణగి వేగిరమే ధర్మాత్ము డవును. అంతకంటెను వేగిరమే సదా

నాతోడి అనుభవ [5]మంది శాంతి బొందును. [6]వో యర్జునుడా! [7]యీ అర్థమందు తప్పులే దని [8]యెవరి ముంగల నైనాను నామాట నమ్మి ప్రతిజ్ఞ శేయుము. నాయొక్క భక్తుడు చెడడు.

1 A లో-నే నే-లేదు. 2 ABCEF లలో-దలచి నన్ను-లేదు. 3 ABCF గొలిచె గనుక 4 ACEF పాపాలల్లాను B పాపాలల్లా 5 ABCEF మనెడి 6 E వోయి అర్జునా! 7 C యీధర్మమందు 8 ABCEF యెవ్వరిముందర

32

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాం గతిమ్॥

నన్ను మిక్కిలీన్ని ఆశ్రయించిరా పాపయోనియందు జన్మించిన [1]స్త్రీలు. వైశ్యులు, శూద్రులు[2]గాని, యెవ్వరైనా [3]పరమగతిని బొందుదురు.

1 ABFG స్త్రీలు, వైశ్యులు, శూద్రులైనవారున్ను C స్త్రీలు, వైశ్య, శూద్రులైనవారు 2 ABCFG లలో-గాని యెవ్వరైనా-లేదు. 3 AG వో అర్జునుండా! పరమగతి బొం- BCF పరమగతి బొం-

E పూర్తిపాఠం-వోయి అర్జునా! యెవ్వరాయనేమి పాపయోనియందు జన్మించిన స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మొదలైనవారు మిక్కిలిన్ని నన్నాశ్రయించిన వారౌదురు; వారున్ను పరమమైన గతిని పొందుదురు.

33

కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్॥

పుణ్యయోనులయిన [1]బ్రాహ్మణులున్నూ, భక్తులున్నూ, [2]రాజర్షులున్ను అయితేను యేమి [3]చెప్పవలె గనుక. [4]నీవు [5]అనిత్యమైన, సుఖములేని దైన యీ లోక[6]మందును [7]రాజరుషివి [8]గనుక నీవూన్ను [9]భజియించుమీ.

1 E బ్రాహ్మలున్ను 2 ABEG రాజరుషులున్ను F రాజఋషులు 3 AE చెప్పేను. అటుగనుక BF చెప్పను. అటుగనుక 4 E లో-నీవు-లేదు. 5 ABEF

అనిత్యమై సుఖము 6 ABF మందు పుట్టివుండెడి E మనుపొంది పుట్టివుండే 7 A రాజరుషు లైన BF రాజరుషి వైన E రాజరుషి వని 8 ABCEFG అలోచనకరేము, 9 A నన్ను భజించు, BCFG నన్ను భజింపుము. E నన్ను బజియింపుము,

34

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మా మే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

సర్వేశ్వరుడ నైన నాయందు మనస్సుగలవాడవు [1]గావున నాయందు మిక్కు తెగని భక్తిగలవాడవు గమ్ము. నన్ను గూర్చి [2]భజింపుము. నన్నుగూర్చి [3]నమస్కరింపుము. నేనే [4]పరమమైన గతిగా దలచినవాడవై [5]యీ క్రమాన మనస్సు నాయందు [6]బెట్టితివా నన్నే [7]పొందేవు.

1 A గాన నాయందు BCEFG గా నాయందు 2 AF యజింపు. CG భజింపు. 3 ACE నమస్కరించు. FGనమస్కరింపు. 4 AG పరమమైనగతిగల వాడవై B పరమమైనగతిగలవాడ నని CF పరమగతిగాగలవాడవై E పరమమైన గతిగాను గలవాడవై 5 G యీప్రకారాన 6 ACFG బెట్టి వుండితివా. E బెట్టి వుంటివా. 7 E పొందెదవు.

ఇతి శ్రీమత్తాళపాకఅన్నమాచార్యుల కొమారుడు పెదతిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెనుగుచేశి వ్రాయించినది రాజగుహ్యయోగ మన్నది తొమ్మిదో అధ్యాయము.

A రాజవిద్యా రాజగుహ్య యోగోనామ నవమోఽధ్యాయః.

యిది శ్రీమత్తాళపాకఅన్నమయ్యగారి పుత్రుడు తిరమలప్ప భగవద్గీతార్థము తెలుగుచేశెను.

B హరిః ఓం తత్సదితి భగవద్గీతానూపనిషత్సు............హితాయాం వయ్యాశిక్యాం యోగశాస్త్రనిర్ణయే శ్రీమన్మహాభారతే శ్రీభీష్మపర్వణి శ్రీకృష్ణార్జునసంవాదే సకలవేదాంతశాస్త్రాభిమ్యృతే రాజగుహ్య యోగోనామ నవమోఽధ్యాయః. తాళ్లపాక తిరుమలయ్యగారు చేశిన భగవద్గీతల తెనుగుటీక తొమ్మిదో అధ్యాయం సంపూర్ణం.

C ఇతి శ్రీమత్తాళ్ళపాకఅన్నమాచార్యుల పుత్రుడు తిరుమలైయ్యంగారు భగవద్గీతార్థము తెలుగు వ్రాయించి నందున తొమ్మిదో అధ్యాయం సంపూర్ణం. రాజవిద్యా రాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః.

E ఇతి శ్రీమద్భాగవతే(?)పారమహంస్యాం రాజవిద్యా రాజగుహ్య యోగో నామ నవమోఽధ్యాయః.

F తొమ్మిదో అధ్యాయం సంపూర్ణం.

G ఓం తత్సదితి శ్రీభగవద్గీతా రాజగుహ్యయోగో నామ నవమోఽధ్యాయః.

పదో అధ్యాయం

# విభూతియోగం

1

శ్రీ భగవానువాచ

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥
§

[1]ఓయి [2]మహానుభావుడవైన అర్జునుడా! నాప్రభావం విని ప్రియపడు చున్నటువంటి నీకొరకు, నాయందు భక్తిపుట్టించు టనెడి [3]హితవు కాయ [4]నిశ్చయించినవాడనై, పరమమైనటువంటి [5]యేమైనానేమి తిరుగబడి చెప్పేను, ఆమాట వినుము.

§ BG శ్రీకృష్ణవాక్యం CF కృష్ణవాక్యం

1 ACF వో 2 ABF మహాబాహుండవైన అర్జునుడా! E మహానుభావుడా 3 ABF హితము కాయ C హితము జేయ 4 ABCFG నిచ్చగలవాడనై, 5 A మాట చెప్పేను వినుము. BCFG యేమాకైనానేమి తిరుగబడి చెప్పేను, ఆమాట వినుము.

E పూర్తిపాఠం– శ్రీకృష్ణవాక్యం: వోయి మహానుభావుడా! నాప్రభావం విని ప్రియుండౌచున్న నీకొరకు, నాయందు భక్తి పుట్టించుట యనే విచారము శేయ నిశ్చయించుటచేతను, పరమమైన యీరూపైనానేమి తిరుగానువాడును, నామాట వినుము.

2

నమే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాది ర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥

దేవతాసమూహాలున్ను [1]నాయొక్కప్రభావం యెరుగరు. దేవతలకున్ను, మహారుషులకున్నూ [2]నేనే మొదలై, నేను వారి కిచ్చిన జ్ఞానం అల్పం గనుక, వారు [3]నాస్వరూపం యెరుగలేరు.

1 ABCFG మహాఋషులున్ను, సర్వమైనవార్లున్ను, నాయొక్కప్రభావం 2 AG మొదలయినవారికి నేనే యిచ్చిన జ్ఞానం అల్పం గనుక, E మొదలు వారికి నేను యిచ్చిన జ్ఞానం ఉంది గనక, 3 ABCEFG నాస్వరూపమును

3

యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే॥

[1]దేవతలున్ను యెరుగలేనటువంటి [2]నన్ను నాదాసులు యేరీతిని [3]యెరుగుదు రంటివా? జన్మరహితుడనై [4]తుదామొదలున్నూ [5]లేకవుండెడి నన్నును సర్వలోకాల కున్ను వక్కడనే యేలికెగాను యెరిగి[న] మనుష్యులలోను యెవ్వడైనాను యామరక తలచును, వాడు సర్వపాపాలచాతను విడువబడును. [6]యిటని ఆనతిచ్చి అంతటను అర్జునునికి భక్తిపుట్టెడికొరకు తన మహిమ జెప్పుచున్నాడు.

1 ABCEFG దేవతలు యెరుగలేని 2 BCEF నిన్ను నీ దాసులు 3 ACF యెరిగే రంటివా? 4 AG తుద మొదలును B తుద మొదలు CF తుద మొదలున్ను 5 E లేక వుండేటి నన్ను 6 ABCEFG అని

4

బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయ మేవ చ ॥

బుద్ధీన్ని, జ్ఞానమున్నూ, భ్రమయకుండుటాను, వోర్పున్నూ, సత్యవాక్యమున్ను, యింద్రియనిగ్రహమున్నూ, శాంతీన్ని, సుఖమూన్ను, దుఃఖమున్నూ, మంచిపనులకు మనస్సుపుట్టుటాను, కానిపనులకు స్రుక్కుటాను, [1]భయమూన్ను, వెరపున్నూ లేక వుండుటాను,

1 ACEFG భయము, వెరపులే కుండుటాను, B భయమున్ను, వెరపులే కుండు టాను,

5

అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥

[1]హింసలేకుండుటాను, సమబుద్ధిన్ని, సంతోషమున్నూ, తపస్సున్నూ, దానమున్నూ, [2]కీర్తిన్ని యివి మొదలయ్ని భావాలు సర్వమున్నూ, సర్వమైన ప్రాణా(ణు)లకున్నూ నావలననే నానావిధాలయి పుట్టును.

1 ABCEFG అహింసాను, 2 C కీర్తిన్ని, అపకీర్తిన్ని, యివి మొదలైన E కీర్తిన్ని, అపకీర్తిన్ని యిది మొదలైన

6

మహర్షయ స్సప్తపూర్వే చత్వారో మనవ స్తథా
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥

యేడుగురు మహారుషులున్నూ, [1]నలువురు మనువులున్నూ సృష్టి [2]నిమిత్యమై బ్రహ్మ [3]వలన బుట్టినవారు. [4]వారివలన యిందరున్ను జన్మించిరి. [5]ఆ బ్రహ్మవలన మహార్షులు, మనువులు. [6]ఆ ప్రజలు యిందరున్ను నా సంకల్పాననే పుట్టినవారిగా దెలియుము.

1 B పద్నలుగురు G పదునలుగురు 2 BC నిమిత్తమైన 3 B వల్ల బుట్టినారు. 4 BCFG వారివల్ల యీ ప్రజలందరున్ను 5 BCFG ఆ బ్రహ్మ, మహర్షులున్ను, 6 BCFG యీ ప్రజలు అందరున్ను

A పూర్తిపాఠం- వారికంటె మొదలయిన సనకాదులు నలువురు, పదునలుగురు మనువులు, యేడుగురు మహ(హా)ర్షులున్ను, యీ ప్రజలు అందరున్ను నా సంకల్పాననే పుట్టినవారు. మరిన్ని సృష్టినిమిత్యమైన బ్రహ్మమువల్ను బుట్టినవారు. వారివల్న యీ ప్రజలు యిందరున్ను జన్మించిరి. ఆ బ్రహ్మ, మహర్షులు, సనకాదులు, మనువులు, ప్రజలున్ను కొందరిన్ని నా సంకల్పాన బుట్టినవారిగా దెలియుము.

E పూర్తిపాఠం- భృగ్వాదులైన యేడుగురు మహాఋషులున్ను, బ్రహ్మసావర్ణి, రుద్రసావర్ణి, ధర్మసావర్ణి, దక్షసావర్ణి అనే నలుగురు మనువులున్ను, సృష్టి స్థితి నిమిత్యమై బ్రహ్మవల్ల పుట్టినవారు. వారివల్లను యీ ప్రజలిందరున్ను జన్మించిరి.

ఆ బ్రహ్మ, మహర్షులు, మనువులు, యీ ప్రజలు అందరున్ను నా సంకల్పాననే పుట్టినవారిగా నెరుగుము.

7

ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥

ఆ సృష్టిస్థితిలయాలకు కారణమైన నాయొక్క యీ [1] విశ్వమున్నూ. కల్యాణగుణ [2] యోగమున్నూ *నడుస్తున్నది. యిటని యెరిగి, వివేకులయినవారు తలపు నామీదనే పెట్టి నన్ను భజింతురు.

1 ABF ఐశ్వర్యమున్ను

† A పాఠము- [2] యోగమున్ను యథార్థముగాను యెవ్వండేనేమి యెరుగును, వాడు చలింపని భక్తి [3] యోగముతోడను కూడును. అందుకు సంశయము లేదు.

2 E యోగమును యథార్థానుగుణయోగముగా 3 B యోగంతోగూడును CF యోగంతోడ గూడును E యోగముతోడను కూడినవాడౌను.

*నడుస్తున్నది యిటని యెరిగి ...............నన్ను భజింతురు- అన్న భాగం 8వ శ్లోకానికి సంబంధించింది.

8

అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః ॥

నేను [1] యెల్లజగత్తుకున్నూ వుత్పత్తికారణము, [2] నావలననే యిన్నిన్నీ [3] వర్తింపుచున్నుండును. [4] యిది యెరిగి, [5] తాత్పర్యముతోగూడాను విద్వాంసులున్నూ శేవింపుదురు.

1 ABCEF సర్వానకున్ను ఉత్పత్తికారణమును. G సర్వానకున్ను ఉత్పత్తి కారణమనుగా 2 ABCEG నావల్లను సర్వమున్ను F నావల్ల సర్వమున్ను 3 ABCEFG నడుస్తున్నది. 4 ACEF యిటని యెరిగి, B యిటని యెరిగిన 5 A వివేకులు తలపు నామీదనే పెట్టి నన్ను భజింతురు. BCEFG వివేకులైనవారు తలపు నామీద బెట్టి నన్ను భజింతురు.

9

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥

వారు [1]మరీన్ని నన్నేరీతున గొలుతు రంటేను: నామీద చిత్తంగలవాళ్లు, నన్ను బాః ప్రాణం[2]పట్టలేనివారున్ను, [3]వాకానొకళ్లకు నన్ను యెరుగించువాళ్లు, తమలో దాము [4]నాయొక్క కల్యాణగుణాలను చెప్పుకుంచూన్ను, బోధించు కొంచున్నూ వున్నవాళ్లై, నిత్యమున్నూ, [5]సంతోషించుకుంచూన్ను వుండుదురు.

1 E లోలేదు. 2 ABEFG పట్టలేనివాళ్లు, C పట్టలేరు. 3 ABCEFG ప్రతుల్లో-వొకానొకళ్లకు నన్ను యెరుగించువాళ్లు-లేదు. 4 ACEG నాకల్యాణగుణాలను చెప్పుకొన్నవాళ్లై, బోధించుకొంచున్నవాళ్లై, BF నా కల్యాణగుణాలను చెప్పుకొన్నవాళ్లై, బోధించుకొన్నవాళ్లై, 5 AB సంతోషించుకొంచు న్నుంగురు. రమిస్తున్నుందురు. CFG సంతోషించుకొంచు న్నుండురురు. రమిస్తున్నుండుదురు. E సంతోషించుకొంచు న్నుండుదురు.

10

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥

[1]యీరీతి నాతోడి సంతత[2]యోగముగా భజిస్తున్నవాళ్లకు నేను [3]సంతోషించుకొని, యిటువంటి బుద్ధితో[4]నుండీతేను నన్నే బొందుదురు. అటువంటి తలపు నేను యిత్తును. [5]ఆ తలపులోను వారున్ను నన్ను బొందుదురు.

1 ACEFG ఆరీతి B ఆరీతిని 2 ABCFG యోగముగోరి భజిస్తున్నవార్లకు 3 E సంతోషపూర్వకముగాను, 4 B నుండితే E గూడితేను 5 AG ఆ తలపుతో నున్న వారున్ను B ఆ తలపుతోవారు C ఆ తలపుతోవారున్ను E ఆ తలపుతోను వారు

11

తేషామేవానుకంపార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

12

అటువంటి [1] వార్లకు దయచేశేకొరకు [2] వారియొక్క హృదయమందు [3] నేను, వెలుగుచున్నటువంటి జ్ఞానదీపంచాతను అజ్ఞానంవలన [4] బుట్టినటువంటి విషయాలమీద వేడుక అని(నే) చీకటి చెరుతును.

1 ABCEFG వార్లను 2 ABCEFG వార్లయొక్క 3 ABCFG నేను నిలిచి, E నిలిచే నేను, 4 A బుట్టిన విషయాలందుల చీకటి చెరుతును. B బుట్టిన వేడుక చీకటి చెరుతును. CF బుట్టిన విషయాలందలి వేడుక చీకటిని చెరుతును. E బుట్టిన విషయాలవల్ల బుట్టిన వేడుకనే చీకటిని చెరుతును. G బుట్టిన విషయాలందలి వేడుకనే చీకటి చెరుతును.

## 12

అర్జున ఉవాచ

పరం[బహ్మ పరంధామ పవి[తం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్ ॥

ʒ

[1] పర[బహ్మమున్నూ [2] నేనే. పరంధామమున్నూ [3] నేనే. పరమపవి[త్రమున్నూ [4] నేనే, [5] అని వేదాలల్లా జెప్పును. శాశ్వతుడ వనీన్ని, [6] దివ్యపురుషుడ వనీన్ని. [7] దేవదేవుడ వనీన్ని, జన్మరహితుడ వనీన్ని, విభుడ వనీన్ని.*

ʒ BC అర్జునుని వాక్యం

1 CF పరం[బహ్మ 2, 3, 4 ABCEFG నీవే. 5 E లో—అని వేదాలల్లా జెప్పును—లేదు. 6 ABEFG దివ్యమైన పురుషుడ వనిన్ని, 7 AEFG ఆదిదేవుడ వనిన్ని, BC అలా లేదు. * E వేదాలెల్లా చెప్పును.

## 13

అహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాసః స్వయంచైవ [బవీషి మే ॥

నిన్ను [1] రుషులున్నూ, [2] నారదుడున్నూ, అసితుడున్నూ, దేవలుడూన్ను, [3] వ్యాసులున్నూ [4] మొదలయిన దేవఋషులున్నూ చెప్పుదురు. [5] ఆ రీతుననే చెప్పుచున్నాడవు.

1 AFG ఋషులున్ను, E సర్వమైన ఋషులున్ను, 2 ABEFG దేవఋషి యయిన నారదుడున్ను, C దేవఋషులైన నారదుడున్ను, 3 BFG వ్యాసుడున్ను, 4 ABCEFG మొదలయినవారు చెప్పుదురు. 5 ABCEFG యీరీతినే నీవున్ను చెప్పుచున్నాడవు.

## 14

సర్వమేత దృతం మన్యే యన్మాం వదసి కేశవ
నహి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥

[1]హో కేశవుడా: [2]నాతోడ జెప్పినంతవట్టున్నూ [3]సత్యమే అవును. [4]యించుకంతాను కడమ లేదు. [5]షడ్గుణైశ్వర్యసంపన్నుడవైన నీయొక్క స్వరూపము కానుపించజేసుట అల్పజ్ఞానులయిన దేవతలున్నూ యెరుగరు.*

1 E హోయి కేశవా! 2 ABFG నాతోడను నీవు చెప్పిన యింతవట్టున్ను C నాతోడను నీవుచెప్పే అంతవట్టున్ను E నన్నుకూర్చి యేమి చెప్పితివో యీ అంతవట్టున్ను 3 E సత్య(త్య)ముగానే యెంచేను. 4 BCFG యించికంతాను కడమ లేదు. E లో లేదు. 5 E హోయి షడ్గుణైశ్వర్యసంపన్నుడా! * ACFG దానవులున్ను యెరుగరు. B సత్యమే అవును.

## 15

స్వయమే వాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥

[1]సమస్తభూతాలా [2]పుట్టించేవాడవై, సమస్త[3]భూతాలా [4]నియమించి, దేవతలకున్నూ దేవుడవై, యీరీతి [5]సమస్తజగత్తులకున్నూ [6]స్వామివైన పురుషోత్తముడవు [7]గనుక, నిన్ను నీయాత్మచాతను నీవే యెరుగుదువు.

ర్ A అర్జునిని వాక్యం

1 CF సమస్తభూతాల E సమస్తభూతాలను 2 AB పుట్టించినవాడవై, 3 BC భూతాలనున్ను E భూతాల 4 E నియమించేవాడవై, 5 C సమస్తదేవతల నున్ను E సమస్తజగత్తుకు 6 ABCEFG యేలికవైన 7 E నీవు గనక,

16

వక్తు మర్హ స్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః
యాభి ర్విభూతిభి ర్లోకా నిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

[1]యే ఐశ్వర్యాలచాతను యీలోకాలను [2]వ్యాపించుకొనియున్నాడవు. [3]అటు వంటి దివ్యమైన [4]అయిశ్వర్యాలు అన్నిటినీన్ని [5]చెప్పెడుకొరకు [6]తగుదువు.

1 E యే ఐశ్వర్యాలను యీలోకాలను 2 ABCEFG నీవు వ్యాపించుకొని వున్నాడవు, 3 E ఆ దివ్యమైన 4 A అయిశ్వర్యాలను అన్నిన్ని 5 ACFG చెప్పే కొరకు నీవే తగుదువు. B చెప్పెడికొరకు నీవే తగుదువు. E చేశేకొరకు 6 E లో లేదు.

17

కథం విద్యా మహం యోగీ త్వాం సదా పరిచింతయన్
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా ॥

భక్తియోగనిష్ఠుడనైన నేను, [1]సదా నిన్ను చింతింపుచున్నవాడనై నిన్ను [2]యేలాగున యెరిగేను? [3]యే మూర్తులయందు షడ్గుణైశ్వర్యసంపన్నుడవైన నీవు [4]చింతింపదగుచున్నాడవు?

1 B లో-సదా నిన్ను-లేదు. 2 C యేతీరున 3 ABCEFG యే యే మూర్తుల యందు 4 ACF చింతింపదగుచున్నవాడవౌచున్నాడవు? B చింతింపదగినవాడవౌ చున్నాడవు? E చింతింపదగినవాడవు అవుదువు? G చింతింపుచున్నవాడవౌ చున్నాడవు?

18

విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన
భూయః కథయ తృప్తి ర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

[1]వోయి జనార్దనుడా! [2]నీ యోగక్షేమమున్నూ, ఐశ్వర్యమున్నూ విస్తారం గాను [3]జెప్పుము. అమృత[4]స్వరూపులయిన నీ వాక్యాలు [5]వింటున్నా [6]తృప్తిలే దంటేను.

1 A వో జనార్దనుండా! BFG వో జనార్దనుడా! E వోయి జనార్దనా!
2 ABEG నీయొక్క యోగమును, అయిశ్వర్యమును CF నీయొక్క యోగమునున్ను,

అయిశ్వర్యమునున్ను 3 E మరి చెప్పుము. 4 ACFG స్వరూపములైన నీ వాక్యములు B రూపులైన నీ వాక్యములు E స్వరూపమైన నీ వాక్యమును 5 ABEG వించున్ను నాకు C వించు నాకు F వించున్న నాకు 6 A తృప్తి లేదు.

## 19

శ్రీ భగవానువాచ

హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే ॥

ౕ

[1]వోయి కురుశ్రేష్ఠుడైన అర్జునుడా! దివ్యాలయిన నా అయిశ్వర్యాలలోను ప్రధానమయినవార్లను నీకు జెప్పేను. నాయొక్క [2]అయిశ్వర్యం విస్తారానకు [3]కడమ లేదు.

ౕ ABG శ్రీకృష్ణవాక్యం C క్రిష్ణవాక్యం EF కృష్ణవాక్యం

1 ABFG వో కురుశ్రేష్ఠుడా! CE వోయి కురుశ్రేష్ఠుడా! 2 ACEFG అయిశ్వర్య విస్తారానకు 3 A కడలేదు. E కడపల లేదు గనక, మహాఆశ్చర్యము! FG కడపల లేదు.

## 20

అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥

[1]వో యర్జునా! సర్వభూతాలయొక్క హృదయాలందున్ను [2]వున్నవాడ నేను. ఆ భూతాలయొక్క [3]ఆదిమధ్యాంతాలున్ను [4]నేను.

1 A వో యర్జునుండా! 2 AG వున్నవాడను నేనే. BCF వున్నవాడను నేను. E ఆత్మనై యున్నవాడను నేను. 3 E ఆదిన్ని, మధ్యమున్ను, అంతమున్ను, 4 ABFG నేనే. C నేను యెరుగుదును.

## 21

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్
మరీచి ర్మరుతామస్మి నక్షత్రాణా మహం శశీ ॥

ఆదిత్యులలో [1]విష్ణువనే ఆదిత్యుడ నేను. జ్యోతిస్సులలోను [2]సూర్యుడ నేను. వాయువులలోను [3]మరీచి [4]అనేవాడ నౌచున్నాడను. నక్షత్రాలలో చంద్రుడ నేను.

1 B విష్ణుడనే 2 A కిరణములు గల సూర్యుడ E కిరణాలు గల సూర్యుడు 3 E లో–మనస్సున్ను నేను. భూతాలలోను జ్ఞానశక్తి నేను అవుదును–అనే వాక్యం వ్రాయబడింది. ఇది 22వ శ్లోక తాత్పర్య భాగం. 4 A అనే వాయువు నేను. నక్ష– B అనేవాడ నేను. నక్ష– G అవుచున్నాడను. అని వాక్యం పూర్తిచేయబడింది.

## 22

వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా॥

వేదాలలోను సామ[1]వేదము నేను, దేవతలలో దేవేంద్రుడ నేను. యింద్రియాలలోను [2]మనస్సు నేను. సమస్త [3]భూతాలలోను జ్ఞాన[4]శక్తిని నేను.

1 G వేదమున్ను నేనే. 2 B మనస్సును E మనస్సున్ను నేను. భూతాల 3 BCFG భూతాలలోనున్ను 4 ACFG శక్తి నేను. B శక్తినిన్ని నేను. E శక్తి నేను అవుదును.

E లో ఈ శ్లోకం లేదు. తాత్పర్యం కొంత భాగం మాత్రం 21వ శ్లోక తాత్పర్యంతో కలిపి వ్రాయబడింది.

## 23

రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్
వసూనాం పావకశ్చాస్మి మేరు శ్శిఖరిణా మహమ్ ॥

రుద్రులలోను [1]శంకరుడ నేను. యక్ష[2]రక్షస్సులలోను కుబేరుడ నేను. వసువులలోను [3]పావకుడ నేను. [4]కొండలలోను [5]మేరువు నేను.

1 E శంకరుడ నగుదును. 2 BG రాక్షసులలోను 3 C పావకుడ నేనే. అగ్నిన్నేనే. F పావకుడనేవాడ నేను. 4 EF కొండలలోపల 5 B మేరువుపర్వతమును నేను. CF మేరువపర్వతం నేను. G మేరువుపర్వతమ నేను.

A లో ఈ శ్లోక తాత్పర్యాలు లేవు. E లో ఈ శ్లోకం, తాత్పర్యం రెండు పర్యాయాలు ఒకేచోట వ్రాయబడివున్నాయి.

24

పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్
సేనానీనా మహం స్కందః సరసామస్మి సాగరః ॥

[1]వోయి పార్థుడా! పురోహితులలోను [2]ముఖ్యుడైన [3]బృహస్పతి నేను. [4]సేనాధిపతులలోను కుమారస్వామి నేను. సరస్సులలోను [5]సముద్రుడ నేను.

1 E వోయి పార్థ! 2 A లో లేదు. BCEFG ముఖ్యమైన 3 ABCG బృహస్పతిని నేను. E బృహస్పతిని నన్నుగా తెలియుము. F బృహస్పతిని సేనా- 4 BCEFG సేనాపతులలోను 5 A సాగరమనే సముద్రము నేను. BC సముద్రమును నేను. F సముద్రం నేను. G సముద్రమ నేను.

25

మహర్షీణాం భృగురహం గిరా మస్మ్యేకమక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞో ఽస్మి స్థావరాణాం హిమాలయః ॥

[1]మహారుషులలోను [2]భృగువ నేను. వాక్కులలోను యేకాక్షర [3]మనే [4]ప్రణవము నేను. యజ్ఞాలలోను [5]జపయజ్ఞము నేను. [6]స్థావరాలలోను [7]హిమవత్పర్వతము నేను.

1 ABCE మహర్షులలోను F లో_మహారుషులలోను_లేదు. 2 AE భృగువు నేను. 3 ABCEFG మైన 4 F ప్రణవ మేను. G ప్రణవమున్ను నేను. 5 B జపయజ్ఞమును నేను. C పరమయజ్ఞమ నేను. E జపయజ్ఞ మౌదును. F జపయజ్ఞమ నేను. G జపయజ్ఞమున్ను నేను. 6 B పర్వతములలో 7 B హిమవత్పర్వతమును నేను. E హిమవత్పర్వతమున్ను నేను. FG హిమవత్పర్వతమ నేను.

F లో ఈ శ్లోకం లేదు. తాత్పర్యం ముందుశ్లోకతాత్పర్యంతో కలిపి వ్రాయబడింది.

26

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః
గంధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః ॥

[1]సర్వమైన వృక్షాలలోనున్నూ [2]అశ్వత్థవృక్షము నేను. [3]దేవరుషులలోను నారదుడ నేను. [4]గంధర్వులలో చిత్రరథుడ నేను. సిద్ధులలోను [5]కపిలముని నేను.

1 AC సర్వవృక్షాలలోను E వృక్షాలలోను F సర్వవృక్షాలలోనున్ను G సర్వమైన వృక్షాలలోను 2 B అశ్వత్థవృక్షము నేను. CFG అశ్వత్థము నేను. 3 ACEG దేవఋషులలోను F దేవర్షులలోను 4 ABEFG గంధర్వులలోను 5 B కపిలమహామునిని నేను. EFG కపిలమునిని నేను.

27

ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్ ॥

[1]గుర్రాలలోనను [2]అమృతంతో బుట్టిన [3]వుచ్చైశ్శ్రవ మనే [4]గుర్రం నేను. [5]యేనుగలలోను [6]ఐరావతం నేను. నరులలోను [7]రాజు నేను.

1 ABEG గుర్రాలలోను CF గుఱ్ఱాలలోను 2 AC లలో-అమృతంతో బుట్టిన-లేదు. 3 BF ఉచ్చైశ్శ్రవ స్సనే C ఉచ్చైశ్శ్రవస మనే G ఉచ్చైశ్శ్రవమును నేను. 4 C గుఱ్ఱము నేనుగా నెరుగుము. E గుర్రము నేనుగా తెలియుము. F గుఱ్ఱము నన్నుగా నెరుగుము. 5 ABCEFG గజేంద్రులలోను 6 AG ఐరావత మనే యేనుగ నేను. B ఐరావతమును నేను. CF అయిరావతము నేను. 7 AG అధిపతియైనటువంటి రాజను నేను. BF రాజను నేను. E రాజును నేను.

28

ఆయుధానా మహం వజ్రం ధేనూనామస్మి కామధుక్
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః ॥

ఆయుధాలలోను [1]వజ్రాయుధం నేను. ధేనువులలోను కామ[2]ధేనువు నేను. [3]సర్పాలలోను వాసుకి నేను.

1 B వజ్రాయుధమును నేను. FG వజ్రాయుధము నేను. 2 AEG ధేనువ నేను. B కామధేనువును నేను. C ధేనువు నే నాచున్నాడను. F కామధేనువ నే నాచున్నాడను. 3 AB ప్రజలలోను మన్మథుడ నేను. సర్పాలలోను CFG జన్మించేవారిలోను జననహేతులైన కందర్పుడ నేనాచున్నాడను. సర్పాలలోను వాసుకి నేనాచున్నాడను. E జనియించేవారిలోను జననహేతువైన కందర్పుడ నేను. సర్పాలలోను

29

అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతామహమ్ ॥

[1]అనేకశిరస్సులుగల పాములలోను అనంతుడ [2]నేను. జలనివాసులలోను వరుణుడ నేను. [3]పితాళులలోను అర్యముడ [4]నేను. [5]దండించేవారలలోను యముడ నేను.

1 ABCEFG బహుశిరస్సులుగల 2 CFG నేనౌచున్నాడను. జల_ 3 ACEFG పితాళ్లలోను B పితాళ్లలోను యముడనేను. 4 CFG నేనౌచున్నాడను. దండించే_ 5 ACEFG దండించేవారిలోను యముడ నేను. B అష్టాంగయోగాలలోను యమమనే యోగమును నేను.

30

ప్రహ్లాద శ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్ ॥

దైత్యులలోను [1]ప్ల(ప్ర)హ్లాదుడ నేను. [2]లెఖ్ఖపెట్టేటివారిలోను కాలము నేను. [3]కాలమనగా నే ననుట. [4]మృగాలలోను [5]సింహ్వాం నేను. [6]పక్షులలోను [7]గరుత్మంతుడ నేను.

1 CFG ప్లహ్లాదుడ నే నౌచున్నాడను. E ప్లహ్లాదుడను ఔచున్నాను. 2 A లెఖ్క_పెట్టెడివారిలోను B లెఖ్ఖవెట్టెడివారిలోను CF లెఖ్క_వెట్టెడివారిలోపల EG లెక్క_బెట్టేవారిలో 3 AB కాల మనగా నే మృత్యువనుట. CF కాలము నేనన గాను మృత్యువుననుట. E కాలము నేను. అటనగా మృత్యువనుట. G కాల మనగా మృత్యువు నే ననుట. 4 EF మృగాలలోపలను 5 B సింహ్వామును నేను. C సింహ్వామ నేను. 6 CE పక్షులలోపలను 7 ABCEFG వైనతేయుడ నేను.

31

పవనః పవతామస్మి రామ శ్శస్త్రభృతామహమ్
ఝషాణాం మకర శ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ ॥

[1]ఆనడిచేవారిలోను [2]వాయువు నేను. [3]శస్త్రాలు [4]ధరించినవారిలోను [5]రఘు రాముడ నేను. [6]మచ్చ్యాలలోను [7]మకరమనే మచ్చము నేను. నదులలోను [8]జాహ్నవి నేను.

1 ABG లలో_ఆ_లేదు. C నడచెడివారిలో E నడిచేటివారిలోను F నడిచెడి వారిలోపలను 2 C వాయువ నేను. E వాయువును అవుచున్నాను. 3 A బాణాలలోను 4 A లో_ధరించినవారిలోను_లేదు. C ధరించినవారిలో G ధరించెడివారిలోను 5 A రామస్వామిబాణాలు నేను. B నాయకుడ నేను. CEFG రఘునాథుడ నేను. 6 AEG మత్స్యాలలోను BCF మచ్ఛాలలోను 7 B మకరమత్స్యమును నేను. CEF మకరమత్స్యము నేను. G మకరము నేను. 8 A గంగ నేను. C జాహ్నవినది నేను. E జాహ్నవిని అవుచున్నాను.

## 31a

†ఓషధీనాం యవ శ్చాస్మి ధాతూనామస్మి కాంచనమ్
సర్వేషాం తృణజాతీనాం కుశోఽహం పాండునందన ॥

E పూర్తిపాఠం: పైరులలోను యవపైరు నేను. లోహాలలోను బంగారు నేను. ఓోయి అర్జునా! సమస్తమైన తృణజాతులలోను దర్భ అనే తృణము నేను.

G పూర్తిపాఠం: ఓ యర్జునా! ఓషధులలోన...... ధాన్యం నేను. ధాతువులలోనల్లాను బంగారం నేను. తృణాలలోనల్లాను కుశదర్భ నేను.

† ఈ శ్లోక, తాత్పర్యాలు EG అనే రెండు ప్రతుల్లో మాత్రమే ఉన్నాయి. G లో 37వ శ్లోకతాత్పర్యాల తర్వాత ఉన్నాయి.

సంస్కృతమహాభారతం (భండార్కర్ ప్రతి)లో యీ శ్లోకం నేపాళదేశపు ప్రతికి (కాలం 1476 A. D.) సంబంధించిన 36వ శ్లోకంగాను, అధికపాఠంగాను చూపబడింది. (చూ. 7వ సంపుటం, భీష్మపర్వం, పీఠికాభాగంలోని ఫోటో ముద్రణ పుట; మరిన్ని 155వ పుటలోని అధోజ్ఞాపిక).

## 32

సర్గాణా మాది రంతశ్చ మధ్యం చైవాహ మర్జున
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్ ॥

[1]ఓో యర్జునుడా! [2]సృజియింపబడినవారలకు ఆదిమధ్యాంతకారణుడ నేను. [3]విద్యలలోపలను అధ్యాత్మ[4]విద్య నేను. [5]వాదించేవారిలోను తత్త్వ[6]నిర్ణయము చేశెడి వాదము నేను.

1 E వోయి అర్జునా! 2 AFG సృజింపబడెడివార్లకు BCE సృజియింపబడే వార్లక 3 ABCEFG విద్యలలోను 4 BG విద్యను నేను. 5 AF వాదించెడివారిలోను B వాదించేవాదములోను C వాదించేవారలలోను E వాదించేవాండ్లలోను 6 A నిర్ణయము చేసెడి వాదమును నేను. BC నిర్నయము చేశే వాదమును నేను. E నిర్ణయమైన వాదము నేను.

## 33

అక్షరాణామకారోఽస్మి ద్వంద్వ స్సామాసికస్య చ
అహమే వాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః ॥

[1]అక్షరాలలోనను [2]అకారం [3]నే నౌచున్నాడను. సమాసాలలోను ద్వంద్వ [4]సమాసము నేను. అక్షయమైన [5]కాలము నేను. చతుర్ముఖుడైన బ్రంహ్మదేవుడ నేను.

1 ABEFG అక్షరాలలోను C అక్షరాలాను 2 B అకారమును 3 AE నేను. సమా- 4 B సమాసమును నేను. 5 B కాలమును నేను. E కాలమున్ను నేను.

## 34

మృత్యు స్సర్వహర శ్చాహ ముద్భవశ్చ భవిష్యతామ్
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా॥

సర్వ[1]ప్రాణాలనున్ను [2]హరించే [3]మృత్యుదేవత నేను. [4]పుట్టేటి ప్రాణులలో [5]పుట్టుగనే కర్మము నేను. [6]శ్రీ(స్త్రీ)లలోన కీర్తిన్ని, శ్రీయిన్ని, వాక్కున్ను, స్మృతిన్ని, మతిన్ని, ధృతిన్ని, [7]క్షమా నేను.

1 AE ప్రాణులనున్ను BCG ప్రాణులను F ప్రాణులున్ను 2 BCEF హరించెడి 3 ACFG మృత్యు వనే దేవత నేను. B మృత్యువనే దేవతను. E మృత్యువు నేను. 4 ABCEFG పుట్టెడి ప్రాణులలోను 5 AC పుట్టు కనే కర్మము నేను. E పుట్టెడివాడా నేను. 6 ACFG స్త్రీలలోను 7 BE క్షమాను నేను.

## 35

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః ॥

[1]సామవేదాలలోను [2]బృహత్సామము నేను. ఛందస్సులలోను గాయత్రి నేను. మాసాలలోను [3]మార్గశిరమాసము నేను. [4]ఋతువులలోను వసంత[5]ఋతువు నేను.

1 ABF సామవేదంలోను C సామములోను 2 B బృహత్సామ నేను. G. బృహత్సామమున్ను నేను. 3 A మార్గశీర్షమాసం 4 ACEFG ఋతువులలోను 5 ACEG ఋతువు నేను. B ఋతువ నేను.

36

ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥

[1]యేదైనానేమి వక పదార్థము [2]అణకించి [3]పుచ్చుకొనేఅటువంటి చలపాదుల లోను [4]జూజము నేను. [5]జయమున్ను [6]నేను. [7]వ్యవసాయమున్ను నేను. [8]సత్వంగలవారిలోను [9]సత్వం నేను.

1 AFG యేదేనేమి వొక E యే ఒక పదార్థాలు అయినా 2 B అంకించి E మోసంచేసి 3 AEFG పుచ్చుకొనే చలపాదులలోను B పుచ్చుకొనే చలపాదు లలోనున్ను C పుచ్చుకొనే చలపాదులలో 4 ABFG జూదము నేను. E జూజము చేసేవాడను అవుచున్నాను. 5 A తేజస్సుగలవారిలో తేజస్సు నేను. జయము- BCFG తేజస్సుగలవారిలోను తేజస్సు నేను. జయము- E తేజస్సుగలవారిలోని తేజస్సు నేను. జయము- 6 BCFG నే నౌచున్నాడను. E అవుచున్నాను. 7 A వ్యవసాయం నేను. B వ్యవసాయమును నేనే అవుచున్నాడను. CFG వ్యవసాయం నే నౌచున్నాడను. E ఉద్యోగము అవుచున్నాను. 8 BCFG సత్వగలవారిలోను 9 B సత్వమును నేను. CFG సత్వ నేను.

37

వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః ॥

వృష్ణివంశం[1]వారిలోను వాసుదేవుడ నేను. [2]పాండవులలోను [3]ధనంజయుడ నేను. మునుల[4]లోను [5]వేదవ్యాసుడ నేను. కవులలో శుక్రుడ నేను.

1 G వారిలోపల 2 F పాండవవంశంవారిలోను G పాండవులవారిలోను
3 E అర్జునుడ నేను. 4 B లోపల 5 F వ్యాసుడ నేను.

38

దండో దమయతామస్మి నీతి రస్మి జిగీషతామ్
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥

[1]నియమము అతిక్రమించేవారిలో [2]దండింపుటా నేను. గెలువ [3]నిశ్చయించిన వారిలోను [4]జయోపాయ మనే నీతి [5]నే నౌచూవున్నాడను. రహస్యాల[6]లోను మౌనం నేను. [7]తత్త్వజ్ఞానం గల[8]వారిలోను [9]జ్ఞానం నేను.

1 ABCEFG నియమమును అతిక్రమించినవారిని దండించేవారిలోను 2 AG దండించుట నేను. E దండించేవాడ నేను. 3 G నిశ్చయించేవారిలోను 4 ACEFG జయోపాయమైన నీతి B జయమైన నీతిని 5 A నేను. రహస్యా- E అవుచున్నాను. 6 E లోపల మౌనము అవుచున్నాను. 7 A లో_తత్త్వజ్ఞానం... జ్ఞానం నేను_ లేదు. E తత్త్వజ్ఞానమువారిలోను 8 C వారలలోను 9 B జ్ఞానమును నేను.

39

యచ్చాపి సర్వభూతానాం బీజం తదహ మర్జున
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్ ॥

[1]సర్వభూతాలలోను [2]ఆ యా [య]వస్థల బొందించేవాడ నేను. చరాచర మయినటువంటి యీ భూతజాతము [3]వకటీన్ని నాతో బాశియున్నది లేదు.

1 ABCEFG సర్వభూతాలకున్ను 2 AG ఆ యా యవస్థ బొందించే కారణము నేను. B ఆ యవస్థం బొందించే కారణం నేను. CF ఆ యా యవస్థ బొందించే కారణమ నేను. E కారణము యేమి కద్దు అదిన్ని నేను. 3 A నాతో పాటెవున్నది వొకటిన్ని లేదు. BCFG నాతో బాశివున్నది వొకటిన్ని లేను. E నాతో బాశివున్నది యేది అవును అది లేదు.

40

నాంతోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా ॥

[1]వో పరమభక్తుడా! నాయొక్క [2]దివ్యవిభూతికి [3]కడపల లేదు. యీ విభూతియొక్క [4]విస్తారంలోను [5]సంక్షేపాన కొంత కొంత చెప్పబడెను.

1 ABCEG వో పరంతపుడా! 2 ABF దివ్యభూతికి E దివ్యమైన ఐశ్వర్యాలకు 3 AC కడమ లేదు. 4 E విస్తారాలచాత 5 ABCFG సంక్షేపాన కొంత నాచాత చెప్పబడెను. E సంక్షేపాన చెప్పబడెను.

41

యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశసంభవమ్ ॥

[1]యేదైనానేమి వక ఐశ్వర్యయుక్తమై [2]కాంతిగలిగినటువంటి [3]ప్రాణిజాతియు గలదు, ఆ [4]సర్వమున్నూ నాయొక్క [5]తేజస్సులోన [6]యించుక అంశముచాతను పుట్టిన[7]వానిగా నెరుగుము.

1 A లో_యేదైనానేమి వక_లేదు. DFG యేదైనానేమి వొకటి ఐశ్వర్యయుక్తమై C యేదైనానేమి వొక దివ్యప్రపురుషుడు అయిశ్వర్యయుక్తమై E యేది ఐశ్వర్యయుక్తమై 2 B లో_కాంతిగలిగినటువంటి_లేదు. C కాంతిగలటువంటి E కాంతిగలిగి ఊర్జితమైన ప్రాణి_ 3 ABCFG ప్రాణిజాతము గలదు, E ప్రాణిజాతము కద్దు, 4 E దానిని నాయొక్క_ 5 ABCEFG తేజస్సులోను 6 A యించుక అంశచాతను B యించికంశచాతను CFG యించిక అంశంచాతను 7 BCEG దానిగా నెరుగుము. F వానిగాను యెరుగుము.

42

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్ ॥

[1]వోయి అర్జునుడా! పెక్కుమార్లు [2]నీకు జెప్పేది యేమిగనుక? [3]నేను యీ సర్వమైన జగత్తునున్ను [4]నాయొక్క అంశాలలోను [5]వక అంశంచాతను [6]వ్యాపించి వున్నాడను.

1 E వోయి అర్జునా! లేకున్నట్టు ఆయనా పెక్కుమార్లు 2 ABCFG యీ యెరిగించుటచాతను యేమిప్రయోజనము? యీసర్వ E నీకు యెరిగించుటచాతను యేమి ప్రయోజనము? యీసర్వ 3 A యీసర్వజగత్తున్ను నేను CEFG యీసర్వ

మైనజగత్తున్నే నే. 4 ABCEG అనేకాంశలలోను F నాయొక్క అనేకఅంశాలలో 5 B వొక అంశను 6 B వ్యాపింస్తున్నాడను.

ఇతి శ్రీమత్తాళ్ళపాకఅన్నమాచార్యుల కొమారుడు పెదతిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెనుగుచేశి వ్రాయించినది విభూతియోగమన్నది పదో అధ్యాయము.

A విభూతివిస్తరయోగో నామ దశమోఽధ్యాయః. యిది తాళ్లపాక అన్నమయ్య పుత్రుడు తిరమలప్ప భగవద్గీతలు తెలుగుచేశెను.

B హరిః ఓం తత్సదితి శ్రీభగవద్గీతాసూపనిషత్సు పరబ్రహ్మవిద్యాయాం శతస(సా)హస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం యోగశాస్త్రనిర్ణయే శ్రీమన్మహాభారతే శ్రీభీష్మపర్వణి కృష్ణార్జునసంవాదే సకలవేదాంతశాస్త్రామృతే విభూతియోగో నామ దశమోఽధ్యాయః.

C ఇతి శ్రీమత్తాళ్ళపాకఅన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయంగారు భగవద్గీతా[ర్థ]ము తెలుగుచేశి వ్రాయించి నందు పదో అధ్యాయం సంపూర్ణం. విభూతివిస్తరయోగో నామ దశమోఽధ్యాయః.

E హరిః ఓం తత్సదితి శ్రీమహాభారతే భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే కృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ దశమోఽధ్యాయః.

F పదో అధ్యాయం సంపూర్ణం.

G పదో అధ్యాయము సమాప్తః.

పదకొండో అధ్యాయం

# విశ్వరూపసందర్శనయోగం

1

అర్జున ఉవాచ

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥

క

దేహమే [1]ఆత్మయని [2]భ్రమసి[న] నన్నును అనుగ్రహించేకొరకు, పరమమై, గోప్యమై, అధ్యాత్మమనే పేరగల [3]యేదైనా నొక్కమాట [4]మొదలి అధ్యాయాలందును [5]నీచాత చెప్పబడెను, [6]ఆ మాటచాతను నాయొక్క [7]అజ్ఞానము [8]విడుపింపబడెను.

క B స్వామి అర్జునునికి విశ్వరూపము చూపుచున్నాడు. అర్జునుని వాక్యం C అర్జున వాక్యం F అర్జునివాక్యం G అర్జునుని వాక్యం

1 CEF ఆత్మని 2 ABFG భ్రమశిన నన్ను 3 AG యేవాక్యమైన నేమి B యేదైనా వొకమాట 4 AG మొదలి అధ్యాయములయందు BCF మొదలి అధ్యాయాలందున్ను E మొదటి యేడధ్యాయాలందు 5 B నీచాతను 6 A ఆవాక్యముచే B లో_ఆమాటచాతను......విడుపింపబడెను_లేదు. 7 AFG యీ అజ్ఞానం 8 EF విడిపింపబడెను.

2

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్॥

[1]కమలపత్రాక్ష! ఆ మీది మూడు [2]అధ్యాయాలచాతను [3]ఉత్పత్తిప్రళయాలున్ను, [4]అవ్యయ మహ(మాహా)త్మ్యమున్ను విస్తరంగాను [5]నీవల్ల నాకు వినబడెను.

1 A వో కమలాక్షా! BCEFG వో కమలపత్రాక్షా! 2 AEG అధ్యాయముల చేతను C అధ్యాయాలచాతనున్ను 3 AG భూతముల వుత్పత్తిప్రళయములున్ను, E సమస్తభూతాలయొక్క ఉత్పత్తిప్రళయాలున్ను, 4 ACF అవ్యయమహాత్మ్యమున్ను B అవ్యయమైన మహత్వమున్ను E అసితమైన (అవ్యయమైన) మాహాత్మ్యమున్ను G అవ్యయ మాహాత్మ్యమున్ను 5 AEG నీచాత వినబడెను. B నీవల్లను నాకు వినబడెను. CF నీవల్లను నాచాత వినబడెను.

3

ఏవ మేత ద్యథాత్థత్వ మాత్మానం పరమేశ్వర
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ॥

వో పరమేశ్వరా: [1]నీ స్వరూపమునుగూర్చి [2]నీ వానతిచ్చినది తప్పదు. [3]వో పురుషోత్తముడా! సర్వేశ్వరుడవైన నీ విగ్రహమును చూడ [4]నిచ్ఛయిస్తున్నాడను.

1 ABCEFG నీ స్వరూపముగూర్చి 2 AG నీవానతిచ్చినదె తప్పదు. E నీవు యేది ఆనతిస్తివి అది నిశ్చయము. 3 AE వో పురుషోత్తమా! 4 A నిశ్చయింపుచున్నాడను. BCG నిశ్చయిస్తున్నాడను. E నిశ్చయిస్తున్నాను.

4

మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్॥

[1]సర్వానకున్నూ ఆధారమయినటువంటి నీరూపము [2]చూడ శక్యమౌ అనేది [3]చిత్తానగనక వుండెనా, [4]యోగీశ్వరుడవైన స్వామి: [5]నీ విగ్రహము [6]సకలము నాకు జూపమంటేను.

1 AG సర్వమునకు నాధారమైన E సకలానకున్ను ఆధారమైన G సర్వానకున్ను ఆధారమైన 2 ABCG నాచాత జూడ శక్యమానని E నీకు చూడ శక్యమానా అని 3 A చిత్తమున వుండెనా, BE నీ చిత్తాన వుండెనా, 4 A యోగీశ్వరుండవైన స్వామి! E యీ యోగీశ్వరుడవైన స్వామి వైతే 5 E నీ అవ్యయమైన విగ్రహము 6 CF సకలమున్ను BE లలో లేదు.

5

శ్రీ భగవానువాచ

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥

ర్

వోయి పార్థుడా: [1]నూరులసంఖ్య లయినటువంటీన్ని, [2]సహస్రసంఖ్య లయినటువంటీన్ని, [3]నానావిధాలయినటువంటీన్ని [4]నాయొక్క దివ్యరూపాలయిన మూర్తిని చూడుము.

ర్ CEF కృష్ణవాక్యం G శ్రీకృష్ణవాక్యం

1 AG నాయొక్క రూపు లసంఖ్యాలైన నానా- B నాయొక్క స్వరూపము నూర్ల సంఖ్యలైనటువంటివిన్ని E నూరుల, సహస- 2 AG లలో లేదు. B వేల సంఖ్యలైనటువంటివిన్ని E సహస్ర సంఖ్యలై 3 AG నానావిధములై C లో లేదు. E నానా విధాలై 4 A నానావర్ణా కృతులుంగల దివ్యరూపముల జూడుము. B నానావర్ణాకృతులగల అటువంటివిన్ని నానారూపులు చూడుము. C దివ్యాలైన రూపాలను చూడుము. E నానా వర్ణాకృతులు గల...దివ్యములైన నానా రూపములను చూడుము. F నానావర్ణకృత్యాలగల అటువంటివిన్ని దివ్యాలైన రూపము(లు) చూడుము. G నానావర్ణాకృతులుగల దివ్యాలైన రూపాలు చూడుము.

6

పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రా నశ్వినౌ మరుత స్తథా
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత॥

[1]వోయి భారతుడా! [2]ఆదిత్యులనూన్ను, వా(వ)సువులనూన్ను, రుద్రులనూన్ను, ఆశ్వనీదేవతలనూన్ను, [3]వాయువులయిన పంచాశన్మరుత్తులనున్ను, [4]అనేకాలయినటువంటి, [5]పూర్వమందు యెన్నడు చూడనటువంటి [6]ఆశ్చర్యాలను చూడుము.

1 A వో భారతా! 2 A ఆదిత్యవసురుద్రాశ్విని(నీ)దేవతలను, E ఆదిత్యులున్ను, వసువులున్ను, 3 B వాయువులైన పంచాశన్మరుత్తువులున్ను, E ఏకోన

పంచాశన్మరుత్తులున్ను చూడుము. 4 A అనేకములైన BCFG అనేకమైనటువంటి E ఆరీతిని అనేకమైన 5 A పూర్వము యెన్నడూ జూడని BCFG పూర్వము యెన్నడున్ను జూడనటువంటి E ఆశ్చర్యమై మునుపు యెన్నడు చూడనటువంటి 6 A ఆశ్చర్యములనున్ను చూడుము. E నాయొక్క స్వరూపమును చూడుము.

7

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్
మమ దేహే గుడాకేశ యచ్చాన్య ద్ద్రష్టు మిచ్ఛసి॥

[1]వోయి గుడాకేశుడైన అర్జునా! యిప్పుడు [2]నాయొక్క దేహమందు [3]సచరాచరమయినటువంటి సమస్తమయిన జగత్తున్నూ [4]వకచోటనె వున్నది. [5]మరిన్ని యేమి చూడ నిశ్చయించేవు. [6]అదీన్ని యిక్కడనే చూడుము.

1 ACFG వో గుడాకేశుడా! E గుడాకేశుడా! 2 AG దేహమునందు B నాదేహమందు 3 AG సచరాచరమైన యీ సర్వజగత్తున్ను BC సచరాచరమైనటువంటి యీ సమస్తమైన జగత్తు 4 ABFG వొక్కచోటనె వున్నది. C వొక్కచోట నున్నది. E వొక్కచోటనె వున్నట్టుగాను 5 B మరిన్ని యేమేమి చూడ E యేదేది చూడ 6 AG అవియున్ను యిక్కడనే చూడుము. BC అదిన్ని యిక్కడనే చూడుము. E అది నాదుదేహమందు చూడుము.

8

న తు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్॥

[1]నీయొక్క చర్మచక్షుస్సులచాతను [2]నన్ను జూడ శక్తుడవు గావు. నీకు [3]దివ్యదృష్టి యిస్తున్నాడను. [4]నాయొక్క [5]అఘటనఘటనాసామర్థ్యయోగమును చూడుము.

1 AB యీ నీచకర్మచక్షువులచే C యీ నీచకర్మచక్షుస్సులచాత F యీ నీచర్మంచక్షుస్సులచాతను 2 BCF నన్ను జూచేకొరకు శక్తుడవు గావు. నీకు E నాయొక్క దివ్యస్వరూపం చూడ శక్తుడవుగావుగనక, నీకు 3 A దివ్యదృష్టి యిచ్చుచున్నాడను. E దివ్యమైన దృష్టిని యిస్తున్నాను. 4 ABCEFG సర్వేశ్వరుడనైన నాయొక్క 5 E ఐశ్వర్యమును చూడుము.

9

సంజయ ఉవాచ

ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్॥

న్ర

[1]వోయి ధృతరాష్ట్రుడా! మహాయోగీశ్వరుడయినటువంటి [2]శ్రీహరి యీ ప్రకారానను ఆనతిచ్చి. [3]అంతమీదటను పార్థునికొరకు. [4]పరమమయినటువంటి. [5]సర్వమున్నూ యేలెడి [6]తనరూపమును చూపెను.

న్ర ABCEG సంజయుని వాక్యం F సంజయుని మాట

1 E వోయి ధృతరాష్ట్ర మహారాజా! 2 A హరి యీరీతి బలికి, BC హరి యీ ప్రకారాన బలికి, E హరి యీ ప్రకారముగా పలికి, F హరి యీ ప్రకారాన బలికె. G హరి యీ రీతి పలికెను. 3 ACFG అంతటిమీదను B అంతమీదను E తర్వాతను 4 AG పరమమై CEF పరమమైన 5 A సర్వము నేలెడి BE లలో లేదు. C సర్వమున్ను యేలేకొరకు F సర్వమున్ను యేలేటి 6 ACG తన రూపము జూపెను. B స్వరూపము చూపెను. E తన నిజస్వరూపమును చూపెను.

10

అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥

[1]ఆరూపం యెటువంటిదంటేను? [2]అనేకముఖాలు గలది. అనేక నయనాలు గలది. [3]అనేక ఆశ్చర్యాలు జూపుచున్నది. [4]అనేక దివ్యాభరణాలు జూపుచున్నది. [5]అనేక దివ్యాయుధాల జూపుచున్నది.

1ACFG ఆ రూపమెట్టిది అంటేను? 2 AG పెక్కుముఖములున్ను కన్నులుం గలది. B లో-అనేకనయనాలు గలది-లేదు. C అనేకముఖాల గలది. అనేకనైనాలు గలది. E అనేకముఖాలు గలది. అధికనయనాలు గలది. 3 AG అనేకాశ్చర్యములు చూపుచున్నది. C అనేకాశ్చర్యాల జూపుచున్నది. E లో లేదు. 4 AG అనేక దివ్యాభరణములు గలది. BCF అనేకదివ్యాభరణాల గలిగినది. E అనేకదివ్యమైన ఆభరణాలు ధరించినది. 5 A అనేకములై యెత్తిపట్టబడిన ఆయుధములు గలది. BCFG అనేకదివ్యాయుధాలను యెత్తి ధరించినది. E లో లేదు.

## 11

దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్॥

[1] దివ్యమైన మాల్యాలున్నూ, దివ్యమైన వస్త్రాలూన్ను ధరించినది. [2] దివ్య గంధం పూశినటువంటి[ది]. [3] సర్వాశ్చర్యమయినది. [4] అనంతమయినది. విశ్వతో ముఖమయినది. *

1 A దివ్యమాల్యవస్త్రములు ధరించినది. E దివ్యమైన పుష్పమాలికలున్ను, అనేకవింతలైన వస్త్రాలను ధరించినది. FG దివ్యమైన మాల్యాలున్ను ధరియించినది. 2 AG దివ్యగంధము నలందినది. E దివ్యగంధము బూసినది. 3 AFG సర్వాశ్చర్య మయమైనది. B సర్వాశ్చర్యమైనటువంటిది. 4 A దివ్యమైనది. కడలేనిది. విశ్వ— BF లలో లేదు. G అనంతమయమైనది. * E దివ్యప్రకాశమైనది.

## 12

దివి సూర్యసహస్రస్య భవే ద్యుగపదుత్థితా
యది భాస్సదృశీ సాస్యా ద్భాస స్తస్య మహాత్మనః॥

దివి ఆకాశమందుల కోటిసూర్యులు వక్కమాటే వుదయించినట్టాయనా, ఆ కోటిసూర్యులయొక్క తేజస్సున్నూ మహాత్ముడైన *శ్రీకృష్ణునియొక్క దివ్య శరీరమందు సర్వమైన జగత్తున్ను వక్కచోటనే వుండ చూచెను.

* శ్రీకృష్ణునియొక్క......వుండ చూచెను.— ఈ వాక్యం 13 వ శ్లోక తాత్పర్యంలోనిది.

A పూర్తిపాఠం—అనంతకోటిసూర్యులకాంతి వొక్కపెట్టుగను ఆకసము నందునేని, మహాత్ముడైన ఆ సర్వేశ్వరుని తేజమునకు సమమగును.

B పూర్తిపాఠం—అనంతకోటిసూర్యులకాంతి ఆకాశమందు యగసిన, మహాత్ముడైన సర్వేశ్వరునియొక్క తేజస్సుకు సమమౌను.

C పూర్తిపాఠం—అనంతకోటిసూర్యులకాంతి ఆకాశమందు యగశి, ఆ మహాత్ముడైన సర్వేశ్వరునియొక్క తేజస్సుకు సదృశమౌను.

E పూర్తిపాఠం—అనేకవేలసూర్యులయొక్కకాంతి ఆకాశమందు వొక్కసారే యెగసినట్టుఅయనా, ఆ మహాత్ముడైన ఆ సర్వేశ్వరునియొక్క తేజస్సుకు సమానమైనది యగును.

F పూర్తిపాఠం—అనంతకోటిసూర్యులకాంతి ఆకాశమందు వొక్కసారే యగళనా, మహాత్ముడైన సర్వేశ్వరునియొక్క తేజస్సుకు సదృశమౌను.

G పూర్తిపాఠం—అనంతకోటిసూర్యులకాంతి వొక్కపెట్టుగను ఆకసమునందు సేని, మహాత్ముడైన ఆ సర్వేశ్వరునియొక్క తేజస్సుకు సదృశమౌను.

13

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాండవ స్తదా॥

*శ్రీకృష్ణునియొక్క దివ్యశరీరమందు సర్వమైన జగత్తున్ను వక్కచోటనె వుండ చూచెను.

* P ప్రతిలో ఈ తాత్పర్యం లేదు. 12వ శ్లోకతాత్పర్యంతో కలిపి వ్రాయబడి ఉన్నందున, అందుండి స్వీకరింపబడింది. ఈ P ప్రతిలో 13 వ శ్లోకమూలం వ్రాసిన తర్వాత, వ్రాయసకాడు తాత్పర్యస్థానంలో క్రింది వాక్యాలు వ్రాసి ఉన్నాడు:

టీ॥ యీశ్లోకార్థం వెనుకటి శ్లోకార్థములోను వ్రాశివున్నది తెలుసుకొనుండా. ప్రతిలో వున్నట్టు వ్రాశినాడను. మరచి వ్రాయలేదూ. ॥౧౩॥

A ప్రతి పూర్తిపాఠం: [1]పాండవులు [2]అనేకవిధముల నేర్పడిన [3]సర్వజగత్తున్ను [4]దేవదేవుని విగ్రహామునందు [5]యొక్కచోటనె యుండంగాను [6]అప్పుడు చూచెను.

1 BCFG పాండవుడు E అర్జునుడు 2 B అనేకవిధాల యేర్పడివున్నటువంటి CFG అనేకవిధాలను యేర్పడివుండినటువంటి E యేర్పరుపబడిన 3 CFG సర్వమైన జగత్తున్ను E సకలజగత్తున్ను 4 BCFG దేవదేవునియొక్క శరీరమందు E దేవదేవునియొక్క దేహమందు 5 BCFG వొక్కచోటనె వుండగాను E ఒక్కచోట ఉన్నట్టుగానే 6 B లో–అప్పుడు–లేదు.

14

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత॥

[1]అటువంటి రూపము జూచి ఆ యర్జునుడు [2]ఆశ్చర్యముతో గూడినవాడై, [3]పులకాంకురాలు గలవాడై, ఆ దేవున్నిగూర్చి [4]పి(శి)రస్సు మోవను సాష్టాంగ దండంబెట్టి, [5]చేతులు మొగిచి పలికెను.

1 A తదనంతరమున నా యర్జునుండు BF అంతటిమీదను అర్జునుడు CG అంతటిమీద ఆ యర్జునుడు E యీ తీరున చూచినవాడై అర్జునుడు 2 A వెరగు పడి, పుల– 3 A పులకించి, E లో లేదు. G పులకాంకురాలు గలిగినవాడై, 4 A శిరము మోవ సాష్టాంగదండములు సమర్పించి, B శిరస్సు మోవ దండంబెట్టి, 5 B చేతులు మొగిడ్చి పలికెను. E చేతులు మొగిడ్చి ముకుళితకరకమలుడై, వొళ్ళు గగురుపొడువగాను వొకమాట పలికినవాడాయను.

## 15

అర్జున ఉవాచ

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేషసంఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థం
ఋషీంశ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్॥

క

[1]వో దేవదేవుడా! నీయొక్క దేహమందు [2]దేవతలున్నూ, సర్వప్రాణి విశేషాలయొక్క [3]సమూహములున్నూ, [4]బ్రహ్మనున్ను, ఆ బ్రహ్మ[5]యందున్నె శివున్నీన్ని, సర్వమయిన రుషీశ్వరులనున్నూ, దివ్యమైన [6]పురుషులనున్ను కనుచున్నాడను.

క B అర్జునుని మాట CG అర్జునుని వాక్యం E అర్జునుడు యేమని పలికెను అని అంటివా,

1 AFG వో దేవుడా! BE వోయి దేవుడా! C వోదేవా! 2 E దేవతలను, సకలమయిన ప్రాణి– 3 ABCEFG సమూహాలనున్ను, 4 C లో లేదు. E బొడ్డు తామెరయందు వుండే బ్రహ్మనున్ను, 5 E యందు వుండే శివుణ్ణిన్ని, 6 ACG పురగులనున్ను కంచున్నాడను. B పురగులనున్ను కనుగొనుచున్నాడను. E పురగులనున్ను చూస్తున్నాడను. F పురుషులనున్ను కంచున్నాడను.

16

అనేక బాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్
నాంతం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥

అనేక [1]బాహులున్ను, కడుపులున్నూ, [2]అనేక వక్త్రాలున్నూ, కన్నులున్నూ [3]గల నిన్ను అంతటాను పొడగంచున్నాడను. వో విశ్వేశ్వరుడవైన విశ్వరూపుడా! నీవు అనంతుడవు గనుక, నీకు ఆదీన్ని, మధ్యమున్నూ, [4]అంతెమున్నూ లేదు. యిటని దర్శిస్తున్నాడను.

1 ACEG బాహువులున్ను, అనేకకడుపులున్ను, BF బాహులున్ను, అనేక కడుపులున్ను, 2 ACEFG అనేక ముఖాలున్ను, అనేకకన్నులున్ను B అనేక ముఖాలున్ను గల- 3 B గల నిన్నును అంతెటా వుండ గనుచున్నాడను. E కలిగిన నిన్ను అంతటాను పొడగనుచున్నాడను. E ప్రతిలో ఈ తాత్పర్యం ఇంతటితో పూర్తి. 4 AFG అంతమున్ను లేదని దర్శిస్తున్నాడను. B అంత్యమున్ను లేదని దర్శిస్తున్నాడను.

17

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమంతమ్
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతా
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్॥

తేజోరాశివై, అంతటాను కాంతిగలవాడవై, కన్నులకు జూడ శక్యముగాక. మండుచున్న అనేక సూర్యులున్ను, అనేక అగ్నులున్నూ [1]వక్కటిగా గూడినట్టు యెరుగ శక్యముగాక [2]వుండెడి నిన్ను, కిరీటాలు గలవానిగానున్ను, గదలు గలవానిగా నున్ను, [3]చక్రాలు గలవానిగానున్ను [4]పొడగనుచున్నాడను. [5]వో విశ్వేశ్వరుడవైన శ్రీకృష్ణా!

1 ABCEFG వొకటిగా 2 AEFG వుండెడి నిన్నును B వుండెడు నిన్నును 3 ABCEFG చక్రాలు ధరించినవానిగానున్ను 4 ACEFG పొడగంచున్నాడను. B పొడగంచున్నాను. 5 ABCEFG లలో -వో విశ్వేశ్వరుడవైన శ్రీకృష్ణా!- లేదు.

18

త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరంనిధానమ్
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే॥

వేదాంతాలచాతను [1]యెరుగదగినది. అటువంటి. పరమమై, చెడని స్వరూపము గలవాడవు నీవె. [2]యీ సమస్తమైన [3]ప్రపంచమునకున్నూ నిదానమైనవాడవు న్నీవె. నాశరహితుడవై, నిత్యమైన ధర్మమును రక్షించే కొరకు ఆ యా రూపాన [4]సర్వదా అవతరించెడి సనాతనుడవైన పురుషుడవని నాచాతను యెరుగబడితివి.

1 ABCEFG యెరుగదగినటువంటి, పరమమైన చెడని- 2 C లో -యీ సమస్తమైన ప్రపంచమునకున్నూ నిదానమైనవాడవు న్నీవె- అన్నభాగం లేదు. 3 ABEFG ప్రపంచానకున్ను 4 ABCFG సర్వధా అవతరించెడి E సర్వదా అవతరించీ

19

అనాది మధ్యాంత మనంతవీర్య
మనంతబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్॥

ఆదిమధ్యాంతరహితుడవై, అనంతమైన పరాక్రమం గలవాడవై, [1]అనంతమైన బాహులు గలవాడవై, సూర్యచంద్రులు కన్నులుగా గలవాడవై, మండుచున్న అగ్నివంటి [2]ముఖాలు గలవాడవై, నీయొక్క తేజస్సుచాతను [3]యీ విశ్వమెల్లాను [4]తపింపజేస్తున్నావు. అటువంటి నిన్ను జూస్తున్నాడను.

1 AG అనంతములైన చేతులు గలవాడవై, BCE అనంతబాహులు గలవాడవై, F అనంతబాహుల గలవాడవై, 2 ACEFG ముఖం గలవాడవై 3 ACFG యీ విశ్వమల్లాను 4 AG తపింపజేస్తున్న మిమ్ముతు జూస్తున్నాడను. BE తపింపజేస్తున్న నిన్ను చూస్తున్నాడను. CF తపింపచేస్తున్న నిన్నును చూస్తున్నాడను.

20

ద్యావాపృథివ్యో రిద మంతరం హి
వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥

ఆకాశమున్నూ, [1]భూమిన్నియొక్క నడుమున్నూ, సర్వదిక్కులున్నూ [2]వక్కడవైన నీచాతను వ్యాపింపబడెగదా! [3]వోయి మహాత్ముడా! నీయొక్క ఆ(అ)ద్భుతమైన, [4]వుగ్రమైన [5]నీరూపము జూచి లోకత్రయమున్నూ [6]వెరస్తున్నది,

1 ABCFG భూమియొక్క నడుమున్ను, 2 AG యొక్కండవైన 3 ABCFG వో మహాత్ముడా! 4 A లో -వుగ్రమైన-లేదు. 5 AC యీరూపమును జూచి F యీ రూపమున్ను చూచి 6 CF వెరుస్తున్నది.

E లో ఈ శ్లోకతాత్పర్యాలు లేవు.

21

అమీ హి త్వా సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి
స్వస్తీత్యుక్త్వా మహర్షిసిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥

యీ సుర[1]సంఘాలు నిన్ను జూచి [2]సంతోషించుకుంచున్నూ [3]దగ్గర వస్తూన్నారు. కొందరు దేవతలు [4]అబలుల (అంజలుల) బట్టుకొని స్తోత్రం [5]శేయుచున్నారు. [6]మహార్షులూన్ను, సిద్ధసంఘాలూన్ను మేలు గావలెనని వుచితమయినటువంటి స్తోత్రాలచాతను నిన్ను స్తోత్రం శేయుచున్నారు.

1 BEF సంఘాలున్ను చూచి 2 ABCEFG సంతోషించుకొంచున్ను 3 ABEG డగ్గర వస్తున్నారు. CF దగ్గర వస్తున్నారు. 4 C అంజలి వట్టుక E అంజలులు బెట్టుకొని 5 BCE చేయుచున్నారు. 6 B మహర్షి సిద్ధగాంగేయ సంఘాలు మేలు- CEF మహర్షి సిద్ధసంఘాలు మేలు-

22

రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యాః
విశ్వేఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ
గంధర్వయక్షాసురసిద్ధసంఘా
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥

రుద్రులూన్ను, ఆదిత్యులూన్ను, వసువులూన్ను, సాధ్యులూన్ను, [1] విశ్వదేవతలూన్ను, [2] అశ్వనీదేవతులునున్ను, మరుద్గణులూన్ను, పితాళ్ళున్ను, గంధర్వులూన్ను, యక్షులూన్ను సురసిద్ధ [3] సమూహాలూన్ను అనెడివారు యెవ్వరెవ్వరు గలరు, సర్వమైన [4] వార్లున్ను [5] వెరగుపడి చూస్తున్నారు.

1 CEF విశ్వేదేవతలున్ను, 2 ACEG అశ్వినీదేవతలున్ను, మరుద్గణాలున్ను, పితాళ్లున్ను B అశ్వినీదేవతలున్ను, పితాళ్లున్ను, F మరుద్గణులున్ను, పితాళ్లున్ను, 3 B సమూహమున్ను అనెడియెవ్వరు గలరు, ACG సమూహాలున్ను అనెడివారు యెవ్వరు గలరు, E సమూహాలున్ను అనేటివారు యెవ్వరు గలరు, F సమూహాలున్ను అనేవార్లు యెవ్వరు గలరు, 4 B వారున్ను 5 ACEG వెరగుపడి నిన్ను జూస్తున్నారు. F వెరగువడి నిన్ను చూస్తున్నారు.

23

రూపం మహ త్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదమ్
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహమ్॥

[1] వో మహానుభావుడా! బహువక్త్రాలున్ను, అనేక కన్నులున్ను గలిగి, పెక్కుహస్తాలున్ను, [2] పెక్కుపాదాలున్ను, పెక్కు వ(తొ)డలు గలిగినదై, [3] నానావిధాలయిన కోరదవడలతోను భయంకరమైన, అధికమైన నీరూపము జూచి లోకాలు [4] వెరుస్తూన్నవారు. *

1 A వో మహాబాహుండా! C వో మహానుబాహుడా! E వోయి మహానుభావుడా! FG వో మహాబాహుడా! 2 ABCEFG పెక్కుతొడలు, పెక్కుపాదాలు గలిగినదై, 3 ABFG అనంతమైన కడుపులు గలదినై, నానావిధా- C అనంతమైన కడుపులు గలిగినదిన్నై, నానావిధా- E అనంతమైన కడుపులు

గలదినై్న, నానావిధాలైన కోరలతో 4 ABEFG వెరస్తున్నవి. C వెరుస్తున్నది.
* ABCFG ఆలాగుననె నేనున్ను వెరస్తున్నాడను. E ఆలాగుననె నేనున్ను వెరస్తు
న్నాను.

24

నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్
దృష్ట్వా హి త్వా ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో॥

[1]వోయి విష్ణుడా! పరమాకాశం [2]మోశి, మహాప్రకాశం గలిగి, అనేక వర్ణాలతోగూడి. నోళ్లు దెరచుకొని, మండుచున్ను వెడల్పులైన నేత్రాలు [3]గల నిన్ను జూచి లోకాలున్ను వెరస్తున్నవి. నేనున్నూ [4]బెగడుచున్నాడను. ధైర్యమున్నూ, శాంతీన్ని బొందక వున్నాడను.

1 AG వోయి విష్ణు! BCEF వోయి విష్ణువా! 2 ABCEFG మోచి, 3 ABEG గలిగిన నిన్ను జూచి 4 A వెగడుపడి ధైర్యమునున్ను, శాంతినిన్ని బొందకున్నాడను. BEFG బెగడుకుడిచి ధైర్యమున్ను, శాంతిన్ని బొందకున్నాడను. C బెగడు కుడిచిన ధైర్యముతో శాంతి బొందకున్నాడను.

25

దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస॥

ప్రళయ [1]కాలాగ్నితోను సరైన, [2]కోరలుగల దౌడలతో భయంకరమయిన [3]నీ రూపంయొక్క ముఖాలు జూచి [4]దిక్కులు గానలేను. సుఖమూన్ను [5]బొందక వున్నాడను. [6]వో జగన్నివాసుడా! నాకు ప్రసన్నుడవు గమ్ము.

1 AEFG కాలాగ్నితోసరియై, B కాలాగ్నిసరియైన, C కాలాగ్నితో సతి(ద్ది) యైన, 2 ABCEFG కోరదవడలతో 3 AEG నీ ముఖాలు జూచి BCF నీ ముఖాల

జూచి 4 B దిక్కులున్ను గానలేను. 5 ABEFG పొందవన్నాడను. 6 B వోయి జగన్నాథుడా! E వోయి జగన్నివాసుడా!

26

అమీ చ త్వా ధృతరాష్ట్రస్య పుత్రా
స్సర్వే సహైవావనిపాలసంఘైః
భీష్మోద్రోణస్సూతపుత్ర స్తథాసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః॥

[1]ధృతరాష్ట్రునిపుత్రులైన యీ దుర్యోధనాదులున్ను, భీష్మద్రోణకర్ణాది ముఖ్యులయిన రాజులున్ను, [2]మాతో(లో) కొందరు గూడుకొని వేగిరపడుచున్ను.

1 ABCEFG ధృతరాష్ట్రపుత్రులైన 2 AEFG మాశానలోని గమికాండ్లతోడ గూడుకొని వేగిరింపుచున్ను, B మా సేనలోని గమికాండ్రున్ను కూడుకొని వేగిరింపుచున్నారు. C మా సేనలోని గమికాండ్లు గూడుకొని వేగిరింపుచున్ను.

27

వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని
కేచి ద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః॥

కోరదవడలతో [1]భయంకరమైన నీముఖాలందు [2]చచ్చెడికొరకు ప్రవేశిస్తున్నారు. అందులోను కొందరు తలలు పగిలినవారై [3]నీ అంచున కానవస్తున్నారు.

1 C భయంకరాకారమైన 2 E చచ్చేటికొరకు 3 ABCFG నీపండ్ల సందులకడి కానవస్తున్నారు. E పండ్లతగులుపడి కానవస్తున్నారు.

28

యథా నదీనాం బహవోఽంబువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవంతి
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రా ణ్యభివిజ్వలంతి॥

[1]యేలాగునన్నైనానేమి [2]నదులయొక్క వుదకాలు [3]సముద్రమందు [4]అభిముఖమై ప్రవేశిస్తున్నండును, ఆరీతుననే నీముఖాలందు [5]యీ రాజవీరులు [6]అందరున్ను ప్రవేశించి ప్రగ్గుచున్నారు.

1 ABCEFG లలో—యేలాగునన్నైనా నేమి—లేదు. 2 ABCFG నదులందు నిండుకొని వేగముగల నీళ్లు E నదులందు నిండుకొనిన వేగముగలిగిన నీళ్లు 3 ABCEFG తమతమ దమకే సముద్రములో బడినట్టు 4 ABCEFG లలో – అభిముఖమై ప్రవేశిస్తున్నండును, ఆరీతుననే నీ ముఖాలందు—లేదు. 5 ABCEFG కొందరు వీరపురుషులు 6 AEFG మండుచుండెడి నీ ముఖాలందు బడుచున్నారు. B మండుచున్నటువంటి నీ ముఖాలందు బడుచున్నారు. C మండుచున్నుండెడి నీ ముఖాలందు బడుచున్నారు.

29

యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
    విశంతి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశంతి లోకా
    స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥

[1]ఆ మండెడి అగ్నిలోను మిడతలు [2]బడినట్టుంబలెను తక్కినప్రజలున్నూ మహావేగముతోను తమ చావుకొరకు [3]నీముఖాలందు ప్రవేశిస్తున్నారు.

1 ABFG మండెడి C మండే E మండేటి 2 AEFG పడినట్టుంబలెనే BC బడినట్టుంబలెనే 3 B నీముఖాలయందు

30

లేలిహ్యసే గ్రసమాన స్సమంతా
    ల్లోకాన్ సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగత్సమగ్రం
    భాస స్తవోగ్రాః ప్రతపంతి విష్ణో॥

[1]వో మహావిష్ణుడా! [2]సమస్తమైన లోకములనున్ను [3]ముఖాలచాతను మ్రింగుచున్నవాడవై [4]నాలికెలు చాచుటచాతను [5]నెత్తురు నాకుచున్నాడవు. నీ [6]దేహమందలి కిరణాలు అంతటాను నిండుకొని [7]లోకాలల్లాను [8]తపింప జేస్తున్నది(వి).

1 B వోయి మహావిష్ణువుడా! E వో మహావిష్ణువా! 2 AG నీవు మహారాజుల నున్ను BCEF నీవు సమ స్తమైన రాజులనున్ను 3 ABCFG మండుచున్న ముఖాల చాతను E మండుచున్న నీ ముఖాలచాతను 4 AB నాలుకలచాతను CF నాలిక(ల) చేతను EG నాలికెలచాతను 5 AG ఆ నెత్తురు BCE ఆ నెత్తురులు F ఆ నెత్తుర్లు 6 G దేహాదులందలి 7 BE లోకాలెల్లాను 8 ABFG తపింపజేస్తున్నవి.

## 31

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద
విజ్ఞాతు మిచ్ఛామి భవంత మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥

[1]నీ సౌమ్యరూపమున్ను దర్శించేననగాను [2]అతిఘోరమయిన రూపము గలవాడవై వున్నాడవు. నీ వెవ్వరు? [3]యేమి శాయ నిశ్చయించివున్నావో అది నాకు తెలియవలశివున్నది. నీయొక్క వ్యాపారమును నేను యెరుగను. అది నాకు [4]ఆనతి యిమ్ము. నీకు నమస్కారం. వో దేవదేవోత్తమా! ప్రసన్నుడవు గమ్ము. [5]అంటేను.

1 AG నీ సౌమ్యమైన రూపమును B నీ సౌమ్యరూపము CEF నీ సౌమ్యరూపమును 2 C అతిఘోరరూపమును 3 ACFG ఏమి శేయ నుద్యోగించినాడవో BE యేమి శాయ నుద్యోగించినవాడవో 4 ABCEFG ఆనతిమ్ము. 5 AE అలో- అంటేను- లేదు.

## 32

శ్రీ భగవానువాచ

కాలోఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః
ఋతేఽపి త్వా న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥

ర

[1]యీ ధృతరాష్ట్రపుత్రులు మొదలయిన రాజలోకానకు [2]ఆయుస్సు నిండె గనుక, క్షయింపజాయ నుద్యోగించినటువంటి కాలస్వరూపుడ నేను. యీ రాజ

లోకమునల్లాను [3]సంహ్వారించ నుద్యోగిస్తున్నాడను. నీవు [4]చంపకున్నాగాని, [5]యీ వేళ నీకు [6]యెదురుపడి వున్నటువంటి [7]యీయొక్క వీరపురుషు లిందరున్నూ [8]నష్టమయ్యేడివారే యని యెరుగుము.

ర BCF కృష్ణవాక్యం E శ్రీకృష్ణవాక్యం

1 ABCEFG ధృతరాష్ట్రపుత్రులు 2 A ఆయిస్సు EG ఆయుస్సు 3 BCFG సంహరింప 4 ABCEFG చంపకుండినాను, 5 ABCEFG లలో _యీ వేళ_ లేదు. 6 ACFG యెదురుపడివుండెడి B యెదురుపడే E యెదురుపడి ఉండేటి 7 ABCEFG యీ వీర_ 8 ABCFG నష్టమయ్యేకువారిగా నెరుంగుము. E నష్టమయ్యేటివారిగా నెరుగుము.

## 33

తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్
మ యైవేతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥

అదిగారణానబట్టుండి, [1]నీవు శత్రువులతోడి యుద్ధానకు లెమ్ము. నిండుకొన్న రాజ్యమును [2]అనుభవింపుము. యీ శత్రువులందరున్నూ నాచాత [3]జచ్చినవారె. [4]నీవు నే జెప్పినట్టు యుద్ధముజేసి, అర్జునుడు [5]చంపెనని కీర్తి [6]గట్టుకొమ్ము.

1 ABCEFG నీనె 2 C అనుభవించుము. 3 B చచ్చినవారిని 4 A నీవు నే జెప్పినట్టు యుద్ధము చేస్తే అర్జు_ B నీవు చంపినట్టు యుద్ధము సేయుము. అర్జు_ 5 AG చంపెననిన B చంపెనెడి F చంపెననే 6 ABCEF గట్టుకొనుము.

## 34

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మావ్యథిష్ఠా
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥

ద్రోణునిన్నీ, భీష్మునిన్ని, [1]జయద్రథునిన్నీ, కర్ణునున్ని, [2]రాజులనున్ను వారితప్పులకు తగినదండన విచారించి నాచాతను [3]చంపబడ్డటువంటి వీరిని జంపుము.

యీ గురువులను, [4]తాతను, [5]అన్నలను, తమ్ములను మొదలయినవారిని [6]యెట్ల చంపుదునని [7]దుఃఖింపకుము. అవశ్యమున్నూ నీకు [8]పాపము లేదు. నీవే గెలిచేవు. [9]వగవక యుద్ధము శేయుమంటేను.

1 A లో- జయద్రథునిన్నీ, కర్ణునిన్ని- లేదు. 2 ABCEFG తక్కిన రాజుల నున్ను 3 ABCEFG చంపబడినవీరిని 4 ABCEFG లలో-తాతను-లేదు. 5 AB తమ్ములను,అన్నలను మొదలైన- C అన్నదమ్ముల మొదలైన- E అన్నదమ్ములు మొదలైన- 6 AG యెట్లు BCEF యెట్టు 7 ACE దుఃఖించకుము. 8 ACG పాపమాత్రమె లేదు. BF పాపమాత్రం లేదు. E పాపం లేశమాత్రం లేదు. 9 ABCEFG గనుక

## 35

సంజయ ఉవాచ

ఏత చ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య॥

గ

[1]శ్రీవత్సలుడైన కేశవునియొక్క యీ [2]మాటలు విని, [3]శ్రీకృష్ణునికి మరీన్ని మరీన్ని నమస్కరించి, మిక్కిలీన్ని వెఱచినవాడై అంజలిపట్టుకొని, [4]గడగడవణుకుచున్ను [5]డగ్గుత్తికెతోను అర్జునుడు [6]యిట్లని పలికెను.

గ ACE సంజయుని వాక్యం F సంజయుని మాట

1 ABCEFG ఆశ్రితవత్సలుడైన 2 ACEFG మాట విని 3 ABCEFG ఆ కృష్ణునికి 4 AG గజగజ వణుకుచున్ను E గడగడ వడకుచున్ను 5 C డగ్గుత్తుకతోను 6 BEF యిటని పలికెను. C యిట్లని వలికెను.

## 36

అర్జున ఉవాచ

స్థానే హృషీకేశ తవప్రకీర్త్యా
జగ త్ప్రహృష్య త్యనురజ్యతే చ

రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః॥

గ్

[1]వో హృషీకేశుడా: దేవగంధర్వాదులు మొదలయిన [2]సర్వమయిన జగత్తున్నూ [3]నీప్రజలున్నూ నిన్ను శేవించి [4]సంతోషిస్తున్నది. ఆనందిస్తున్నది. యిటువంటి నిన్నుజూచి రాక్షసులు వెరచి దిక్కులకు [5]పారిపోతున్నారు. [6]అందులకు దేవతలు [7]నమస్కరిస్తున్నారు. యింతవట్టున్ను నీకు దగును.

గ్ AG అర్జునవాక్యం CEF అర్జునుని వాక్యం

1 BE వోయి హృషీకేశుడా! C హృషీకేశుడా! 2 AG సర్వజగత్తున్ను 3 ACG నీ ప్రసాదంవల్లనును నిన్ను B నీ ప్రసాదం వల్లను శేవించి EF నీ ప్రసాదం వల్లను నిన్ను 4 A సంతోషించుకొని ఆనందిస్తున్నది. B సంతోషించుకొని ఆనందిస్తున్నన్నది. CEFG సంతోషించుకొన్నది. ఆనందిస్తున్నది. 5 E పారుచున్నారు. F బారిపోవుచున్నారు. 6 ABCEFG అందుకు 7 ACEFG నీకు నమస్కరించేరు. B నీకు వెరచి నమస్కరించేరు.

37

కస్మాచ్చ తే ననమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే
అనంతదేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్॥

వో మహాత్మా! ఘనుడవై, బ్రహ్మదేవునికిన్ని ఆదికర్తవయిన నీకు దేవతలల్లాను [1]నమస్కరించక యెట్ల వుండేరు? అనంతుడవై, దేవతలకల్లాను యేలికవై, జగత్తులల్లాను [2] నిండుకొనిన*వాడవు నీవే. [3]అక్షరమనిపించుకొనినటువంటి జీవులలోనివాడవు న్నీవే. [4]సదసత్తనిపించుకున్న ప్రకృతిలోనివాడవు నీవే. యీ రెంటికిన్ని అన్యమయిన ముక్తులలోనివాడవున్నూ నీవే.

1 AG నమస్కరింప కెట్లుండెదరు? B నమస్కరింప కెట్లుండే రంటేను? C నమస్కరింప కెట్లుండేరు? F నమస్కరింప కెట్టుండేరు? 2 ABFG నిండుకొన్నవాడవున్ను నీవే. C నిండుకొన్నవాడవు న్నీవే.* E లో -వాడవు నీవే. అక్షర

మనిపించుకొనినటువంటి జీవులలోనివాడవు న్నీవే. సదసత్తనిపించుకున్న- అన్న భాగం లేదు. 3 ABCG అక్షరమనిపించుకొన్న జీవులలోని F లో- అక్షరమనిపించుకొనినటువంటి జీవులలోని వాడవు న్నీవే- లేదు. 4 AG లలో- సదసత్తనిపించుకున్న ప్రకృతిలోనివాడవు నీవే-లేదు.

38

త్వ మాదిదేవః పురుషః పురాణ
స్త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వ మనంతరూప॥

[1]యీ సమస్తమయిన విశ్వానకున్నూ ఆధారమైన[2]వాడవు న్నీవె. [3]సమస్త ప్రపంచమున్ను అనంతరూపుడవైన నీచాతను వ్యాపింపబడెగనుక, [4]పరమమున్నూ నీవె.

1 ABCEFG యీ సమస్త విశ్వానకున్ను 2 ABCEFG వాడవున్ను నీవె. 3 AG ఆదిదేవుడవై, పురాణపురుషుడవైనవాడవున్ను నీవె. యీ జగత్తులో యెరిగిన వాడవున్ను నీవె. సమస్త- B యీ జగత్తులో యెరిగినవాడవున్ను నీవె. సమస్త ప్రపంచమున్ను నీవె. అనంత- C ఆదిదేవుడవై, పురాణపురుషుడవైనవాడవు న్నీవె. సమస్త- EF ఆదిదేవుడవై, పురాణపురుషుడవైనవాడవున్ను నీవె. యీ జగత్తులలోయెరిగేవాడున్న నీవె. యెరగతగేవాడవున్ను నీవె. సమస్త- 4 ABCEFG పరంధామమున్ను నీవె.

39

వాయు ర్యమోఽగ్ని ర్వరుణ శ్శశాంకః
ప్రజాపతి స్త్వం ప్రపితామహశ్చ
నమోనమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమోనమస్తే॥

వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, వీరలకు కారణమైన [1]చతుర్ముఖుడవు న్నీవే. యిందరికిన్ని [2]తాతవున్ను, [3]ముత్తాతవు న్నీవె. యిటువంటి [4]నీకు వేయుమార్లు నమస్కారం చేస్తున్నాడను.

1 BCF బ్రహ్మలున్ను, వార్లకు కారణమైన చతుర్ముఖుడున్ను నీవె. E చతుర్ముఖుడున్ను నీవె. 2 ABCEFG తాతవున్ను నీవె. 3 ACEFG ముత్తాతవున్ను నీవె. B లో– ముత్తాతవున్నీవె–లేదు. 4 A నీకు నమస్కారము. వేయిమార్లదనుకాను నమస్కారం B నీకు నమస్కారము. మరిన్ని నమస్కారము CEG నీకు నమస్కారం. మరిన్ని మరిన్ని నమస్కారం. వేయిమార్లదనకా నమస్కారం F నీకు నమస్కారం. మరిన్ని వేయిమార్లు నమస్కారం

## 40

నమః పురస్తా దథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ
అనంతవీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥

నిన్ను శేవించి సంతోషమాయగనుక, [1]నీకు ముందరికీన్ని నమస్కారం, [2]వుభయపార్శ్వాలకున్నూ నమస్కారం. అపరిమితమైన పరాక్రమంగల నీవు అంతర్యామివై సర్వమున్ను నిండుకొంటివి. [3]సర్వం నీ శరీరం గనుక, సర్వమున్ను నీవే [4]అనవచ్చును.

1 ABCEFG నీముందరికిన్ని 2 ACEFG వెనుకకున్ను నమస్కారం. B నీ వెనకకున్ను నమస్కారం. వుభయ– 3 ABCEFG సర్వమున్ను నీశరీ– 4 B లో– అనవచ్చును– లేదు.

## 41

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వాపి॥

నీ మహిమ [1]యెరుగని [2]నాచాతను [3]అజ్ఞానమనే [4]ప్రమాదంవలననే, [5]నీతోటి అనేకకాలం గూడిఆడిన స్నేహం[6]చాతను సఖుడవని తలచి, [7]హో కృష్ణ! హో యాదవుడా! [8]యీలాగని బలిమిని యేమైనాను అంటేను.

1 A యెరుంగక 2 A లో– నాచాతను–లేదు. 3 A అజ్ఞానంవల్లను నీతో అనేకకాలం 4 C ప్రమాదంవల్ననో E ప్రమాదంవల్లను, FG ప్రమాదంవల్లనో.

E మరి యెవ్వరున్నారు? 6 AG లోకత్రయమందులనున్న 7 ACEFG నీ ప్రభావానకు సరి లేదు. B నీ ప్రభావానకు సరి లేరు.

44

తస్మా త్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥

[1]అదిగారణానబట్టుండి నీవు సర్వ[2]లోకాలకూన్ను తండ్రివి. యిటువంటినీకు సాష్టాంగ[3]దండంబెట్టేను. ప్రసన్నుడవు గమ్ము. [4]అని వేడుకొని తండ్రికి కొడుకు దండంబెట్టితేను క్షమించినట్టున్ను, చెలికాడు దండంబెట్టితేను చెలికాడు క్షమించినట్టున్ను. ప్రియురాలు దండంబెట్టితేను ప్రియుడు [5]రక్షించినట్టున్ను నా యపరాధము క్షమింపదగుదువు.

1 A యిదిగారణాన నీవు BCEF యేదిగారణానబట్టుండి నీవు G యేదిగారణాన నీవు 2 EF లోకానకున్ను 3 ACEG దండంబెట్టి ప్రస- F దండంవెట్టి ప్రస- 4 AG నిన్ను వేడుకొనేను. BCEF అని వేడుకొనేను. 5 AG క్షమించునట్టున్ను B క్షమియించినట్టున్ను CEF క్షమించినట్టున్ను

44 A

ఇమాని కర్మాణి తవాద్భుతాని
కృతాని పూర్వే మునయో వదంతి
న తే గుణానాం పరిమాణ మస్తి
న తేజసస్యాపి బలస్య విష్ణో॥

ఈ శ్లోకం PBG ప్రతుల్లో మాత్రమే ఉంది; తాత్పర్యం ఒక్క G ప్రతిలోనే వుంది. భండార్కర్ వారి సంస్కృత మహాభారతంలో ఈ శ్లోకం నేపాళ దేశపుప్రతిలోనుండి అధికపాఠంగా చూపబడింది.

G పూర్తిపాఠం—అర్జున ఉవాచ- నీ రుషులను పెద్దలైన రుషీశ్వరులు చెప్పుదురు. నీయొక్క గుణాలకున్ను, నీయొక్క తేజస్సు..................యన్ను కడలేదు ॥౪౫॥

45

అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస॥

[1]యెన్నడు చూడనటువంటి [2]ఆశ్చర్యమయమైన నీరూపు సేవించి సంతోషించుకొంటిని. భయముచాతను నామనస్సు కలగుచున్నది. అటుగనుక, [3]ప్రసన్నమై తొలుతటి[4]రూపు నాకు జూపుము. బ్రహ్మాది దేవతలకున్నూ [5]స్వామివి. సకలలోకనివాసుడవు. నాకు బ్రసన్నుడవు గమ్ము.

1 ABCFG యెన్నడున్ను E ఎన్నడూ 2 ACEFG ఆశ్చర్యమైన నీరూపము B ఆశ్చర్యమైన రూపమును 3 ACEFG ప్రసన్నమైన 4 ACEFG నీ రూపమె B నీ రూపము 5 AEFG ఏలికవు. BC ఏలికెవు.

46

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టు మహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే॥

తొలుతటి కిరీటమున్ను, తొలుతటి గదాను, తొలుతటి చక్రమున్ను [1]ధరించిన నీ రూపము [2]సేవించవలెను. అటుగనుక, సహస్ర[3]బాహుడవయిన, విశ్వరూపుడవయిన నీవు పూర్వమందు చతుర్భుజాలుగల [4]రూపము [5]అవధరింపుమంటేను.

1 B ధరియించిన నీ రూపు F ధరియించిన నీ రూపము 2 AF శేవింపవలెను. 3 BF బాహుడవై, విశ్వ - 4 ABCEFG రూపమె 5 B ధరియింపుమంటేను. F అవధరింపమంటేను.

47

శ్రీ భగవానువాచ

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్

తేజోమయం విశ్వ మనంత మాద్యం
యన్మే త్వ దన్యేన నదృష్టపూర్వమ్॥

క్ర

[1] తేజోమయమైన, సర్వమున్నూ వ్యాపించుకొని, ఆదిమధ్యాంతాలు లేక, సర్వానకున్నూ కారణమయిన రూపము నీకంటె అన్యులకు యెన్నడున్నూ కానరాదు. అటువంటి రూపము, నీకు ప్రసన్నుడనై, [2] నా భక్తుడవు గనుక, [3] నారూపము జూపితిని.

క్ర ABCF కృష్ణవాక్యం EG శ్రీకృష్ణవాక్యం

1 E ఓయి అర్జునా! నా చాతను తేజోమయమై, సర్వ- 2 C నాకు భక్తుడవు గనక, 3 ABCEFG లలో -నారూపము- లేదు.

48

న వేదయజ్ఞాధ్యయనై ర్న దానై
ర్న చ క్రియాభి ర్న తపోభి రుగ్రైః
ఏవం రూపః శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥

అటువంటి రూపంగల నేను, యీ పురుషుల[1] లోను నీవంటి [2] పరమభక్తిలేని అన్యుడు వేదాలు చదివినాను, [3] యజ్ఞాలు చేశినాను, [4] మరిన్నీ తక్కిన ప్రయోజనాలు చేశినాను, [5] వుగ్రమయిన తపస్సులు చేశినాను [6] వానికి కానుపించను.

1 ACEFG లోపలను 2 AG పరమభక్తికేకాని, లేని అన్యులు 3 ACFG యజ్ఞాలుచేసినాను. దానాలు చేసినాను మరి - B యజ్ఞాలు సలిపినాను దానాలు సేసినాను మరి - E యజ్ఞములు జేసినాను దానములు చేసినాను మరి - 4 A మరియు దక్కిన - 5 A వుత్తమమైన. 6 AC వారికి కానుపించను. B వారికి కానుపింపను. E వానికి వొకప్పుడున్ను కన్నులకు కనిపింపను. FG వానికి గానిపించను.

49

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్

వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య॥

[1]యీ రీతిన ఘోరమయిన నారూపము శేవించి నీవు వెరవవద్దు. [2]నీవు మానుపడి వుండవలదు. [3]అరలేక సంతోషించుకొని[4]యెట్టుగాను పూర్వము నీవు [5]శేవించేటటువంటి రూపమును [6]నేను నీకు జూపేను చూడుము.

1 ABCEFG యీ రీతిని 2 A లో-నీవు మానుపడి వుండవలదు- లేదు. EFG నీవు మ్రానుపడవద్దు. 3 ABCEFG వెరపులేక 4 ABCEFG లలో-యెట్టుగాను-లేదు. 5 AG శేవించిన ఆరూపమును B శేవించిన రూపము CEF సేవించే ఆ రూపమును 6 ABCEFG నేను చూపేను నీవు చూడుము.

50

సంజయ ఉవాచ

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా॥

ర

[1]యిటని అర్జునునితో [2]శ్రీకృష్ణస్వామి ఆనతిచ్చి, తిరుగను చతుర్భుజాల [3]తోడ పూర్వమైన రూపమును [4]దర్శింపజేశెను. ఆ మహాత్ముడు శాంతవేషముతో నుండి, మరిన్ని [5]అర్జునునితో వెరవకుమని వూరడించెను.

ర ACEFG సంజయుని వాక్యం

1 E ఆయన యిటని 2 ACFG కృష్ణమ్మ B క్రిష్ణమ్మ E శ్రీకృష్ణదేవుడు 3 ABCEFG తోడి పూర్వరూపమునే 4 B వర్తింపజేశెను. 5 AE అర్జునున్ని వూరడించెను BCFG వెరచిన అర్జునుని వూరడిస్తేను.

51

అర్జున ఉవాచ

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన
ఇదానీమస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః॥

టీ

వోయి జనార్దనా: చక్కదనాలకెల్లాను నెలవయిన, యీరీతి శాంతమైన నీరూపము [1]శేవించితేను, యిప్పుడు ప్రాణం వచ్చెను. పూర్వంవలెనే వెరపుమాని సంతోషించుకొంటిని. అంటేను.

టీ ABG అర్జునవాక్యం CEF అర్జునుని వాక్యం

1 ABCEFG దర్శించి,

## 52

శ్రీ భగవానువాచ

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవానసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః॥

టీ

వో యర్జునా: యిప్పుడు నీకు [1]విశ్వరూపం చూపగా [2]చూస్తివే, యిటువంటి [3]ఆశ్చర్యమయిన రూపము దేవతలున్ను [4]దర్శింపవలెనని [5]కోరుచుండుదురుగాని, [6]పొడగనలేరు.

టీ A భగవద్వాక్యం CEF కృష్ణవాక్యం G శ్రీకృష్ణవాక్యం

1 A యీ విశ్వమందు విశ్వ- 2 AG జూస్తివి. 3 ACEFG ఆశ్చర్యమైన యీ రూపము B ఆశ్చర్యరూపమును 4 A వర్తింపవలెనని B నిత్యమున్ను దర్శింపవలెనని 5 ABCFG కోరుచుందురుగాని, 6 ACEFG పొడగానలేరు. B పొడగానరు.

## 53

నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥

[1]అది యేమా అంటివా? యజ్ఞాలు, దానాలు, హోమాలు, తపస్సులు చేశినాను, [2]భక్తిలేనివానికి యిటువంటి [3]రూప[ము చూప]ను.

1 ABCG అదేమి యంటివా? E అదేమంటివా? F అదేమీ అంటివా? 2 AFG నా భక్తిలేనివానికి E నా భక్తిలేనివారికి 3 ABCEFG రూపము చూపను.

54

భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥

వో శత్రుసంహారకుడ [1]వయినవాడా! [2]మరీన్ని యెవ్వరికి యీ రూపము [3]చూపుదువంటివా? దేవతాంతరము లాయక, నామీది భక్తిచేసిన[4]వానికి యెరుగ వత్తును. [5]నాయందు ప్రవేశింపను [6]సులభుడనై వుండుదును.

1 ABCEFG వైన అర్జునుండా! 2 AFG మరెవ్వరికి BE మరి యెవ్వరికి C మరెవ్వరికిన్ని 3 BCE చూపుదునంటివా? 4 ABCEFG వారికి 5 A లో-నాయందు ప్రవేశింపను- లేదు. BEF కానవత్తును. నాయందు- 6 A సులభుడనై యుండుదును. BG సులభుడనై వుందును.

55

మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సంగవర్జితః
నిర్వైర స్సర్వభూతేషు య స్స మామేతి పాండవ॥

నిత్యనైమిత్తిక కర్మాలు [1]నా పూజయని [2]చేస్తున్నవాడై, [3]నామీద భక్తి గలవాడై, నాయందే ప్రియము గలిగి, యితరులతోడి [4]సంగం సహించక, [5]వక కీడు వచ్చినాను కర్మానకు దగినట్టు [6]దేవుడే యీరీతి జేస్తున్నాడని, కీడు జేసిన వారందున్ను కోపంలేక, సమస్తమయిన భూతాలందున్నూ యెవ్వరందున్ను వైరము లేక యుండును; వాడు ప్రకృతి[7]దోషాలల్లాను చెడిపోవును. వో పాండవుడా! [8]నన్నే పొందును.

1 AG నా పూజలని 2 B చేయుచున్నవాడవై, 3 ABCG సమస్త వుద్యోగాలున్ను నన్నుగూర్చి చేస్తున్నవాడవై, నామీద- EF సమస్తమైన వుద్యోగాలున్ను నన్నుగూర్చే చేస్తున్నవాడై, నామీద- 4 E సంగతులు సహింపక, 5 E కీడుమేలు వచ్చినాను 6 ABCEFG దేవుడు 7 ACEFG దోషాలల్లాను విడిచి, వో పాండవుడా! B పాపాలనల్లా విడిచి, వో పాండవుడా! 8 ABCFG నన్నునె పొందునంటేను. E నన్నే పొందును. ఇందుకు సంశయములే దంటేను.

ఇతి శ్రీమత్తాళపాకఅన్నమాచార్యుల కొమారుడు పెదతిరుమలయ్యంగారు భగవద్గీతార్థం తెనుగుచేసినది విశ్వరూపయోగమన్నది పదకొండో అధ్యాయం.

A విశ్వరూపసందర్శనయోగో నామైకాదశోఽధ్యాయః. ఇది తాళ్లపాక అన్నమయ్య పుత్రుడు తిరమలప్ప భగవద్గీతలు తెనిగించెను.

B హరిః ఓం తత్సదితి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు పరబ్రహ్మవిద్యాయాం శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం యోగశాస్త్రనిర్ణయే శ్రీమన్మహాభారతే శ్రీభీష్మపర్వణి శ్రీకృష్ణార్జునసంవాదే సకలవేదాంతశాస్త్రామృతే విశ్వరూపయోగో నామ యేకాదశోఽధ్యాయః.

C యితి శ్రీమత్తాళపాకఅన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయంగారు భగవద్గీతార్థం తెలుంగుశేశి వ్రాయించి నందు పదనకొండో అధ్యాయం సంపూర్ణం. విశ్వరూపసందర్శనయోగో నామ యేకాదశోఽధ్యాయః.

E హరిః ఓం తత్సదితి శ్రీమహాభారతే శతసహస్రికాయాం సంహితాయాం వైయాసిక్యాం శ్రీ భీష్మపర్వణి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు పరబ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపసందర్శనయోగో నామైకాదశోఽధ్యాయః.

F పదనకొండో అధ్యాయం సంపూర్ణం.

G ఇతి శ్రీమత్తాళపాకఅన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయ్యంగారు భగవద్గీతార్థం తెనుంగుచేశి వ్రాయించి నందున పదనకొండో అధ్యాయము సంపూర్ణం.

పంద్రెండో అధ్యాయం

# భక్తియోగం

1

అర్జున ఉవాచ

ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చాప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥

ర

[1] నీకైంకర్యాలు చేస్తున్న, నిన్నే నమ్మి, [2] నీయందే సంతతమున్ను మనస్సు గలిగివుండే భక్తులు యెవ్వరైనాను [3] కొలుతురు. మరి కొందరు కన్నులకు వ్యక్తముగా కానరాక అక్షరస్వరూపమయిన తమ [4] ఆత్మస్వరూపమున్ను వుపాస్తి శేయుదురు; యీ రెండువిధాల [5] వారితో(లో)నున్ను [6] యోగం యెరిగేందుకు యెవ్వరు నేర్పరులు? యిటనగాను సీ(శీ)ఘ్రమే ఫలము బొందేవారు [7] యెవ్వరు? [8] అని యీరీతిని అర్జునుడు [9] బలికెను.

ర AB అర్జునవాక్యం CEFG అర్జునుని వాక్యం

1 AG నీభక్తి చేస్తున్న; BCEF నీకైంకర్యము చేస్తున్న, 2 ABCEFG నీయందు సంతతమున్ను తగిలిన మనస్సుగల భక్తులు 3 ABCEFG నిన్ను కొలుతురు, 4 ABCEFG ఆత్మస్వరూపమునే 5 AEFG వారిలోనున్ను B వారున్ను 6 AF యెవ్వరు యోగ మెరిగేఅందు నేర్పరులు? B యెవ్వరు యోగం యెరిగేటందుకు నేర్పరులు? CE యెవ్వరు యోగ మెరిగే అందుకు నేర్పరులు? G యెవ్వరు యోగ మెరిగేటందు నేర్పరులు? 7 ABCEFG యెవ్వరనుట. 8 B లో_ అని_లేదు. F లో_అని యీరీతిని అర్జునుడు బలికెను_లేదు. 9 ABCEG అడిగి తేను.

2

శ్రీ భగవానువాచ

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః॥

[1]శ్రీకృష్ణుని వాక్యం

[2]యెవ్వరాయనేమి మనస్సు నాయందే నిలిపి, [3]పరమమయిన భక్తితోగూడిన వారై, [4]నాతోడి సంతతమయిన యోగమును [5]గోరుచున్నవారై వుపాస్తి శేయుదురు; వారు యోగమందు మహానేర్పరులు. శీఘ్రమే వారు నన్ను బొందుదురు.

1 AG భగవద్వాక్యం BCF కృష్ణవాక్యం E శ్రీకృష్ణవాక్యం 2 AG యెవ్వడాయనేమి BC యెవ్వరైనానేమి 3 B పరమభక్తి- 4 AG నాతోటి సంతతయోగమును E నాతోడి సంతతమైనయోగమున 5 ABCFG గోరుచున్నవార్లై E కూడినవారై

3

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచింత్యం చ కూటస్థ మచలం ధ్రువమ్॥

[1]యెవ్వరైనానేమి [2]దేహవ్యతిరిక్తుడని [3]చూప[రా]నటువంటి [4]వారు శరీరాలందుండగానున్న, [5]యిది యిటువంటి స్వరూపము అని చింతింపరాని అటువంటి, ప్రకారం హితమై, చలింపక నిలుకడతోవుండెడి ఆత్మస్వరూపము నుపాస్తి శేయుచున్న.

1 EFG యెవ్వరాయనేమి 2 E దేహవ్యతిరిక్తుడవ(న)ని 3 ABEF చూపరానటువంటి C చూపరాని శరీ- G చూడరానటువంటి 4 ABCEF దేవాది శరీరాలయందు వుండగానున్న, G దేవాదిశరీరాలయందు వుండెడి నన్నును, 5 ABCEFG యిటువంటి స్వరూపం యిది అని చింతింపరానటువంటి, వికారరహితమై చలింపక

4

సన్నియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితేరతాః॥

[1]పంచేంద్రియాలా నియమించి, సర్వమయిన ఆత్మలున్నూ జ్ఞాన [2]స్వరూపాలుగా అనెడి [3]సమబుద్ధిగలవాడై(రై), సర్వభూతాలకున్ను [4]హితవె చేస్తున్నుండిరా వారున్ను [5]నాతోసరియైన ఆత్మ [6]స్వరూపమే పొందుదురు.

1 A పంచేంద్రియాలలో E పంచేంద్రియాలను 2 ABCEFG స్వరూపులుగా అనెడి 3 ACEFG సమబుద్ధిగలవార్లై, B బుద్ధిగలవార్లై 4 A హితము BCEG హితమె 5 B నాతోడి ఆత్మ- 6 ABCEFG స్వరూపమునే పొందుదురు.

5

క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్
అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే॥

[1]ఆరీతిని కానరాని [2]ఆత్మయందు తలపుబెట్టినవారికి ప్రయాసం బహుళం. [3]అదేదంటేను, తాను దేహం ధరించివుండీన్ని కానరాని ఆత్మను ధ్యానం [4]చేశెడిది [5]ప్రయాస గనుక, వారు [6]బహుప్రయాసాన బొందుదురు.

1 C యీ రీతి గానరానటువంటి 2 BF ఆత్మందు 3 AEG అది యెట్లంటేను, B అదెట్టంటే, C అది యెట్టు అంటేను, F అదెట్లంటేను, 4 B చేశేది E చేసేటిదిన్ని F శేశెడిది 5 ACEFG ప్రయాసం గనక, B మహాప్రయాసంగనక, 6 ACEF బహు ప్రయాసం B బహుళప్రయాసం G బహుప్రయాసమును

6

యే తు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే॥

యెవ్వరైనాను తమ శరీరానకు [1]జేశెడి ప్రయోజనాలూన్ను, [2]యజ్ఞాలూన్ను నాకొరకే [3]జేశినవారై, అందలిఫలం నాయందే పెట్టి, [4]నన్ను బొందెడికొరకు కోరుచున్నవారై, తక్కిన ప్రయోజనాలు గోరక [5]నన్నే ధ్యానం చేస్తున్ను, సదా [6]నన్ను కొలుతురు.

1 AG జేశేటి B జేసిన C జేశే E జేశేదిగల ప్రయో- 2 ABCEFG యజ్ఞాది కర్మాలున్ను నాకొరకే 3 BF శేశేవారై, 4 ABFG నన్ను పొందేటిదే కోరుచున్న వారై, C నన్ను బొందెడిదే కోరుచున్ను, E నన్నే కోరుచున్నవారై, 5 E నన్నే పొందవలెనని ధ్యానం చేస్తున్ను, 6 ABCEFG నన్నే

7

తేషా మహం సముద్ధర్తా మృత్యు సంసార సాగరాత్
భవామి న చిరా త్పార్థ మయ్యావేశితచేతసామ్॥

[1]వారిని మృత్యురూపకమయిన [2]సంసారసాగరమందు [3]బడకుండాను జేసెడి నామీద [4]తలపు బెట్టెడి గనుక, శీఘ్రమే వారిని రక్షింతును.

1 ABCEFG వార్లను మృత్యురూపమైన 2 A సంసారసాగరములో G సంసారమందు 3 ACEFG బడకుండాను జేశి నామీద B బడకుండాను నామీద 4 ABFG తలపు బెట్టిరి గనుక, C తలపు వెట్టిరి గనక, E తలపుపెట్టేది గనక,

## 8

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥

[1]కేవలం [2]ఆత్మనిష్ఠనికంటేను నన్ను [3]గొలిచెడిదే సులభమున్ను, మంచి దీన్ని గనుక, నీవున్నూ [4]నాయందే బుద్ధిపెట్టితే [5]నేనే గతియై వుందును, యీరీతి [6]నుండితేను నాయందే ప్రవేశించేవు.

1 A లో —కేవలం— లేదు. BG కేవలమున్ను F కేవల ఆత్మ- 2 ABCEFG ఆత్మనిష్ఠకంటేను 3 A గోరి వేడితే C గొలిచేదె E కొలిచెటిదే 4 A నాయందే మనస్సున్ను, బుద్ధియు నిలిపి నేనే- B నాయందే మనస్సువెట్టి నేనే CFG నాయందే మనస్సు వెట్టి, నాయందే బుద్ధిన్ని వెట్టి నేనే E నాయందే మనస్సు ఉంచి, నాయందే బుద్ధిన్ని నిలిపి నేనే 5 ABCEF నేనే గతియని వుందును. G నేనే దరియని వుందువు. 6 G నీవు వుండితేను

## 9

అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్
అభ్యాసయోగేన తతో మా మిచ్ఛాప్తుం ధనంజయ॥

యీరీతి [1]నామీద గొబ్బునను మనస్సు [2]నిలిపేటందుకు [3]శక్తుడవు గాకుండితివా, దినదినమున్నూ నన్ను [4]దలంచుచున్ను [5]భక్తిశేయుట అనెడి అభ్యాసయోగంచాత వశంచేసుకొని, [6]మరీ నన్ను బొందను నిశ్చయింపుము.

1 ABCEFG గొబ్బున నామీద 2 ACFG నిలిపి అందుకు 3 C శక్తుడవు గా[క]వుంటివా, EF శక్తుడు గాకుండితివా, 4 ABEFG దలపుచున్ను 5 ABEFG భక్తిచేసుటనెడి C భక్తిజేయుటనెడి 6 B వో ధనంజయ! మరి

## 10

అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ
మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధి మవాప్స్యసి॥

యిటువంటి అభ్యాసయోగమందున్నూ సమర్థుడవుగాకుండితివా, [1]దినదినమున్నూ [2]నాకైంకర్యాలు శేయుము. [3]కైంకర్యాలు చేస్తేను అభ్యాస మందు [4]మనస్సు నిలుపుచున్ను (నిలుచును). [5]ఆరీతి అభ్యాసంగలిగితేను [6]తలపు లోను నాతోడి యోగం సిద్ధించును.

1 ABCEFG లలో-దినదినమున్నూ-లేదు. 2 A నాయందు భక్తి శేయుము. B కైంకర్యాలు సేయుము. 3 A నాయందు భక్తి చేస్తేను BCFG నాకైంకర్యాలు సేస్తే అభ్యా- 4 ABCFG మనస్సు నిలుచును. E బుద్ధి నిలుచును. 5 ABCEFG ఆ రీతిని 6 A తలంపులోను నాతోటి B తలంపు నాతోడి E తలపులోన నాతోడి

## 11

అథైతద ప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥

యీరీతిని తలపు నామీద బెట్టి [1]కైంకర్యాలు శాయ.[2]సత్వ లేనివాడవైతేను. * [3]అట్ల అయితేను.

1 A భక్తిశాయ BF కైంకర్యాలున్ను 2 ACFG సత్వ లేనివాడవైతివా, B సత్తుకలేకుండెనా, E సత్వు లేనివాడవైతివా, * ABCEFG అప్పుడు ఆత్మజ్ఞానం శిద్ధించేకొరకు మనస్సు కోరకుండా నిలిపి, సర్వమైన కర్మానుష్ఠానఫలాలున్ను నాకే సమర్పింపుము. 3 ABCEFG లలో-అట్ల అయితేను- లేదు.

## 12

శ్రేయో హి జ్ఞాన మభ్యాసా జ్జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాంతి రనంతరమ్॥

[1]సంతతమూన్ను [2]నామీదను భక్తి అభ్యసించుట [3]దొరకదు(ని)దానికి [4]ఆత్మజ్ఞానము యించుక సులభము. ఆయాత్మజ్ఞానం దొరకని[5]వానికి [6]ఫలంగోరక కర్మానుష్ఠానము చేస్తేను శాంతం గలుగును. యిటనగాను యేమనుట అంటేను. శాంతుడైతేను ధ్యానం గలుగును. [7]ధ్యానం గలిగితేను ఆత్మగనవచ్చును. [8]ఆత్మను గనుకంటేను భక్తినిష్ఠ [9]మహాఘన మనుట.

1 ABCFG కక్కసమై సంతతమున్ను E కక్కసమై నామీద సంతతమున్ను 2 ABCFG నామీది E లో లేదు. 3 AEFG దొరకనివారికి B దొరకనివానికి 4 E లో

_ఆత్మజ్ఞానము యించుక సులభము. ఆ యాత్మజ్ఞానం దొరకనివానికి _అన్న భాగం లేదు. 5 AFG వార్కి_ 6 ACF ఆత్మధ్యానం సులభం. ఆ ధ్యానం దొరకనివారికి ఫలముగోరని కర్మానుష్ఠానము సులభము. ఆ రీతి కర్మానుష్ఠా__BEG ఆత్మధ్యానం సులభం. ఆత్మ ధ్యానం దొరకనివానికి ఫలంకోరని కర్మానుష్ఠానం సులభం. ఆ రీతిని కర్మానుష్ఠా- 7 ACFG ధ్యానం దొరికితేను E ధ్యాన మెరిగితేను 8 AG ఆత్మగనుటకంటేను BF ఆత్మగనుకొంటేను C ఆత్మనుగనుటకంటేను. E ఆత్మనుకనుగొంటేను 9 E మహా ఘనమవును.

## 13

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ॥

ఫలం[1]గోరక(ని) కర్మనిష్ఠగలవాడు యే గుణాల[2]తో గూడవలెనంటేను. సమస్తభూతాలతోనున్ను ద్వేషింపక, [3]వకరు తనకు అపకారం చేశినాను తాను [4]మైత్రి చేస్తున్నవాడై, [5]అపకారులుగనుక దుఃఖించినాను [6]కరుణించినవాడై, దేహసంబంధులందు మమతలేనివాడై, [7]దేహమే [8]ఆత్మ అనెడి అభిమానం లేనివాడై, సుఖదుఃఖాలు వొస్తేను సంతోషమున్ను [9]కోపమున్ను లేనివాడై, వక ఆపద [10]వచ్చినాను వోర్చుకున్నవాడై.

1 ABCEFG గోరని 2 AEF తోడ నుండవలెనంటేను, B చాత నుండవలెనంటేను, C తో వుండవలెనంటేను, G తోను వుండవలెనంటేను, 3 ACFG వారు అపకారం చేశినాను తాను B వారపకారము చేశినాను మైత్రే E వార లపకారం చేశినాను తాను 4 AF మైత్రే G మేలే 5 ABCEF అపకారులు దుఃఖించినాను G అపకారులందు దుఃఖం వచ్చినాను 6 ACEFG కరుణించేవాడై 7 A లో_దేహమే ఆత్మ అనెడి అభిమానం లేనివాడై_ అన్న భాగం లేదు. 8 C ఆత్మనే అభిమానం F ఆత్మనియెడి అభిమానం 9 E లో_కోపమున్ను_ లేదు. 10 ABCEFG వచ్చినప్పుడు

## 14

సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మయ్యర్పిత మనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః॥

తనంతనే యేపాటి [1]దొరికినాను సంతోషించుకొని, ఆత్మస్వరూపమే సంతతమున్ను తలపుచున్ను, [2]మనస్సు నిలిపి, శాస్త్రోక్తమయిన [3]నిశ్చయం

గలవాడై, [4]చేశెడి కర్మానుష్ఠానానకు ప్రీతుడై [5]శ్రీహరి నాకు ఆత్మజ్ఞానం [6]యిచ్చీనది(ని) నాయందు మనస్సున్నూ బుద్ధీన్ని బెట్టినవాడై, నామీద యెవ్వడు భక్తి జేసును వాడు నాకు ప్రియుడు.

1 B లాభం గలిగినా G వచ్చినాను 2 E మనస్సున శాస్త్రోక్త- 3 ACEFG అర్థమందు దృఢమైన నిశ్చయం- 4 ACEF నే జేశే B లో లేదు. G నే జేశిన 5 A శ్రీభగవానులు CF శ్రీహరే E శ్రీహరి ఆత్మజ్ఞానం నాకు యిచ్చు- 6 ABCEFG యిచ్చునని

## 15

యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో య స్స చ మే ప్రియః॥

[1]యెవ్వనికి లోకం [2]వెరవకుండును, [3]యెవ్వడు లోకానకు వెరవకుండును, యెవ్వడు కొందరి జూచి [4]హర్షించక, కొందరి జూచి భయపడక, [5]కొందరి జూచి [6]అదరిపడక, యెవ్వడు [7]నామీద భక్తిచేసుకవుండును, వాడు నాకు ప్రియుడు.

1 B యెవ్వరికి 2 A వెరవకవుండును, 3 A లో-యెవ్వడు లోకానకు వెరవకుండును-లేదు. 4 ABFG హర్షింపక, C హరుషింపక, 5 ABCF కొందరి జూచి కోపించక, కొందరి జూ- 6 ABCF అడిచిపడక, 7 F నామీది భక్తి శేసుకొని వుండును వాడు. F లో ఈ తాత్పర్యం పూర్తి అయింది.

E పూర్తిపాఠం- యెవ్వరికి లోకం వెరవకవుండును, యెవ్వడు లోకానకు వెరవక వుండును. యెవ్వడు కొందరిని జూచి హర్షింపకవుండును, యెవ్వడు కొందరి జూచి కోపింపకవుండును, కొందరిని జూచి యెవ్వడు భయపడకవుండును, కొందరిని జూచి యెవ్వడు అడచిపడక వుండును, నామీది భక్తి యెవ్వడు శేయుచుండును, వాడు నాకు ప్రియుడును, నేను వానికి ప్రియుడను.

## 16

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః॥

ఆత్మజ్ఞానముకంటె యితర [1]మపేక్షించక, శాస్త్రోక్తమయిన ద్రవ్యాలచాత శరీరంబెంచి [2]శుచియైయుండి, శాస్త్రోక్త[3]మయిన కర్మానుష్ఠానమందు సమర్థుడై,

యితరమందు వుదాశీనబుద్ధిగలవాడై, [4]వ్యథలేనివాడై, [5]శాస్త్రవిరహితమయిన [6]సర్వమయిన వుద్యోగాలున్నూ విడిచి, నామీద భక్తిగలవాడు నాకు ప్రియుడు,

1 AEFG వుపేక్షింపక, 2 ACFG శుచియైనవాడు, B శుచియైనవాడై, 3 E మైనటువంటి కర్మా- 4 AB లలో- వ్యథ లేనివాడై- లేదు. 5 ACEG శాస్త్ర విహితమైన B శాస్త్ర అహితమైన F శాస్త్రరహితమైన 6 E సర్వమైనటువంటి ఉద్యో-

## 17

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ య స్స మే ప్రియః॥

[1]ప్రియం వస్తేను [2]హర్షించక, [3]అప్రియం వస్తేను [4]ద్వేషింపనివాడై, వకదుఃఖం వస్తేను శోకింపనివాడై, [5]లేనిది గోరక, [6]శుభాశుభ రూపాలయిన పుణ్యపాపాలు విడిచి, నామీద భక్తిగలవాడు [7]నాకు ప్రియుడు.

1 ABCFG వొక ప్రియం వస్తేను E వొక సంతోషం వస్తేను 2 AEFG హర్షించనివాడై, B హర్షింపనివాడై, C హరుషించనివాడై, 3 ABCEFG వొక అప్రియం వస్తేను 4 CE ద్వేషించనివాడై, 5 ACEF లేనిది కోరనివాడై, B కోర రానిది కోరనివాడై, G లో -లేనిది గోరక- లేదు. 6 E శుభాశుభాలు అయిన పుణ్యా- 7 ABCEF యెవ్వడు, వాడు నాకు ప్రియుండు.

## 18

సమ శ్శత్రౌచ మిత్రే చ తథా మానావమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సంగవివర్జితః॥

శత్రునియందున్ను, మిత్రునియందున్ను సమబుద్ధిగలవాడై, పెద్దరికం చేశినప్పుడున్నూ, నిరాకరించినప్పుడున్నూ వికారంబొందక, అందు తగులుపడకను.

A పూర్తిపాఠం- శత్రునియందున్ను, మిత్రునియందున్ను సమబుద్ధిగలవాడై, పెద్దరికం చేశే అప్పుడున్ను, వుదాశీనం చేశినప్పుడున్ను, చలి అయినప్పుడున్ను, వెట్టైనప్పుడున్ను, సుఖము వచ్చినప్పుడున్ను, దుఃఖం వచ్చినప్పుడున్ను సమమని దుర్గుణాల వర్జించవలెను.

B పూ ర్తిపాఠం_ శత్రునియందున్ను, సమబుద్ధిగలవాడై, పెద్దరికము చేశేప్పుడున్ను, వుదాశీనం శేశినప్పుడున్ను, చలి అయినప్పుడున్ను, వెర అయినప్పుడున్ను, సౌఖ్యం వచ్చినప్పుడున్ను, దుఃఖం వచ్చినప్పుడున్ను, వికారం బొందక, అందు తగులుబడక.

C పూ ర్తిపాఠం_ శత్రునియందున్ను, మిత్రునియందున్ను, సమబుద్ధిగలవాడై, పెద్దరికం జేశినవాడున్ను, వుదాశీనం చేశినప్పుడున్ను, చలైనప్పుడున్ను, వుష్ణమైనప్పుడున్ను, సుఖం వచ్చినప్పుడున్ను, మిత్రునియందున్ను, సమబుద్ధిగలవాడై దుఃఖం వచ్చినప్పుడు వికారంబొంద[క], అందుప తగులుపడక.

E పూ ర్తిపాఠం_ శత్రులయందున్ను, మిత్రునియందున్ను, సమబుద్ధిగలవాడై, పెద్దరికము చేశినప్పుడున్ను, ఉదాశీనము చేశినప్పుడున్ను చలి అయినప్పుడున్ను, వేడైనప్పుడును, సుఖము అయినప్పుడున్ను, దుఃఖము అయినప్పుడున్ను వికారం బొందక, అందున దగులుపడక.

F పూ ర్తిపాఠం_ శత్రునియందున్ను, మిత్రునియందున్ను, సమబుద్ధిగలవాడై, పెద్దరికం శేశినప్పుడున్ను, వుదాశీనం శేశినప్పుడున్ను, చలైనప్పుడున్ను, వేడైనప్పుడున్ను, సుఖం వచ్చినప్పుడున్ను వికారం బొందక, అందు దగులువడక.

G పూ ర్తిపాఠం_ శత్రునియందున్ను, మిత్రునియందున్ను, సమబుద్ధిగలవాడై, పెద్దరికం చేశినప్పుడున్ను, ఉదాశీనం చేశినప్పుడున్ను, చలి అయినప్పుడున్ను, వేడైనప్పుడున్ను, సుఖము వచ్చినప్పుడున్ను, దుఃఖము వచ్చినప్పుడును వికారం బొందక, అందు దగులువడక.

## 19

తుల్యా నిందాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్
అనికేత స్స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః॥

తిట్టినాను. దీవించినాను [1]వక్కరీతున వున్నవాడై. [2]ఆత్మయోగముచే(నే) [3]తలపోసి. [4]యెప్పుడున్నూ. సంతోషచిత్తుడై. [5]లాభంగలిగినాను. లేకున్నాను సంతోషించుకొన్నవాడై. గృహమందు అత్యాసక్తి[6] లేక. స్థిరమయిన బుద్ధిగలవాడై. [7]నామీది భక్తిగలవాడు నాకు ప్రియుడు.

1 ABCG వొక్కరీతినే E వొక్కరీతే 2 ABCEG ఆత్మయోగమునే 3 ABEG తలపోయుచున్నవాడై, C తలంపుచున్ను, 4 ABCEG లలో_ యెప్పుడున్నూ

సంతోషచిత్తుడై– లేదు. 5 ABCEG యేపాటి లాభం కలిగినాను సంతో– 6 A లేని వాడై స్థిర– 7 ACG నామీద భక్తిగల ఆత్మయోగి నాకు ప్రియుడు. B నామీద భక్తిగలవాడై, ఆత్మయోగంగలవాడు నాకు ప్రియుడు. E నామీద భక్తిగల యోగా నకు ప్రియుడు.

F పూర్తిపాఠం– తిట్టినాను, దీవించినాను వొక్కరీతినే వున్నవాడై, నామీద భక్తిగల ఆత్మయోగి నాకు ప్రియుడు.

## 20

యే తు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తా స్తేఽతీవ మే ప్రియాః॥

[1] యెవ్వరేనేమి [2] అర్థమును అతిక్రమించక, అమృతస్వరూపమయిన యీ భక్తియోగమును ఆదరముతోను, నేనే గతియని [3] పూని, యెవ్వరాయనేమి యీ ప్రకారాననే యెల్లవార్లు, యిప్పుడు చెప్పిన ఆత్మనిష్ఠులకంటేను నాకు [4] ప్రియుడు(లు).

1 A యెవ్వడాయనేమి B యెవ్వరేమి G యెవ్వడేనేమి 2 ACG యీ ధర్మ మును BF ధర్మమును అతిక్రమింపక 3 ACG పూర్వం నే జెప్పిన ప్రకారాననే అభ్య సించిరా వార్లు, యిప్పుడు చె– B పూర్వం నే జెప్పిన ప్రకారాననే అభ్యసించిన వార్లు, యిప్పుడు నే జెప్పిన ఆత్మనిష్ఠుల కంటె ప్రియుడు (లు). F పూర్వం నే జెప్పిన ప్రకారాననే అభ్యశించిరా, యిప్పుడు చె– 4 ACFG ప్రియులు.

E లో ఈ తాత్పర్యం లేదు.

ఇతి శ్రీమత్తాళపాకఅన్నమాచార్యులకొమారుడు పెదతిరుమలయ్యంగారు భగవద్గీతార్థము తెనుగుచేశి వ్రాయించినదిభగవద్భక్తియోగమన్నది ద్వాదశోధ్యాయము.

A భగవద్భక్తియోగోనామ ద్వాదశోఽధ్యాయః. ఇది తాళ్లపాక అన్నమయ్యగారి పుత్రుడు తిరమలప్ప తెలిగించెను.

B హరిః ఓం తత్సదితి శ్రీభగవద్గీతానూపనిషత్సు పరబ్రహ్మవిద్యాయాం సంహితాయాం వయ్యాసిక్యాం యోగశాస్త్రనిర్ణయే శ్రీమన్మహాభారతే శ్రీభీష్మ పర్వణి శ్రీకృష్ణార్జునసంవాదే సకలవేదాంతశాస్త్రార్థమ్యుతే భక్తియోగో నామ ద్వాదశోఽధ్యాయః.

C ఇతి శ్రీమత్తాళ్ళపాక అన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయ్యంగారు భగవద్గీతార్థం తెలుగుచేశి వ్రాయించె నందు పండ్రెండో అధ్యాయం సంపూర్ణం. భక్తియోగో నామ ద్వాదశో౽ధ్యాయః.

E ఇతి శ్రీభగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ ద్వాదశో౽ధ్యాయః.

F పంౘ్రెండో అధ్యాయం సంపూర్ణం.

G ఇతి శ్రీ...ళ్లపాక అన్నమా...............య్యంగారు భగవద్గీతలు తెలుగుచేశి వ్రాయించి నందు పండ్రెండో అధ్యాయం సంపూర్ణం. భక్తియోగం సంపూర్ణం.

## పదమూడో అధ్యాయం

# క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగం

1

అర్జున ఉవాచ

ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవ చ
ఏత ద్వేదితు మిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ॥

ర

[1]వో కేశవుడా! ప్రకృతి యనగాను [2]యెద్ది? [3]క్షేత్రమనగాను యెద్ది? [4]యిది నాకు తెలియ[5]వలయు నంచేను.

ర ACF అర్జునుని వాక్యం BEG అర్జునవాక్యం

1 B వోయి కేశవుడా! E వోయి కేశవా! 2 BG యేంది? CEF నేంది? 3 A పురుషుండనంగా యెద్ది? క్షేత్ర- B పురుషుడనగా యేంది? B లో- క్షేత్రమనగాను యెద్ది?-లేదు. E పురుషుడనగా నేంది? క్షేత్ర- 4 AEG క్షేత్రుండనంగా యెద్ది? జ్ఞాన మనంగా యెద్ది? యిది- B జ్ఞానమనగా యేంది? జ్ఞేయమనగా యేంది? క్షేత్రజ్ఞుడనగా యెట్టివాడు? యివి నాకు- C జ్ఞానమనగా యేంది? యిది- F క్షేత్రజ్ఞుడనగా యేంది? జ్ఞానమనగా యేంది? జ్ఞేయమనగా నేంది? యిది- 5 ABCEFG వలెనంచేను.

2

శ్రీ భగవానువాచ

ఇదం శరీరం కౌంతేయ క్షేత్ర మిత్యభిధీయతే
ఏత ద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః॥

ర

[1]వోయి అర్జునుడా! దేవ[2]మనుష్యాదిభావాలు, [3]చిక్కుటను, బలసుటను గలిగి, ఆత్మకు వుండే [4]నెలవయిన యీ శరీరము క్షేత్రమనిపించుకొనును. [5]యీ

శరీరం యెరుగకుండెనా అజ్ఞు డనిపించుకొనును. యిటని ఆత్మజ్ఞానులయినవారు చెప్పుదురు.

ర్ A భగవద్వాక్యం BG శ్రీకృష్ణవాక్యం CEF కృష్ణవాక్యం

1 ACEFG వోయి కుంతిపుత్రుడా! B వోయి కౌంతేయుడా! 2 ABCFG మనుష్యాది భావాలున్ను, E మనుష్యభావాలను, 3 ABEFG చిక్కుటాను, బలుసుటాను గలిగి C చిక్కుటాను గలిగి, 4 AG నెళవైన 5 ABEG యీ శరీరమును యెరిగినటువంటి ఆత్మ క్షేత్రజ్ఞుండని ఆత్మస్వరూపమును యెరింగినవారు చెప్పుదురు. CF యీ శరీరమును యెరిగే అటువంటి ఆత్మ క్షేత్రజ్ఞుడని ఆత్మస్వరూపమును యెరిగిన వారు చెప్పుదురు.

3

క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత
క్షేత్రక్షేత్రజ్ఞయో ర్జ్ఞానం య త్తద్జ్ఞానం మతం మమ॥

[1]క్షేత్రజ్ఞుడయినటువంటి ఆత్మను [2]జ్ఞానానకు శరీరమైనవాడుగా [3]నెరుగుము. [4]జ్ఞానానకు ఆత్మ శరీరమయినట్టే [5]యీ యాత్మను నాకు [6]శరీరంగా నెరుగలేను. యీ క్షేత్రంయొక్కాను, క్షేత్రజ్ఞునియొక్కాను స్వరూపమును యెరుగుట నాకు సమ్మతము.*

1 AFG క్షేత్రజ్ఞుడైన ఆయాత్మను B క్షేత్రజ్ఞుడైన ఆత్మ C క్షేత్రజ్ఞుడైన ఆత్మాను 2 ACEFG నాకు శరీరమైన- B తన శరీరమైన- 3 G నెరుగుకొమ్ము. 4 ABCEFG యీ దేహము ఆత్మకు శరీరమైనట్టే 5 AC యీ ఆత్మాను, దేహమున్ను నాకు- BEFG యీ యాత్మాను, యీదేహమున్ను నాకు- 6 AG శరీరాలు అనేటి యీ క్షేత్రముయొక్కాను, యీ క్షేత్రజ్ఞుని- BCEF శరీరాలు అనెడి యీ క్షేత్రము యొక్కాను, యీ క్షేత్రజ్ఞుని- * AC వో అర్జునుండా! BFG వోయి అర్జునుడా! E వోయి అర్జునా!

4

త త్క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు॥

ఆ శరీరం యెటువంటి ద్రవ్యం? యెందుకు ఆశ్రయమయినది? ఆ [1]శరీరం వికారాలు యేవి? [2]శరీరం యేమి [3]ప్రయోజనానకు బుట్టింది? [4]ఆ క్షేత్రజ్ఞుడయిన

ఆత్మయొక్క స్వరూపము యెటువంటిది? ఆ యాత్మ[5] ప్రభావాలున్ను యెటువంటివి? యిది యింతవట్టున్ను సంక్షేపాన జెప్పే వినుము.

1 B శరీరవికారముయేది? F శరీర వికారాలు యేవి? 2 ABCEFG ఆ శరీరము 3 E ప్రయోజనాలకు 4 ACF ఆశరీరం స్వరూపం యెటువంటిది? ఆ క్షేత్రజ్ఞుడయిన- BG ఆశరీరస్వరూపం యెటువంటిది? ఆ క్షేత్రజ్ఞుడయిన- 5 B ప్రభావము యెటువంటిది? అంటె యింతవట్టున్ను-

## 5

ఋషిభి ర్బహుధా గీతం ఛందోభి ర్వివిధైః పృథక్
బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భి ర్వినిశ్చితైః॥

యీ క్షేత్రంయొక్కను, క్షేత్రజ్ఞునియొక్కను స్వరూపము పరాశరుడు మొదలయిన ఋషులచాతను పెక్కుమార్లు జెప్పబడెను. [1]ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అధర్వణవేదా లనెడి ఛందస్సులచాతను వేరే వేరే లెస్సగాను ఆరీతి చెప్పబడినది. బ్రహ్మ[2]సూత్రాలనే పేరగల వేదాంతసూత్రాలందున్నూ హేతువులు దప్పకుండాను, లెస్సగాను నిశ్చయింపబడినది.

1 B ఋగ్యజుస్సామాలనే వేదాంతసూత్రాలందున్ను తప్పకుండాను లెస్సగా నిశ్చయింపబడినది. ఇంతటితో తాత్పర్యం పూర్తిఅయింది. 2 A సూత్రాలపేరంగల

E లో ఈ శ్లోకతాత్పర్యాలు లేవు.

## 6

మహాభూతా న్యహంకారో బుద్ధి రవ్యక్తమేవ చ
ఇంద్రియాణి దశైకంచ పంచ చేంద్రియగోచరాః॥

భూమి, వుదకం, [1]అగ్ని, వాయువు, ఆకాశం [2]అనెడి పంచ మహాభూతాలున్ను, అహంకారమున్ను, మహత్తున్ను, ప్రకృతీన్ని ఇది యింతవట్టున్ను *దేహమును పుట్టించెడి ద్రవ్యాలు. కర్మేంద్రియాలు అయిదున్ను, జ్ఞానేంద్రియాలు అయిదున్ను, [3]మనస్సున్ను యివి దేహము నాశ్రయించిన తత్వాలు.

1 ABCFG తేజస్సు 2 AG అనేటి 3 ACEFG లలో-యివి-లేదు. B లో-మనస్సున్ను యివి-లేదు.

E లో ఈ శ్లోక తాత్పర్యాలు లేవు. * ఈ గుర్తునుంచివున్న తాత్పర్యభాగం నాలుగవ శ్లోకతాత్పర్యంతో కలిపి వ్రాయబడిఉంది.

7

ఇచ్ఛా ద్వేష స్సుఖం దుఃఖం సంఘాత శ్చేతనాధృతిః
ఏత త్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥

యిచ్ఛాను, ద్వేషమున్ను, సుఖమున్ను, దుఃఖమున్ను ఆత్మగుణాలు, ఆత్మగుణాలయినాను శరీరము[1]తో గూడివున్న [2]ఆత్మగుణాలనిపించుకొనును, సంఘాతమున్ను, చేతనాను, ఆధారమున్ను, [3]అనెడివి మూడు. [4]సంఘాతములున్ను [5]ఆధారమున్ను అనగాను యీ పంచమహాభూతాలు మొదలయిన సమూహము ఆత్మకు ఆధారమనుట. [6]చేతనమనగాను చైతన్యమనుట. ఇటువంటి [7]క్షేత్రమున్ను, అందలి కార్యాలున్ను నీకు జెప్పితిని.

1 ACFG తో గూడివుండిన B తోడ గూడివున్నటువంటి 2 ABCFG ఆత్మకే గుణాలు గనుక, శరీరగుణాలు అనిపించుకొనును. 3 B అనెడివి మూడున్ను AFG అనెడి యీ మూడున్ను 4 ACFG సంఘాతమున్ను B సంఘాతమనగాను 5 B లో —ఆధారమున్ను అనగాను —లేదు. F లో —ఆధారమున్ను అనగాను యీ పంచమహా భూతాలు మొదలయిన సమూహము ఆత్మకు— అన్నభాగం లేదు. G చేతన ఆధారమున్ను అనగాను 6 AG చేతన అనంగా BF లలో—చేతనమనగాను చైతన్యమనుట— లేదు. 7 AG క్షేత్రమున్ను, అందుల వికారాలున్ను నీకు— BF క్షేత్రమున్ను, అందలి కార్యాలును, అందలి వికారాలును నీకు— C క్షేత్రమందలి కార్యాలును, అందలి వికారాలను నీకు—

E పూర్తిపాఠం— ఇచ్ఛాను, ద్వేషమున్ను, సుఖమున్ను, దుఃఖమున్ను, ఆత్మ గుణాలున్ను, ఆత్మగుణాలు అయినాను శరీరముతో గూడివుండిన ఆత్మనె(కె) గుణాలుగనుక శరీరగుణాలు అనిపించుకొనడం సంఘాతము. సంఘాతము చేతనునికి ఆధృతి. ఆధృతి అనగాను ఆధారమనుట. యిటనగా యేమనుట అంటేను, ప్రకృతి కార్యాలు అయిన తత్వసమూహాలవల్లను పుట్టిన శరీరం చేతనునికే ఆధారమనుట. ఇటువంటి క్షేత్రమున్ను, అందలి కార్యాలున్ను, అందలి వికారాలున్ను నీకు చెప్పితిని.

8

అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మవినిగ్రహః॥

యికను [1]జ్ఞానసాధనాలయిన క్షేత్రకార్యాలు యెటువంటి వంటేను. పెద్దలను తిరస్కరింపకుండుట, [2]త్రికరణశుద్ధి గల్గుట, [3]జ్ఞానోపదేశం చేశిన [4]ఆచార్యుని శేవ శేయుట, సదా శుచియై వుండుట, శాస్త్రోక్తమార్గమందు నిలుకడగల్గుట, మనస్సు యితరమందు [5]జారకుండా నిలుపుట.

1 A లో -జ్ఞాన- లేదు. 2 ACFG తన్ను బాగడెడు కొరకుగాక, పూరకె ధర్మం శేయుట, మనోవాక్కాయకర్మాలందు పరులకు బాధ శేయకుండుట, వొకరు తన్ను బీడించినాను వికారం బొందకుండుట, త్రికరణ- B తన్ను పొగడెడుకొరకు గాక, పూరికె ధర్మము సేసుట, మనోవాక్కాయకర్మాలందున్ను పరులకు బాధ శాయకుండుట, వొరులు తన్ను పీడించినాను వికారం బొందకుండుట, త్రికరణశుద్ధి గలుగుట మనస్సు- E తన్ను పొగడేటికొరకుగాక, ఊరక ధర్మంచేసుట, మనోవాక్కాయకర్మాలయందున్న పరులకు బాధ శాయకుండుట, వొకరు తన్ను పీడించి నాను వికారం పొందకవుండుట, త్రికరణ- 3 B లో- జ్ఞానోపదేశం చేశిన...... నిలుకడ గల్గుట- అన్న భాగం లేదు. E లో -జ్ఞానోపదేశం చేశిన........శుచియై వుండుట -అన్న భాగం లేదు. 4 AFG ఆచార్యుల శేవచేసుట, 5 A చొరకుండాను E చేరకుండా

9

ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవ చ
జన్మమృత్యు జరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్॥

విషయాలయందలి వైరాగ్యం గలిగి, [1]అహంకారము లేక వైరాగ్యం [2]బుట్టే కొరకు, [3]వెనక్కు బోయిన జన్మాలున్ను, మరణాలున్నూ, ముదిమిన్ని, వ్యాధులున్నూ, దుఃఖాలున్నూ, దోషాలున్నూ [4]పలుమారులున్ను దలచుకొంచున్న.

1 B అహంకారాంతక వైరాగ్యం- 2 ABF పుట్టెడికొరకు, E పుట్టేటికొరకు, 3 A వెనక బోయిన- BEG వెనకకు బోయిన- 4 A పలుమారుం దలంచుకొంచున్న BCF పలుమారున్న తలచుకొంచున్న E పనులున్న పలుమారున్న తలచు కొంచున్న.

## 10

అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు
నిత్యం చ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు॥

[1]పుత్రుడు, పెండ్లాము, [2]గృహము మొదలయిన[3]వానియందు [4]తగులుపడి లోలుడుగాక, యిష్టమయిన పదార్థం వచ్చినప్పుడున్నూ, [5]యిష్టముగాని పదార్థం వచ్చినప్పుడున్నూ [6]వక్కతీరున నుండుట.

1 AC పుత్రులు 2 ABCEFG యిల్లు 3 AC వాటియందు E దానియందు 4 A తగులువడక, A లో -లోలుడుగాక- లేదు. BCFG తగులుపడక, అందు లోలుడు గాక, 5 AFG యిష్టముగానిది వచ్చినప్పుడున్నూ B అనిష్టమైనయందును వొక్క- C యిష్టమైన పదార్థమున్ను వచ్చినప్పుడున్ను, యిష్టముగానిది వచ్చినప్పుడున్ను వొకరీతి- 6 ABCEFG వొక్కరీతినే వుండుట.

## 11

మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ
వివిక్తదేశసేవిత్వ మరతి ర్జనసంసది॥

[1]సర్వేశ్వరుడయిన నాయందు వ్యభిచారంలేని భక్తి [2]చేసుట. భక్తికి వ్యభిచారం [3]యేదంటేను, యితరదేవతల [4]భజియింపకుండుట (?) [5]యేకాంతమందే వుండుట. [6]యీ మనుష్యుల సందడియందు వేడుక [7]పడకుండుట.

1 ACG సర్వేశ్వరుండైన B సర్వేశ్వరుని నా- 2 B శేయుట 3 BEF యేంది అంటేను, 4 ABCE భజించుట F భజియించుటె 5 A అదిగన్ను- యేకాంత దేశమందే 6 AG యీ మనుష్యులయందు వేడుక- B మనుష్యసందడియందు వేడుక- E యీ మనుష్యులు అందరియందున్ను వేడుక- 7 E పడక ఉందురు.

## 12

అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్త్వజ్ఞానార్థచింతనమ్
ఏతద్ జ్ఞానమితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా॥

ఆత్మజ్ఞానమందే నిలుకడ [1]గలిగుండును(ట). తత్వ[2]జ్ఞానమందే [3]పనిపడి చింతించుట. యింతవట్టున్ను [4]ఆత్మను యెరిగేఅందుకు [5]సాధనమయిన జ్ఞానం. యిది కానిదల్లా అజ్ఞానం.

1 ACEFG గలిగివుంచుట, B గలుగుట, 2 ACEFG జ్ఞానమునే B జ్ఞానమును 3 AG పనివడి చింతించి దర్శించుట, యింత- C పట్టి చింతించెడిది, యింత- F పనివడి చింతించేటిది, యింత- 4 ABEG ఆత్మ నెరిగేటందుకు C ఆత్మ యెరిగేయందుకు 5 E సాధనము. యిదికాని___

13

జ్ఞేయం య త్త త్ప్రవక్ష్యామి యద్జ్ఞాత్వామృతమశ్నుతే
అనాదిమత్పరంబ్రహ్మ న స త్త న్నాసదుచ్యతే॥

[1]యింకా యెరుగ[2]దగినది [3]యేదంటేను [4]చెప్పే వినుము. [5]అది యెరిగితేను అమృత[6]స్వరూపైన ఆత్మను [7]బొందును. [8]యీ ఆత్మకు [9]మొదలున్నూ, తుదా లేదు. శ్రేష్ఠమయినది. విశాలాలైన గుణాలు గలిగినది. అది సత్తు గాదు. అసత్తు గాదు.

1 ACF ఇంకను BEG యింకాను 2 AFG దగింది 3 BCFG యేంది అంటేను 4 ABCEG చెప్పేను వినుము. E చెప్పేను వినవోయి అర్జునా! 5 AG యేది యెరింగితేను C అది యెరిగినాను 6 ABCEFG స్వరూపమైన 7 AG బొందును, అది యరగదగినది. ఆ యాత్మ- 8 ABEFG ఆ యాత్మకు 9 A మొదలున్ను లేదు, నడుమూ లేదు, తుదా లేదు. B మొదలున్ను లేదు, కడపలాను లేదు, నడుమున్నూ లేదు. CFG మొదలున్ను లేదు, కడపలాను లేదు, తుదాను లేదు. E మొదలున్ను, కడపలా లేదు, మధ్యాను లేదు.

14

సర్వతః పాణిపాదం త త్సర్వతోఽక్షిశిరోముఖమ్
సర్వత శ్శృతిమ ల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥

మరిన్ని. [1]యీ ఆత్మతత్వం అంతటాను హస్తాలకున్ను, పాదాలకున్ను గల శక్తి గలిగినది. [2]అంతటాను కన్నులకు, శిరస్సుకు, ముఖానకు గల శక్తి గలిగినది. [3]చెవులకుగల శక్తి గలిగినది. ఆ యాత్మలు అంతటాను వున్నారు గనుక, ఆత్మ తత్వం అంతటాను వ్యాపించుకొనివున్నది.

1 E ఆ తత్వము 2 E లో -అంతటాను .........చెవులకు గల శక్తి గలిగినది- లేదు. 3 A అంతటాను చెవులుగల్గటై వినియెడిశక్తి C లో -చెవులకు గలశక్తి

గలిగినది _లేదు F అంతటాను చెవులుగలట్టి వినెడిశక్తి G అంతటాను చెవులు గలిగినట్టి వినెడిశక్తి

B పూర్తిపాఠం_ మరిన్ని, ఆ తత్వము అంతటాను హస్తాలు, పాదాలు గల శక్తి గలిగినది.

15

సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥

[1]స్వా(స్వ)భావాన సర్వమయిన యింద్రియాలున్ను తనకు లేనిదై వుండీన్ని, శరీరం ధరించినప్పుడు పంచేంద్రియాలతోగూడి, వానియొక్క గుణాలను [2]యెరిగెడిదిన్ని, స్వభావాన దేహసంగం లేకవుండీన్ని సమస్తజాతులందున్ను దేహం ధరించెడిదైన్నీ (దిన్ని), స్వా(స్వ)భావాన రాజస, తామస, సాత్విక గుణాలు తనకు లేక, శరీరసంబంధాన ఆ గుణాలు [3]ధరియించెడిదిన్ని.

1 B లో_స్వాభావాన................గుణాలను యెరిగెడిదిన్ని _అన్న భాగం లేదు. 2 AFG యెరిగేదిన్ని, C యెరిగినదై, 3 ACG ధరించినదిన్ని, B ధరించినదై, F ధరించేదై,

E లో ఈతాత్పర్యంలోని వాక్యాలు ముందువెనుకలుగా ఉన్నాయి. ఆ పూర్తి పాఠం:

E పూర్తి -స్వభావాన రాజస, తామస, సాత్విక గుణాలు తనకు లేక శరీర సంబంధాన ఆ గుణాలు ధరించినదిన్ని, సర్వమైన ఇంద్రియాలు తనకు లేనిదై ఉండిన్ని, శరీరం ధరించినప్పుడు పంచేంద్రియాలతోగూడి, దానియొక్క గుణాలను యెరిగేదిన్ని, స్వాభావాన దేహసంబంధం లేకుండిన్ని సమస్తజాతులందున్ను దేహం ధరించెడిదై.

16

బహిరంతశ్చ భూతానా మచరం చరమేవ చ
సూక్ష్మత్వా త్త దవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్॥

భూమి, వుదకం, తేజస్సు, వాయువు, [1]ఆకాశాది పంచమహా[2]భూతాలకు వెలుపల నున్నదై, [3]లోపల నున్నదై, [4]స్వాభావాన నిశ్చలమై, దేహసంబంధాన

చరిస్తున్నదై. సర్వశక్తితో దేహమందు వుండిన్ని అతిసూక్ష్మంగనుక, యెరుగ రానిదినై్న్న. [5]జ్ఞానులకు చేరువ నున్నదీనై్న్న.

1 ACG ఆకాశం అనెడి పంచ- B ఆకాశమున్ను అనెడి పంచ E ఆకాశం అనే పంచ- 2 BE భూతాలకున్ను 3 AC లలో -లోపల నున్నదై-లేదు. 4 E స్వభావనిశ్చలమై, 5 ABCEG అజ్ఞానులకు దవ్వుల నున్నదై, జ్ఞానులకు చేరువ నున్నదై.

F పూర్తిపాఠం- భూమి, వుదకము అతిసూక్ష్మంగనక యరగరానిదిన్నె, అజ్ఞానులకు దవ్వుల నున్నదై, జ్ఞానులకు చేరువ నున్నదై.

## 17

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్
భూతభర్తృ చ తద్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

సర్వప్రాణులందున్నూ జ్ఞానస్వరూపాన యేర్పరప[1]రాకవుండి. దేహాలు చూస్తేను [2]యేర్పరపవచ్చినట్టువలెనే వున్నదీనై్న్న. శరీరరూపాన పంచమహాభూతాలు ధరించీన్ని, వాటికంటేను యితరమును యెరుగదగినదీనై్న్న. అన్న[3]పానాదులున్ను దేహముఖాన [4]భుజియించెడిదై. ఆదేహ[5]ముఖాన [6]పుట్టుచున్నదై.

1 BC రాకుండిన్ని F రాకుండే 2 ABFG యేర్పరపవచ్చినట్టుంబలె నున్నదై, C యేర్పరుపవచ్చినట్టుంవలెనే వున్నదై, E యేర్పడవచ్చినట్టువలె నున్నదై, 3 ABCEG పానాదులను దేహ- F పానాదుల నా దేహ- 4 A భుజించేటిదిన్నె, C భుజింపదగిన దిన్నె E భుజియించిన దినై్న్న, G అనుభవించెడిదై, 5 BEF ముఖానే 6 BE పుట్టుచున్నదిన్నె.

## 18

జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పర ముచ్యతే
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥

జ్యోతిస్సులైన [1]సూర్యుడూన్ను. దీపమూన్ను. దీపమణులూన్ను మొదలయినవానిని తన జ్ఞానప్రభచాతను కానుపింపజేస్తున్నదై. చీకటియైయున్న ప్రకృతికంటెను [2]పరమమయినది గనుక, జ్ఞానస్వరూపమయిన ఆత్మతత్వమల్లాను జ్ఞానస్వరూపమె అని యెరుగదగినదినై్న్న. జ్ఞానసాధనాలయిన గుణాల[3]చాత పొంద

దగినదినై ౨. [4]సమస్తప్రాణుల హృదయాలందున్ను [5]యేర్పడివున్నది ఆత్మతత్వము.

1 AF సూర్యుడు, దీపములు, మణులు మొద- BCEG సూర్యుడు, దీప మణులు మొద- 2 AF పరమమై, అటుగనుకె BC పరమై, అటుగనక E పరమమైనదై, జ్ఞాన- 3 ABFG చాత పొందదగిందినై, C చేతల దగిలేదినైన్ని, 4 B సమస్తమైన ప్రాణి హృద- 5 CEF యేర్పడివుండినది ఆత్మ- B యేర్పడక వున్నది ఆత్మ- G యేర్పరుపరాక వుండిన[ది] ఆత్మ-

19

ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావా యోపపద్యతే॥

యీరీతిని క్షేత్రస్వరూపమూన్ను. [1]జ్ఞానానకు సాధనాలయిన [2]గుణాలయొక్క స్వరూపమూన్ను. యెరుగదగిన ఆత్మస్వరూపమూన్ను [3]సంక్షేపాన చెప్పితిని. [4]యింతవట్టున్ను నాభక్తుడయినవాడు యెరిగి, నావలెనే సంసారదోషాలు లేనివాడవును.

1 CF జ్ఞానాలకు 2 E గుణాల స్వరూపాలున్న, 3 E లో- సంక్షేపాన- లేదు. 4 E లో - యింతవట్టున్న- లేదు.

B పూర్తిపాఠం - యిది క్షేత్రమున్నూ, జ్ఞానమున్నూ, జ్ఞేయమున్నూ, యుక్తిన్ని చెప్పితిని. నా భక్తులైనవారికి జ్ఞానమున్నూ, నా భావమున్నూ కాన వచ్చును.

20

ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసంభవాన్॥

యీ ప్రకృతీన్ని, పురుషుడున్నూ, అనాదినుండీన్ని గూడుకొని వున్నారని యెరుగుము. సంసారహేతువులయిన యిచ్ఛా[1]ద్వేషాలు మొదలయిన [2]వికారాలున్నూ, జ్ఞాన[3]సాధనాలయిన, మోక్షహేతువులయిన తొలుత జెప్పిన [4]గుణాలున్నూ ప్రకృతివల్ల [5]బుట్టినవానిగా నెరుగుము.

